అపరాధ పరిశోధన అనుబంధం—37

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ప్రత్యక్ష సాక్షి

రచన : వసుంధర

## రాబందుల చేతిలో రాకుమారి

రచన : అజీజ్

## గూడుపుఠాణి

రచన : రంకిరెడ్డిరాము

## గుడ్డివాళ్ళు

రచన : సంపత్

'శాన్యోరా' సీరియల్-మొదటిభాగము

గెడా రంగారావు

# ప్రత్యక్ష సాక్షి

వసుంధర

వెతకబోయిన తీగ కాలికి తగిలిన విధంగా శేషగిరి నాకు బజార్లో తటస్థపడ్డాడు. అయితే అతను కాఫీ హోటల్లో దూరడంవల్ల నేను బయట కిళ్ళీకొట్టు వద్ద ఎదురుచూస్తూ ఉండిపోయాను.

శేషగిరి నాకు స్నేహితుడు కాదు. అయ్యే అవకాశం కూడా లేదు. అతనికీ నాకూ అంతస్థులో చాలా భేదముంది. నేను మామూలు బడిపంతుల్ని. అతను లక్షాధికారి. అతను నన్నేమయ్యా పంతులూ అంటే నేనతన్ని నమస్కారమండీ శేషగిరిగారూ అని పలకరిస్తారు. ఇద్దరం ఇంచుమించు సమవయస్కులమే !

శేషగిరికి ముగ్గురు కొడుకులు. పెద్దవాడికిప్పుడు ఇరవ

య్యేళ్ళుంటాయి. రెండోవాడికి పద్దెనిమిది. మూడోవాడికి పధ్నాలుగు ఉంటాయి. రెండోవాడికీ మూడోవాడికీ మధ్య పదిహేనేళ్ళ ఆడపిల్ల ఉంది.

శేషగిరి పిల్లలందరికీ నేను ప్రయివేట్లు చెప్పాను. చివరి ఇద్దరికీ ఇంకా చెబుతున్నాను. అదే మా పరిచయం.

నాకు ముగ్గురు పిల్లలు. పెద్దమ్మాయి వరలక్ష్మికి పంతొమ్మిదో ఏడు. రెండో అమ్మాయి రామావతికి పదహారేళ్ళు. ఆఖరివాడు రామనాథానికి పన్నెండేళ్ళు.

నాలుగురోజుల క్రితం వరలక్ష్మిని చూసుకుందుకు పెళ్ళివారొచ్చారు. నా కూతురని అనకూడదు కానీ వరలక్ష్మి చక్కనిచుక్క. ఏ పెళ్ళివారికైనా ఆమె అందం వెంటనే నచ్చుతుంది. అయితే పెళ్ళికి అందమొక్కటే చాలదు కదా- అందులోనూ చాలామందికి డబ్బే అందం.

వచ్చిన పెళ్ళివారు పిల్లనచ్చిందనీ అయిదువేలు కట్నమిచ్చే పక్షంలో ఈ పెళ్ళి జరుగుతుందనీ అన్నారు. అయిదు వేలివ్వలేనని ఖచ్చితంగా చెప్పేశాను. వరలక్ష్మి పేరుచెప్పి- రామావతి, రామనాథముల భవిష్యత్తులో చీకటి నింపడం నాకిష్టం లేదు. నా షరతులు నేను చెప్పేశాను. పెళ్ళి గుడిలో జరుగుతుంది. కట్నం వెయ్యిన్నూట పదహార్లకు మించదు. ఏ ఇతర లాంఛనాలూ జరపలేను.

నా మాటలువిని ముఖం ముడుచుకుని వెళ్ళిపోయారు పెళ్ళివారు. కానీ పెళ్ళికొడుక్కు పిల్లబాగా నచ్చినట్లు అతని ముఖం చూస్తూంటే తెలుస్తుంది. కానీ నేను మరింక ఆశలు పెట్టుకోలేదు. అయితే ఆశ్చర్యకరంగా నిన్న ఆ పెళ్ళివారింటినుంచి కబురు వచ్చింది. మ్రాడికి పిల్ల

నచ్చిన కారణంగా నా షరతులన్నింటికీ అంగీకరించామనీ, ఎటొచ్చీ కట్నం మాత్రం రెండు వేలియ్యవలసి ఉంటుం దనీ చెప్పారు.

వాళ్ళంత గా దిగివచ్చినపుడు నేనూ పట్టుదలగా ఉండ కూడదనిపించింది. అందుకే నా అంగీకారాన్ని తెలియ బరిచాను. మంచి ముహూర్త మొకటి ఈ నెల్లో నే చూసి పెళ్ళి జరిపించేయాలని మగపెళ్ళి వారభిప్రాయ పడు తున్నారు. కుర్రాడు గుమాస్తా ఉద్యోగం చేస్తూ దగ్గర దగ్గర నెలకు నాలుగొందలు సంపాదిస్తున్నాడు. మనిషి చూడ్డానికి లక్షణంగా ఉన్నాడు. వినయంగా ప్రవర్తి స్తున్నాడు. వరలక్ష్మి ఈ పెళ్ళి చేసుకుని తప్పక సుఖ పడగలదని నాకు తోస్తోంది.

కూతుళ్ళ పెళ్ళిని దృష్టిలో ఉంచుకుని నేను నాకు వచ్చే ట్యూషన్సుడబ్బుని బ్యాంకులో రికరింగ్ డిపాజిట్లో వేస్తున్నాను. ఈ సంవత్సరం చివరకు రెండు వేల అయిదు వందలు వస్తుంది. కాబట్టి ఈ పెళ్ళి జరగాలంటే డబ్బు నాకు మరీ అంత సమస్యకాదు. ఇప్పటికిప్పుడు మాత్రం ఎవరైనా రెండు మూడు వేల రూపాయలు అప్పుగా ఇవ్వ గలిగితే పని సానుకూల మవుతుంది. అలా నాకు సాయ పడగలవాడు శేషగిరి. నిన్న రాత్రిల్లా బాగా ఆలోచించి అతన్ని వెదుక్కుంటూనే ఈ రోజు బయల్దేరాను. ఇంటికి వెడితే ఇంట్లో లేడన్నారు. సరేనని వచ్చేస్తే - బజార్లో వెతకబోయిన తీగ కాలికి తగిలిన విధంగా శేషగిరి నాకు తటస్థ పడ్డాడు.

శేషగిరి హోటల్లో సుమారు అర్థగంట ఉన్నాడు. అతను హోటల్లోంచి బయటకువచ్చి ఎవరికంకా చూడ

లేదు. ఏదో సీరియస్ గా ఆలోచిస్తూ అతను పేవ్ మెంట్ మీద త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ వెడుతున్నాడు. నా అవసరముంది కనుక నేనతన్ని అనుసరించాను. నా అవసరమలాంటిది కనుక - అతన్ని వెంటనే పలకరించలేక అనుసరించుకుంటూ వెళ్ళాను.

సాధారణంగా కార్లో తిరిగే శేషగిరి ఈ రోజు కాలి నడకన బయల్దేరడం విశేషమే ననిపించింది. అయినా డబ్బున్నవాళ్ళ విచిత్ర మనస్తత్వాన్నర్థం చేసుకోవడం అంత సులభం కాదు.

శేషగిరి వెనక్కి తిరక్కుండా - ఎవరికేసీ చూడకుండా వడివడిగా అడుగులు వేసుకుంటూ సూటిగా నడుచుకుంటూ వెళ్ళిపోతున్నాడు. అతను రెండు సందులు తిరిగాడు. అతనితోపాటే నేనూను.

ఒక సందులో ఒక చిన్న పెంకుటింటి ముందు ఆగేడతను. క్షణం తటపటాయించి ఒక్కసారి అటూయిటూ చూశాడు. ఎందుకో అతని కళ్ళబడరాదనిపించింది నాకు చటుక్కున కనిపించిన పక్కింటి మెట్లెక్కాను. కానీ అతన్ని గమనిస్తున్నాను.

శేషగిరి ఆ ఇంట్లోకి వెళ్ళాడు. అయిదు, పది, పదిహేను నిముషాలు గడిచినా ఇంకా బయటకు రాలేదు. నేను అసహనంగా ముందుకు కదిలాను. ఆ ఇంటి ముందు మరో అయిదు నిముషాలు నిలబడ్డాను. ఇంక నాలో ఓర్పు నశించింది. ఆ ఇంటివైపు చూశాను. తలుపులు పూర్తిగా వేసిలేవు. ఏమైతే అయిందని ధైర్యంగా ముందడుగు వేశాను.

తలుపులు తోసుకుని లోపలికి అడుగు పెట్టాను. విశాల

మైన హాలు. హాల్లో మూడు గుమ్మాలున్నాయి - వీధి గుమ్మంతాక, క్షణం తటపటాయించి కుడివైపు ద్వారం వైపు దారి తీశాను. తలుపులు కొద్దిగా తీసి - కనబడ్డ దృశ్యంచూసి ప్రాన్పడి పోయాను.

ఒక వ్యక్తి నేలమీద పడి ఉన్నాడు. అతనిగుండెల్లో కత్తిదిగి ఉంది ఆ వ్యక్తి - పక్కన కూర్చుని కత్తిపిడిని జేబురుమాలుతో తుడుస్తున్నా డొకతను. ఆ వ్యక్తి శేషగిరి.

నేను తలుపు తోయగానే శేషగిరి ఉలిక్కిపడి లేచాడు. నన్నుచూసి అప్రయత్నంగా - "నువ్వా - పంతులూ !" అన్నాడు. అంటూనే ముందుకు వచ్చాడు.

నా శరీరంలో వణుకు ప్రారంభమైంది. పారిపోవాలని పించింది కానీ కాళ్ళు సహకరించలేదు. ఒక నిండు ప్రాణాన్ని నిలువునా తీయగల క్రూరత్వం శేషగిరిలో ఉన్నట్లు ఇంతవరకూ నాకు తెలియదు. అయితే ఆ క్రూర త్వాన్నిప్పుడు నేను కళ్ళారా చూశాను. శేషగిరి నన్నేం చేస్తాడు ?

శేషగిరి నన్ను సమీపించి- "ఎందుకొచ్చావిక్కడికి"? అనడిగాడు.

నేను తడబడుతూ ... "నేనేం చూడలేదు...ఏమీ చూడలేదు..." అన్నాను.

"చూడలేదులే - ఎందుకొచ్చావని అడుగుతున్నాను" రెట్టించాడు శేషగిరి.

"పెద్దమ్మాయికి పెళ్ళి నిశ్చయమైంది. మూడు వేలు కావాలి. అప్పెక్కడా దొరక్క మీ యింటికి వెళ్ళాను. మీరు లేరన్నారు. నిరుత్సాహంగా బయటకు వచ్చేశాను.

అనుకోకుండా ఈ ఇంట్లోకి వెడుతూన్న మీరు కన బడ్డారు. కాసేపు ఎదురుచూసి లోపలకు వచ్చాను. అంతే ఇంకేమీ చూడలేదు..."

శేషగిరి నిట్టూర్చి జేబులోకి చెయ్యి పోనిచ్చాడు. జేబు లోంచే ఒక నోట్లకట్ట బయటకు తీసి నాకిచ్చాడు. అది కొత్త నోట్లకట్ట. అన్నీ యాభై రూపాయల నోట్లు.

"మొత్తం అయిదువేలు. అప్పుగా కాదు. ఊరికే ఇస్తున్నాను. వెంటనే ఇక్కణ్ణించి వెళ్ళిపో" - అన్నాడు శేషగిరి.

నేను వెంటనే వెనుదిరిగాను.

"ఇదిగో - వెళ్ళేముందు ఒక్కమాట. నువ్వు మూడు వేలడిగితే నేనైదు వేలిచ్చాను. నువ్వప్పుగా అడిగితే నేనూరికే ఇచ్చాను. యివన్నీ నువ్వు గుర్తుంచుకోనవసరం లేదు. కానీ ఇక్కడ నువ్వేమీ చూడలేదన్న విషయం మాత్రం గుర్తుంచుకోవాలి-" అన్నాడు శేషగిరి.

## 2

మర్నాడు పేపర్లో ఆ హత్య గురించిన వివరాలు పడ్డాయి.

హతుడెవరో తెలియడం లేదట. హంతకుడు హత్య చేశాక - అక్కడ తనకు సంబంధించిన ఏ గుర్తులూ లేకుండా జాగ్రత్త పడ్డాడట. కత్తిపిడి మీద వేలిముద్రలతో సహా అన్ని ఆధారాలూ తుడిచేశాడట. హతుడెవరో, హంతకుడెవరో - అసలాహత్య ఎందుకు జరిగిందో ఎవరికీ అంతుపట్టడం లేదట.

హత్యజరిగిన ఆ యిల్లు సుబ్రహ్మణ్యం అనే అతని పేరు మీద ఉన్నదట. ఆ సుబ్రహ్మణ్యం ఎవరోకూడా ఆచోకీ

తెలియడం లేదు. ఇల్లు విశాలమైన ఆవరణలో ఉండడం ఆ చుట్టుపక్కల వాళ్ళెవ్వరికీ - ఆ ఇంట్లో ఎవరున్నారో ఏంజరుగుతూంటుందో తెలియదట. చూచాయగా ఎవరికైనా తెలిసివున్నప్పటికీ-హత్య జరిగిన ఇల్లు కావడంతో ఎవ్వరూసరైన సమాచార మివ్వడం లేదని పోలీసులు భావిస్తున్నారుట.

వివరాలు చదివితే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. శేషగిరి అన్నీ పథకం వేసుకుని చాలా పకడ్బందీగా చేశాడు హత్య. అనుకోకుండా నేను చూడటం సంభవించింది తప్పితే - లేకుంటే ఎవ్వరికీ ఈ హత్యగురించి మూడో కంటివాడికైనా తెలిసుండేది కాదు.

నా మనసు మనసులో లేదు. భావిభారత పౌరుల్ని తీర్చిదిద్దవలసిన ఉపాధ్యాయుణ్ణి నేను. నా కళ్ళముందు జరిగిన హత్య గురించి నిర్లిప్తంగా ఉంటున్నాను. ప్రభుత్వానికి, పోలీసులకు సమాచారాన్నందించడం లేదు. నేను చేస్తున్నది పెద్దతప్పు. అయిదు వేలు లంచం తీసుకుని అధర్మానికి అమ్ముడు పోయాను.

ఎల్లకాలమూ మనస్సాక్షిని నమ్ముకోకూడదు. వాస్తవిక జీవితంలోని సాధకబాధకాలు మనకు కర్థం కావు. దానికి మనిషిని సాధించడం మాత్రమే తెలుసును.

అయితే ఆ సాయంత్రం జరిగిన మరో సంఘటన నా మనసుకు కూడా బుద్ధి చెప్పింది.

సుమారు అయిదుగంటల ప్రాంతంలో-నేను ట్యూషన్ చెప్పడానికి శేషగిరింటికి బయల్దేరుతున్న క్షణంలో మా యింటికి ఒక మనిషి వచ్చాడు. ఆరడుగుల ఎత్తుగల ఆ మనిషి కండలు తిరిగి - భీముడిలా ఉన్నాడు. పాంటూ

షర్టు వేసుకున్నప్పటికీ ముఖంలోనూ కళ్ళలోనూకూడా సంస్కారం కనబడ్డం లేదు. అతని చూపులు తీవ్రంగా ఉన్నాయి కూడా.

అతన్ని నేనాశ్చర్యంగా చూస్తూ - "ఎవరు కావా లండీ ?" అనడిగాను.

"శివశంకరంగారూ మీరేనా ? " అడిగేడతను.

ఆశ్చర్యపోతూ - "అవును- నేనే!" అన్నాను.

"అయితే మీరే కావాలి -" అన్నాడతను.

"రండి-కూర్చోండి-" అన్నాను. అతనువచ్చి కుర్చీలో కూర్చుని ఒకసారి మా యింటిని పరీక్షగా చూశాడు. అతని ముఖంలో రవంత తిరస్కారభావం కనబడింది.

"బడిపంతులట కదా మీరు-" అన్నాడతను.

అతనడిగిన పద్ధతి నాకు నచ్చలేదు - "మీ రెవరో తెలుసుకోవచ్చా?"

"నేనెవర్నంటారా -" అతను అర్థం లేకుండా నవ్వాడు - "పచ్చినెత్తురు తాగేవాణ్ణి -"

ఉలిక్కిపడ్డాను. అతను పచ్చినెత్తురు తాగేరకమని చూస్తూంటే అనిపిస్తుంది. కానీ అతనికి మా యింట్లో పనే ముంది ? నాకు కాస్త భయం కూడా వేసింది. మా ఇంటిలో పచ్చినెత్తురు దొరకదని - ఎలా చెప్పగలను. మొత్తం అయిదుగురం మనుషులున్నాం !

"మీ మాటలు సరిగా అర్థం కావడం లేదు. మీకు నాతో పనేమిటోకూడా తెలియడం లేదు..." అన్నాను వీలైనంత వినయంగా.

"ఆ అవసరం మీకేంలేదులెండి. నేను మామూలుగా నాటుసారా తాగుతుంటాను. అవసరమైనప్పుడు మాత్రం

పచ్చినెత్తురు తాగుతుంటాను. ఖర్చుగురించి భయపడే రకం కాదు నేను. ఎంత ఖర్చయినా నాగురించి భరించే పెద్దమనిషి ఉన్నాడు..." అతను ఆగాడు.

నేనేమీ మాట్లాడకుండా అతని వంకే చూస్తున్నాను.

"ఆ పెద్దమనిషి పేరు శేషగిరి. ఆయన ధర్మాత్ముడు. లేనివాళ్ళకివ్వడానికి కాయన చేతికి ఎముకుండదు. ఎవరింట్లోనైనా పెళ్ళిఅంటే ఆయన అయిదువేలు దానంకూడా ఇస్తూంటాడు..."

"అలాగా ?" అన్నాను ఏమనాలో తెలియక.

"పచ్చినెత్తురు తాగే నేను శేషగిరిగారంటే ప్రాణమిస్తాను. ఆయన స్నేహితులంతా నాకు స్నేహితులు. ఆయన శత్రువులంతా నాకు శత్రువులు. శత్రుత్వమంటే నేనెంతకైనా తెగిస్తాను. ఎందుకంటే నాకు జైలు, పోలీసులు అంటే భయం లేదు..." అన్నాడతను.

"మీ పేరు తెలుసుకోవచ్చా..." అడిగాను.

"గవర్రాజు..." అన్నాడతను.

"చూడండి గవర్రాజుగారూ - మీరీ విశేషాలన్నీ నాకెందుకు చెబుతున్నారో తెలియదు..."

"ఇంకా చెబుతాను వినండి..." అన్నాడు గవర్రాజు "నాకెవ్వరూలేరు నాకు నేనే. ఈ లోకంలో అందుకే నేనేమైపోతానన్న భయం లేదు నాకు. శేషగిరిగారేదైన అయిపోతారని అనుమానం కలిగినప్పుడు_ నేనేమైనా అయిపోతాను..."

"అన్నీ బాగానే ఉన్నాయి. కానీ ఈ వివరాలు తెలుసుకోవడంవల్ల నాకు ప్రయోజనమేమిటి ?"

"చాలా ప్రయోజనముంది_ ఎప్పుడైనా శేషగిరి

గురించి ఆలోచించినపుడు - మీ ఆలోచనల్లోకి నన్ను కూడా రానివ్వండి. అప్పుడు మీ ఆలోచనలు సక్రమమైన దారిలో పడతాయి..." అతను లేచి "వస్తానుమరి. చాలా శ్రమిచ్చినట్లున్నాను. నన్ను మాత్రం మరచిపోకండి..." అన్నాడు.

అతను వెళ్ళిపోయాడు.

అర్థమైంది, నా బుద్ధి పెడత్రోవలు పడుతుందేమోనని శేషగిరి నాకు హెచ్చరిక పంపాడు.

# 3

వరలక్ష్మి అత్తారింటికి వెళ్ళిపోయింది. ఎన్నాళ్ళుగానో అలవాటైపోయిన నా పెద్దకూతురు ఇంట్లో లేకపోవడంతో ఇల్లు బాగా చిన్నబోయింది.

సాయంత్రం ఒక్కణ్ణి నడవలో కూర్చున్నాను. ఆ రోజు ప్రయివేటు లేదు. కాస్త దాహంవేస్తే, అలవాటు ప్రకారం "అమ్మాయ్ వరలక్ష్మీ" అని పిలిచి నాలిక్కరుచుకున్నాను. ఇంకెక్కడి వరలక్ష్మి—అది హాయిగా కాపురానికి వెళ్ళిపోయింది.

"ఏం నాన్నా!" అంటూ పరుగెత్తుకు వచ్చింది, నా రెండో కూతురు రామావతి. దానికేసి చూడ్డానికి భయం వేసింది. ఎవరుమాత్రం నా దగ్గర శాశ్వతంగా వుంటారు? ఈ నా డనుబంధాల్ని పెంచుకుంటే రేపది ఆ బంధాలన్నీ తెంచుకుని భర్తతో ఎగిరిపోతుంది. అయినా నెమ్మదిగా రామావతికూ్కడా సంబంధాలు చూడాలనుకున్నాను.

"ఏం నాన్నా" అంది మళ్ళీ రామావతి.

"కాస్త దాహంగా వుందమ్మా" అన్నాను. రామావతి లోపలకు పరుగెత్తింది. మరుక్షణంలోనే చేతిలో

గ్లాసుతో మంచినీళ్ళు తీసుకువచ్చి నాకిచ్చింది. సరిగ్గా అప్పుడే ఎవరో తలుపు తట్టారు.

"ఎవరో చూడమ్మా" అని మంచినీళ్ళు తాగి గ్లాసు కుర్చీపక్క నేలమీద పెట్టాను.

రామావతి తలుపు తీసింది. సుమారు పాతికేళ్ళ యువకుడు లోపల అడుగుపెట్టాడు. మనిషి చాలా ఫేషనబుల్‌గా వున్నాడు. "శివశంకరంగారి ల్లిదేనాండీ!" అన్నాడతను మర్యాదగా.

ఆ యువకుణ్ణి చూసి రామావతి సిగ్గుపడింది. "ఆయనే శివశంకరంగారు. మా నాన్న" అని తను ఇంట్లోకి వెళ్ళిపోయింది. అతను నెమ్మదిగా నా దగ్గరకు నడుచుకుంటూ వచ్చి, "నమస్కారమండీ" అన్నాడు.

అతన్ని నేను పరీక్షగా చూశాను. మనిషి నెక్కడా చూసిన గుర్తులేదు. ఎప్పుడూ పరిచయమున్నట్లు స్ఫురించడంలేదు. ఇప్పుడే మొదటిసారిగా చూస్తున్నట్లుంది. సంశయంగా చూస్తూ, "అలా కూర్చోండి. మీ రెవరో ఎంత ప్రయత్నించినా గుర్తు రావడంలేదు" అన్నాను.

"ఎలా వస్తాన్లెండి, ఇదే మన తొలి పరిచయం" అన్నాడతను నవ్వి.

అతను మాట్లాడ్డంలో వినయం, మర్యాద, గౌరవం అన్నీ ఇమిడివున్నాయి.

"నన్ను రామారావంటారు. నేనొక ప్రయివేట్ డిటెక్టివ్‌ని" అన్నాడతను మళ్ళీ.

ఆశ్చర్యంగా అతనివంక చూసి, "ప్రయివేట్ డిటెక్టివ్‌లకు నాతో ఏం పని?" అన్నాను.

"ఒక హత్యాకేసు విషయంలో మీ దగ్గర్నుంచి కొంత

సమాచారం లభిస్తుందని తెలిసి వచ్చాను.''

''హత్య కేసా?'' భయంగా అన్నాను.

''అవును. శివరావు హత్యకేసు!'' అన్నాడతను.

''శివరావంటే ఎవరు?''

''శివాలయం వీధిలో సుబ్రహ్మణ్యంగారింట్లో గత నెలలో హత్య చేయబడ్డాడు శివరావు'' రామారావు చెప్పాడు.

నాకు అర్థమయింది. ఆ హత్యకు నేను ప్రత్యక్ష సాక్షిని. అప్పట్లో పేపర్లో పడిన వివరాలనుబట్టి హతుడి పేరు తెలియలేదు. ఆ తర్వాత ఆ కేసుగురించి పూర్తిగా మరిచిపోయాను. అందులోనూ గవర్రాజు వచ్చి హెచ్చరించాడు కాబట్టి, ఇంక అసలా విషయం పట్టించుకో దల్చలేదు. అయితే ఆ హత్యగురించి నాకు తెలుసునన్న విషయం ప్రయివేట్ డిటెక్టివ్ రామారావుదాకా ఎలా వచ్చింది?

''అవును. ఆ హత్యగురించి పేపర్లో చదివాను.అప్పట్లో హతుడి పేరు తెలియదని రాశారు...''

రామారావు నవ్వాడు. ''ఏ కేసయినా మొదట్లో అలానే వుంటుంది. కానీ, పోలీసులు చేతులు ముడుచుకూర్చోరు. వెంట్రుకనుంచి మొదలుపెట్టి మనిషిని సాధిస్తారు. ఆ తర్వాత కేసు చాలాదూరం వెళ్ళింది. హతుడి పేరు శివరావు. అతనొక బ్లాక్ మెయిలర్. ఈ ఊళ్ళోని ధనవంతులు చాలామంది ప్రాణాలతని గుప్పెట్లో వున్నాయి. అందర్నీ బెదిరించి డబ్బు గుంజడం అతని వృత్తి. అతను డబ్బు తీసుకుందుకు సుబ్రహ్మణ్యం యింటి కెన్నుకున్నాడు.

సుబ్రహ్మణ్యానిదీ ఊరు కాదు. కానీ, అతనికీ ఊళ్ళో ఇల్లుంది. ఆ ఇంటి నతను శివరావు కద్దెకిచ్చాడు. నెలనెలా ఠంచనుగా అద్దెడబ్బులు మనియార్డరు రూపంలో చేరు తూండడంవల్ల అతను ఇంటిగురించి పట్టించుకోలేదు. శివ రావుచేత బ్లాక్ మెయిల్ చేయబడుతున్న ఒక ధనవంతుడు డబ్బుతో వచ్చినట్లే వచ్చి శివరావుని హత్యచేసి వెళ్ళిపోయాడు. ఆ హంతకుడెవరో మీరు చెప్పాలి...”

నేనాశ్చర్యంగా అతని వంక చూశాను. “మీరు చెప్పిన వివరాలు చాలా ఆసక్తికరంగా వున్నాయి. కానీ, ఆ హంతకుడెవరో నన్ను చెప్పమనడం భావ్యంగా లేదు. ఇది పూర్తిగా నాకు సంబంధించని విషయం.”

“మేస్టారూ, మీ రబద్ధమాడుతున్నారు. ఆ హంతకు డెవరో మీకు తెలుసు. మీకు తెలిసిన నిజాన్ని మీరు బయటపెట్టి తీరాలి. అలా చేయకపోతే ఒక నిర్దోషి అన్యాయంగా బలైపోతాడు” అన్నాడు రామారావు.

ఉలిక్కిపడ్డాను. “నిర్దోషి బలికావడమా, కాస్త వివరంగా చెప్పండి!”

“చెప్పడానికేమీలేదు. మామూలు కథే—శివరావును హత్యచేశాడన్న ఆరోపణపై అమాయకుడు మోహన్ అరెస్టయ్యాడు” అన్నాడు రామారావు నిట్టూర్చి.

“అదెల్లా జరిగింది?”

“మోహన్—భాగ్యవంతుల బిడ్డ. మాధవరావుగారు మీకు తెలిసే వుంటారు. ఆయన ఏకైక పుత్రుడు. ఉన్న వాడు కాబట్టి, కాస్త విలాసంగా తిరుగుతాడు. తనెలా గుంటేనేం, ఎవర్నీ బాధించ డతను. మనసు చాలా

మంచిది. హత్యాస్థలంలో—హత్య పరిశోధించినపుడు పోలీసుల కొక ప్రత్యేక పరిమళం సోకింది. ఆ పరిమళం అక్కడున్న కుర్చీలోంచి వస్తోంది. మంచి పరిమళం గల సెంటు రాసుకున్న వ్యక్తి ఆ కుర్చీలో కూర్చుని వుండాలని పోలీసులు అభిప్రాయపడ్డారు. ఆ కుర్చీ చేతులమీద ఎవరివో వ్రేలిముద్రలుంటే ఫోటోలు తీశారు. ఇది చాలా ముఖ్యమైన విషయం కాబట్టి, పోలీసులు రహస్యంగా వుంచారు.

ఆ మధ్య ఏదో రాష్ డ్రైవింగ్ అన్న పేరుమీద మోహన్ పోలీస్ స్టేషన్ కు వెళ్ళాల్సి వచ్చింది. ఘుమఘుమ లాడే సెంటు పరిమళం అతను వెళ్ళాక అతను కూర్చున్న కుర్చీ నంటిపెట్టుకునే వుంది. విచారణమీద తెలిసిన దేమిటంటే, పారిస్ లో వుంటున్న మోహన్ స్నేహితు డొకతను, ఆ సెంటుని ప్రత్యేకంగా అతనికోసం పంపుతాడు. శివరావు హత్యాస్థలంలో వచ్చిన సెంటు పరిమళం, మోహన్ వాడే సెంటు పరిమళం ఒక్కటే. దీన్నాధారంగా తీసుకుని పరిశోధించాక హత్యాస్థలంలోని కుర్చీ చేతిమీద వున్న వ్రేలిముద్రలు మోహన్ వ్రేలిముద్రలతో సరిపోయాయి. వెంటనే మోహన్ అరెస్టయ్యాడు.''

ఆశ్చర్యంగా వింటున్నాను. నిజంగానే పోలీసు లసాధ్యు లనిపించింది. తలా తోకా లేని కేసుగా నేను దీన్ని భావించాను. పోలీసులేమీ చేయలేరనుకున్నాను. కానీ, కోడిగ్రుడ్డుకు ఈకలు పీకేలా వున్నారీ పోలీసులు.

''బాగానే వుంది. కానీ, మోహన్ హత్యచేశాడని ఎలా ఋజువు చేయగలరు?'' అన్నా న్నేను.

''ఋజువింకా లేదు. కానీ, పరిస్థితులు మోహన్ కు ప్రతికూలంగా వున్నాయి. శివరావు మోహన్ ని బ్లాక్

మెయిల్ చేస్తున్నట్టు ఋజువు దొరికింది. కాబట్టి, హత్యకు కారణం కనబడుతోంది. హత్యాస్థలంలో అతనున్నట్లు ఋజువైంది. ఈ మాత్రం చాలు—కేసు బలపడడానికి."

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. "అయితే శివరావు, మోహన్‌ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడన్న మాట. అందుకని మోహన్, శివరావుని చంపేశాడంటారు పోలీసులు."

"అవును. సోదాచేయగా మోహన్ దగ్గర శివరావు రాసిన ఉత్తరాలు చాలా దొరికాయి. అందులో ఒక ఉత్తరంలో, నన్ను చంపుతానని బెదిరించి ప్రయోజనం లేదు. నన్ను చంపి నువ్వు సాధించగలిగింది లేదు. నన్ను చంపే ఆలోచన కట్టిపెట్టి, నే నడిగిన డబ్బిచ్చావో, నువ్వే సుఖపడతావు అని రాశాడు. ఇవన్నీ మోహన్‌ని తిరుగులేని దోషిగా నిలబెడుతున్నాయి. పోలీసుల ప్రశ్నల కతను సంతృప్తికరమైన సమాధానా లివ్వలేక పోతున్నాడు. ఈ పరిస్థితుల్లో అతన్ని రక్షించగలవా రొక్కరే వున్నారు. శివరావు హత్యను కళ్ళారా చూసిన మీరు" అన్నాడు రామారావు.

"చాలా బాగుంది. శివరావు హత్యను నేను కళ్ళారా చూడ్డమేమిటి, ఎవరైనా నవ్విపోతారు" అన్నాను. కానీ, నాకు నవ్వు రాలేదు.

రామారావు ముఖం గంభీరంగా వుంది. "తన కొడుకును రక్షించే బాధ్యత మాధవరావుగారు నామీద పెట్టారు. నీటిలో జాడలు తీయగల సమర్థత నాకుందని ఈపాటికే మీరు తెలుసుకుని వుండాలి. ఒక నిండు ప్రాణం అన్యాయంగా బలైపోతుంటే, సహించగల మనస్తత్వం మీ కుందని నే ననుకోను. ఆలోచించండి."

"ఆలోచనతో హంతకుణ్ణి తెలుసుకోవడం సాధ్యమయే పక్షంలో, అది నాకంటే మీకే ఎక్కువ సాధ్యపడు తుంది. ఎందుకంటే మీరు ప్రయివేట్ డిటెక్టివ్ కదా" అన్నాను.

"శివశంకరంగారూ" రామారావు తీవ్రంగా అన్నాడు. "నిజాన్ని రాబట్టడానికి మా పద్ధతులు మాకుంటాయి. తన కొడుకుని రక్షించడంకోసం మాధవరావుగారు ఎంత డబ్బు ఖర్చు పెట్టడానికైనా సిద్ధంగా వున్నారు. తన కొడుకును రక్షించే సాక్ష్యం చెప్పగలవారి కాయన పది వేలు రొక్కం బహుమతిగా ఇవ్వదల్చుకున్నాడు."

శేషగిరి ఇచ్చిన అయిదువేలూ నా మదిలో మెదిలాయి. అది తన ప్రాణం కాపాడుకునేందుకు శేషగిరి నాకిచ్చిన డబ్బు. అంటే అతని ప్రాణం నాకు సంబంధించినంత వరకూ ఐదువేలు చేస్తుంది. ఇప్పుడు మోహన్ ప్రాణాల విలువ పదివేలు. నేనతని ప్రాణాలను రక్షించగల స్థితిలో వున్నాను. అలా రక్షించడంవల్ల నాకు పదివేలొస్తాయి. ఒక నిర్దోషి రక్షించబడతాడు. ఆ తర్వాతేం జరుగు తుంది? నరసరాజు గుర్తొచ్చాడు నాకు. నా ప్రాణాల విలువెంతో నాకు తెలియదు కానీ, అకారణంగా చావడం నా కిష్టంలేదు. నామీద ఆధారపడి బ్రతుకుతున్న వాళ్ళు ముగ్గురున్నారు. వాళ్ళతో కలిసి జీవించాలన్న కోరిక నాలో గాఢంగా వుంది.

"సరే, ఐతే డబ్బు ఖర్చుపెట్టి నిజం రాబట్టుకోండి. నా దగ్గరకు వచ్చి ప్రయోజనం?"

"మేష్టారూ, డబ్బు ఖర్చుపెట్టడం మొదటి మెట్టు. రెండవ మెట్టుగా, మిమ్మల్నీ హత్యకేసులో యిరికించ

గలను'' అన్నాడు రామారావు.

''చాలా బాగుంది'' అన్నాను కోపంగా.

''ఇంకా బాగుంటుంది వినండి. ఆ రోజు—శివరావు హత్య జరిగినరోజు ఆ సమయంలో మీ రక్కడికి వెళ్లారు. మీ స్టూడెంట్ ఒకతను మీరా ఇంట్లోకి వెళ్ళడం చూశాడు. మీ వేలిముద్రలు శివరావు హత్యచేయబడ్డ గది తలుపులమీద వున్నాయి. అవి ఎవరివో పోలీసుల కింతవరకూ తెలియలేదు. ఈరోజు నేను తెలియజేయ గలను.''

''తెలియజేయండి...శివరావుకూ, నాకూ ఏం సంబంధ ముందని—అతన్ని చంపుతాను?''

''ఈ రామారావు సంగతి మీకు తెలియదు. మీ రతన్ని చంపడాని క్కారణంకూడా తెలుసుకోగలిగాను. మోహన్ విలాసపురుషుడు. అతను మీ పెద్దమ్మాయి వర లక్ష్మితో సంబంధం పెట్టుకున్నాడు. ఆమెను పెళ్ళి చేసు కుంటానని నమ్మించి వదిలేశాడు. మోసం చేశాడు. తర్వాత మీరు మీ అమ్మాయికి పెళ్ళి నిశ్చయం చేశారు. అయితే మీ అమ్మాయికీ, మోహన్‌కీ వున్న సంబంధా న్నెలాగో శివరావు తెలుసుకున్నాడు. మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయసాగాడు. మీకు డబ్బెక్కణ్ణించి వస్తుంది? మరోదారి లేక అతన్ని హత్య చేయాలనుకున్నారు. చేశారు!''

నా రక్తం మరిగింది. అందులో హృదయం ఉడికింది. ''మీరు మర్యాద నతిక్రమిస్తున్నారు. నా కూతురు నిప్పు లాంటిది.''

''ఒకోసారి అబద్ధాలు నిజాలే అయిపోయి, మన

ల్ని ఇబ్బందిలో పెట్టేస్తాయి. మోహన్ హంతకుడవడం
ఎంత నిజమో, మీ అమ్మాయి దుశ్శీల కావడం, మీరు
హత్యచేయడం అంతే నిజం. కానీ, మొదటిది అబద్ధం
కావడంకోసం చివరి రెండూ నిజాలు చేయదల్చాన్నేను.
ఈ మూడూ అబద్ధాలని ఋజువుచేయాలంటే మీ సహాయం
నాకు కావాలి'' అన్నాడు రామారావు.

ఆలోచనలో పడ్డాను. ''నిజంగా నాకేమీ తెలియదు.
ఆ యింట్లోకి నేను వెళ్ళడం చూసిన స్టూడెంట్ ఎవరో
చెప్పండి. అతన్ని నిలదీసి అడుగుతాను. అతను బాగా
పొరబడి వుండాలి'' అన్నాను.

''మేష్టారూ, దబాయించి ప్రయోజనంలేదు. మీరక్క
డున్నట్లు నేను ఖచ్చితంగా ఋజువుచేయగలను. ఎటొచ్చీ
మోహన్ నిర్దోషిత్వాన్ని నిరూపించడానికి మీకూ మంచి
మనసనేది వుంటే, మీ అమ్మాయి దుశ్శీల కానవసరం
లేదు, మీరు హంతకులూ కానవసరంలేదు. మీకు ఒకే
ఒక్క నిముషం వ్యవధినిస్తున్నాను. ఇంక మీరేం చెప్ప
నవసరంలేదు. హత్య విషయంలో నాకేమైనా సహకరించ
దల్చుకున్న పక్షంలోనే మాట్లాడండి. లేని పక్షంలో
నేను లేచి వెళ్ళిపోతాను. మీరు మౌనంగా వుండండి''
అంటూ అతను వాచివంక చూసుకుంటున్నాడు.

నా మనసులో సంఘర్షణ ప్రారంభమయింది. మంచి
మనసు ఎదురు తిరుగుతోంది. గవర్రాజు భయపెడు
తున్నాడు. రామారావు బెదరిస్తున్నాడు. కొద్ది క్షణాల
లోనే ఒక నిర్ణయానికి వచ్చాను. గవర్రాజువల్ల ప్రమాదం
నా ఒక్కడికే వుంది. కానీ, రామారావు కారణంగా
నా కూతురి కాపురంకూడా చెడిపోవచ్చు. అదీకాక, ఒక

హంతకుడిగా ఉరి తీయబడడంకంటె, ఒక దుర్మార్గుడిచేత హత్య కావించబడడమే మేలు.

"టైమైపోయింది.మరి నేను వెడుతున్నాను మేస్టారూ" అన్నాడు రామారావు.

"అగండి" అన్నాను. రామారావును దగ్గరగా పిలిచి, "నేను హంతకుణ్ణి కాను. ఆ రోజు శివరావును శేషగిరి హత్యచేయడం నేను కళ్ళారా చూశాను" అని చెవిలో నెమ్మదిగా చెప్పాను. రామారావు ముఖంలో రంగులు మారాయి. అతను నెమ్మదిగా నన్ను ప్రశ్నించి ఆరోజు జరిగిన వివరాలన్నీ రాబట్టాడు. అన్నీ విని, "మేస్టారూ, మీ సమాచారం మోహన్‌ని రక్షిస్తుంది. ఇందుకు మీకు తగిన ప్రతిఫలం వుంటుంది" అని వెళ్ళిపోయా డతను.

అతను వెళ్ళిపోగానే రామావతి నా దగ్గరకు వచ్చి, "నాన్నా, నిజంగా నువ్వా హత్య కళ్ళారా చూశావా?" అనడిగింది.

ఉలిక్కిపడ్డాను నేను. దానివంక అనుమానంగా చూసి, "మా సంభాషణంతా విన్నావేమిటీ?" అన్నాను.

"అంతా వినలేదు. చివర్లో నువ్వాయనకేం చెప్పావో మాత్రం నాకు తెలియలేదు. ఆఖరున మీరు గుసగుస లాడుకున్నట్లు మాట్లాడుకున్నారు" అంది రామావతి.

నేను నవ్వి, "లేదమ్మా, నేనా హత్య చూడలేదు. అతన్ని వదుల్చుకోవడంకోసం చివరికి చూశానని ఒప్పుకుని, నాకు తోచిన విధంగా హంతకుణ్ణి వర్ణించి చెప్పాను" అన్నాను.

రామావతి కుతూహలంగా చూసి, "కానీ, ఆ సమాచారం మోహన్‌ని రక్షిస్తుందన్నా డాయన. నీకు నమ్మక

ముందా నాన్నా'' అంది.

''ఏమో, నన్ను నేను రక్షించుకునేందుకా సమాచారా న్నిచ్చాను. అయినా మనకెందుకు లెద్దూ?''

''అది కాదు నాన్నా, ఆ వచ్చిన మనిషిమీద నాకు చాలా అనుమానంగా వుంది. అతను మోహన్‌ని రక్షించడానికి వచ్చేడని నాకనిపించడంలేదు'' అంది రామావతి.

నేనాశ్చర్యంగా చూశాను నా చిన్నకూతురి వంక. ''ఈ హత్యగురించి నీకు చాలా వివరాలు తెలిసినట్లు కనబడుతోంది?'' అన్నాను.

''అవున్నాన్నా, మోహన్ మా కాలేజీలోనే చదువుతున్నాడు. నాకొక ఏడాది సీనియర్'' అంది రామావతి.

''అయితే...''

''అతను హత్యకేసులో ఇరుక్కున్నాక డిటెక్టివ్ రామారావుగారు మా కాలేజీకి వచ్చారు. మోహన్ ప్రవర్తన గురించి స్టూడెంట్సుని చాలా ప్రశ్నలడిగారు.''

''అయితే'' అన్నాను మళ్ళీ.

''ఇందాకా వచ్చినతను డిటెక్టివ్ రామారావు కాడు. డిటెక్టివ్ రామారావుగారిని నేను కళ్ళారా చూశాను. మా కాలేజీ ప్రిన్సిపాల్‌గారే మా క్లాసుకు తీసుకువచ్చి స్వయంగా పరిచయం చేశారు'' అంది రామావతి.

పక్కలో బాంబు పేలినట్లదిరిపడ్డాను. అయితే, ఇందాకా వచ్చినతను ఎవరు?

## 4

సుమారు రాత్రి పదిన్నర ప్రాంతంలో ఎవరో తలుపు తట్టారు.

సాధారణంగా నేనొక్కణ్ణే వరండాలో నిద్ర

పోతూంటాను. మా యింట్లో అందరం తొమ్మిదింపావయేసరికి నిద్రపోతాం.

ఆ తలుపలా ఎంత సేపట్నించి తట్టబడుతోందో తెలియదు కానీ, మెలకువ రాగానే లేచి తడుముకుంటూ గోడ దగ్గరకు వెళ్ళి లైట్లు వేసి, వెళ్ళి తలుపు తీశాను.

“మంచి నిద్రలో వున్నట్లున్నావు” అన్నాడాయన. నాకు పరిచయమైన ముఖమే. ఆయన పేరు కామరాజు. నాకు దూరపు బంధువు. దగ్గర్లో వున్న పల్లెటూ రాయనది. అప్పుడప్పుడు పట్నం వచ్చి మొదటాట సినిమా చూసి మా యింటికి వచ్చి పడుకుని, మళ్ళీ ఉదయమే లేచి వెళ్ళి పోతూంటాడాయన.

నేను టైము చూసుకుని, “తొందరగా నిద్రపోయే అలవాటు కదా. లేకపోతే మంచి నిద్రలో వుండాల్సిన టైం కాదిది. సినిమానుంచా” అన్నాను.

“అవును_” అన్నాడు కామరాజు.

“పదండి_ కాళ్ళు కడుక్కుని భోంచేద్దురు గాని...” అంటూ తలుపులు వేశాను. ఇంట్లో భోజనం రెడీగా లేదు. అయినా కామరాజు భోంచేయడని నాకు తెలుసు. అతను హోటల్లో భోంచేసి వస్తాడు. అయినా మర్యాదకు అలాగన్నాను.

తను భోంచేసినట్లు చెప్పాడు కామరాజు.

వరండాలో నేను పడుకున్న మంచంమీద దుప్పటితీసి ఒకసారి విదిలించి మళ్ళీ వేశాను_ “చాలా రాత్రి అయింది కదా_ మీరువెళ్ళి పడుకోండి _” అన్నాడు కామరాజు మంచంమీద కూర్చుని.

అక్కణ్ణించి కదిలాను,

పిల్లలు దొడ్డి వసారాలో నిద్రపోతున్నారు. అనసూయ ఒక్కత్తి గదిలో పెద్ద మంచంమీద నిద్రపోతుంది.

ఈ నగరంలో అరవై రూపాయల అద్దెకు ఇంత పెద్ద యిల్లు దొరకడం నా అదృష్టం. కాస్త పాతదే అయిన ప్పటికీ నాబోటి వాడికి చాలా సదుపాయంగా ఉంటుంది. ఈ ఇంట్లో నేను సుమారు ఇరవై ఏళ్ళక్రితం ప్రవే శించాను, పదిహేను రూపాయల అద్దెకు. మళ్ళీ ఇల్లు వదలవలసిన అవసరం రాలేదు. మూడు పురుళ్ళు నా భార్య ఈ ఇంట్లోనే పోసుకుంది. నా జీవితం మూడు పువ్వులూ ఆరు కాయలూగా నడుస్తోంది యింట్లో.

గది తలుపులు వేసి అనసూయ పక్కలో చేరాను. ఎంత నిద్రలో ఉన్నా నేను పక్కలోకి రాగానే అనసూయకు మెలకువ వస్తుంది. "పిల్లలు నిద్రపోయారా?" - అంది అనసూయ. నేనా గదిలోకిరాగానే అనసూయ ఎప్పుడూ అడిగే మొదటి ప్రశ్నే అది.

"ఊఁ అయినా కామరాజు గారొచ్చారు. అందుగురించి ఇక్కడకు రావడం తప్పని సరయింది..."

"మిమ్మల్ని కారణం ఎవ్వరడిగారూ ..." అంటూ అనసూయ నాకు దగ్గరగా జరిగింది.

# 5

ఏదో పెద్దకేక వినపడి మెలకువ వచ్చింది. అనసూయ నన్ను కౌగలించుకుని పడి ఉంది. తనకు మెలకువ వచ్చి నట్లు లేదు. నేను తట్టిలేపాను.

"ఊఁ" అంది బద్ధకంగా.

"ఏదో కేక వినపడ లేదు" అన్నాను.

"లేదు" అని మళ్ళీ నిద్రకు పడిపోతోంది. నేనా

మెను విడిపించుకుని లేచాను. మంచం దిగాను. లేచి తలుపులు తీశాను. వరండాలోని వెలుగు గదిలోకి కూడా పడింది.

వరండాలో పిల్లలందరూ ఉన్నారు, వీధి తలుపులు బార్లా తెరచి ఉన్నాయి. ఇంకా స్త ముందడుగు వేస్తే నాకు మంచంమీద కామరాజు కనిపించాడు. పరుగెత్తుకు వెళ్ళాను.

"ఏమైంది ?"

కామరాజు ఆయసపడుతున్నాడు.

రామావతి చెప్పింది "ఈయన కేక వినపడి పరుగెత్తుకు వచ్చాం !"

కామరాజు తమాయించుకున్నాడు "బహుశా దొంగాడను కుంటాను. నన్ను చంపడానికి ప్రయత్నించాడు" అన్నాడు. ఒక్క-క్షణం ఆగేక ఆయన చెప్పిందాన్ని బట్టి నా కర్థమైనది.

ఒక రాత్రివేళ అల్పాచమానాని కని కామరాజు లేచి వీధి తలుపులు తీసుకుని బయటకు వెళ్ళి వచ్చాడు. తర్వాత తలుపులు వేసి వచ్చి మంచంమీద పడుకున్నాడు. ఏదో అలికిడైనట్లుతోచి కళ్ళు తెరిచాడు. ఆయన కళ్ళుచీకటికి అలవాటు పడ్డానికి కొద్దిక్షణాలు పట్టింది. అప్పటికో నల్లటి ఆకారం తన వైపు నడిచి వస్తున్నట్లు గుర్తించాడాయన.

"ఎవరది?" అన్నాడు కామరాజు.

ఆకారం ఒక్కుదుటున మంచంమీదకు దూకి కామరాజు నోరు మూసింది, రెండోచేత్తో కత్తి ఎత్తింది. కామరాజు ఒక చేత్తో కత్తిఉన్న ఆ ఆకారం చేతిని పట్టుకుని

అపాడు. కానీ ఎంత సేపటికీ తన నోటిమీద చేతిని తొలగించ లేకపోయాడు. కొంతసేపు ప్రయత్నం అనంతరం కామరాజులో శక్తి క్షీణించింది. ఆకారం కత్తిని కామరాజు గుండెల మీదకు తీసుకువస్తోంది. ఆ జీవన్మరణాల మధ్యలో కామరాజు సర్వశక్తులూ వినియోగించి ఆకారాన్ని వెనక్కుతోసి గట్టిగా కేక పెట్టాడు. ఆకారం తలుపులు తీసుకుని పారిపోయింది.

నా గుండెలదిరాయి. సాయంత్రం నా యింటికి డిటెక్టివ్ రామారావువచ్చి శివరావు హత్య విషయం ప్రస్తావించి నా దగ్గర్నుంచి నిజం రాబట్టుకుని వెడుతూ అందుకు ప్రతిఫలం ఉంటుందని చెప్పాడు. అతను డిటెక్టివ్ రామారావు కాదని రామావతి చెప్పింది. రాత్రి ఇంటికి వచ్చిన కామరాజుమీద హత్యా ప్రయత్నం జరిగింది.

ఆ హత్యాప్రయత్నం కామరాజు మీదనా లేక నా మీదనా? న్యాయాని కిక్కడి కామరాజు స్థానంలో నేనుండాల్సుంటుంది. కామరాజు దృఢకాయుడు. ఆయన కాకుండా నేనాయన స్థానంలో ఉండి ఉన్నట్లయితే నా ప్రాణాలు పోయుండేవి. అయితే నన్ను చంపాలని అనుకుంటున్నదెవరు ?

# 6

మర్నాడు ఆదివారం కాబట్టి స్కూలుకు సెలవు. ఒకపర్యాయం పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి ఆమోహన్‌నీ డిటెక్టివ్ రామారావునీ చూడాలనిపించింది. అవసరమైన పక్షంలో పోలీసుల రక్షణకూడా కోరాలనుకున్నాను. నా ప్రాణాలిప్పుడు అపాయంలో పడట్లు తోస్తోంది. రాత్రి దేవుడిలా వచ్చి రక్షించాడు కామరాజు. లేకపోతే...

ఊహించుకోలేకపోయాను, నా కళ్ళముందు కత్తిపీడి మీద జేబురుమాలుతో తుడుస్తున్న శేషగిరి కనిపించాడు.

నేను బజార్లో రాగానే ఎవరో వెనకనించి పేరుపెట్టి పిలిచారు. ఎవరా అని వెనక్కి తిరిగి చూస్తే అతను గవర్రాజు!

"మేస్టారూ ఎక్కడికో బయల్దేరినట్లున్నారు?" అన్నాడతను.

నేనేం మాట్లాడలేదు.

"మీరు నా హెచ్చరిక మరిచిపోయారు" అన్నాడు గవర్రాజు.

"ఏ హెచ్చరిక?" అన్నాను.

"పదండి. పార్కులో మాట్లాడుకుందాం" అంటూ అతను దగ్గర్లో ఉన్న పార్కువైపు నడిచాడు.

ఇద్దరం వెళ్ళి పార్కులో ఒక మూల బెంచీమీద కూర్చున్నాం.

"నిన్న మీయింటికి డిటెక్టివ్ రామారావు వచ్చేడా" అన్నాడు గవర్రాజు.

"అవును మీకెలా తెలుసు?"

"ప్రశ్నలొద్దు. నేనడిగిన దానికి సూటిగా జవాబు చెప్పండి. అతనికి మీరు శివరావు హత్యగురించి పూర్తి వివరాలు చెప్పేశారా, లేదా?"

"అతను నన్నిరుకులో పెట్టి నిజం చెప్పించేశాడు" అన్నాను భయపడుతూ.

గవర్రాజు కళ్ళు ఎర్రగా అయ్యాయి. "పంతులుగారూ మీకు నేను మొదటే చెప్పాను. శేషగిరిగారి స్నేహితులంతా నా స్నేహితులని, నా స్నేహమున్నవాడి ఒంటిమీద

ఈగనైనా వాలనివ్వను మీరు అనవసరంగా భయపడ్డారు''
అన్నాడతను శాస్త్రీ తీవ్రంగా.

''అవన్నీ నాకేం తెలుస్తాయి. నేను చాలా సామా
న్యుణ్ణి'' అన్నాను.

''మేస్టారూ. గవర్రాజు సామాన్యులతో స్నేహం
చేయడు. నా స్నేహం దొరికిన మీరు సామాన్యు లెలా
గౌతారు. అందులోనూ శేషగిరి లాంటి గొప్పవారి
ప్రాణాల్ని కాపాడగల శక్తి ఉన్న మీరు సామాన్యు
లెలాగౌతారు. మీరు నిస్సందేహంగా గొప్పవారే''
అన్నాడు గవర్రాజు.

నేను మాట్లాడకుండా అతనివంకే చూస్తూ ఉండి
పోయాను.

గవర్రాజు మళ్ళీ అన్నాడు ''శేషగిరి గారి శత్రువులంతా
నాకు శత్రువులు. శత్రుత్వమంటే నేనెంతకైనా తెగి
స్తానని ఇదివరలో మీకు చెప్పి ఉన్నాను. అందులోని
నిజాన్ని నిన్నరాత్రి మీరు చవిచూశారు. నిన్నరాత్రి
మిమ్మల్ని బెదిరించడానికి మాత్రమే హత్యా
ప్రయత్నం జరిగింది. అంతే కానీ చేతకాక వదిలిపెట్టి
వెళ్ళిపోలేదు. నా మాటల్లోని నిజమెంతో తెలియడం
కోసం నిన్నరాత్రి మీకు మచ్చు చూపించాను. ఇంకో
సారి మరిబెదిరింపుండదు'' అని ఒక్క క్షణం ఆగి ''శత్రు
త్వం విషయంలో నిజాన్ని చవిచూశారు గదా. స్నేహం
విషయంలో నిజంకూడా అంతేనని గ్రహించి ధైర్యంగా
ఉండండి'' అన్నాడు.

నాకేదోలాగుంది.అనవసరంగా ఇబ్బందుల్లోపడుతున్నా
నని భయంగా ఉంది. ''అసలు నేను డిటెక్టివ్ రామా

రావుకి రహస్యం చెప్పేసినట్లు మీకెలా తెలుసు ?'' అనడిగాను.

''ఆ మాత్రం తెలుసుకోలేనా పంతులుగారూ, నిన్న రాత్రి మీ దగ్గరకు వచ్చినది డిటెక్టివ్ రామారావుకాదు. నేను పంపిన మనిషి. మీరు నా మాటలనెంతగా లక్ష్యపెడతారో చూడ్డానికీ, మీవల్ల శేషగిరిగారికి ప్రమాదమున్నదీ లేనిదీ తెలుసుకునేటందుకూ, నేనతన్ని పంపాను. అలా చేయడం మంచిదే అయింది. మీరెంత భయస్థులో, మీ భయంలో శేషగిరికెంత ప్రమాదం తీసుకురాగలరో తెలిసింది'' అన్నాడు గవర్రాజు.

అయితే రామావతి చెప్పినది నిజమే నన్నమాట. రాత్రి డిటెక్టివ్ రామారావు పేరుతో అతనెందుకొచ్చాడో తెలిసింది. శేషగిరి నన్ను పరీక్షించాడు. ఆ పరీక్షలో నేనోడిపోయాను. ఫలితంగా నా ప్రాణం తీయాలని ప్రయత్నించాడు. కామరాజు కారణంగా నేను రక్షించబడ్డాను. కానీ, తన మనిషికి బెదిరించే ఉద్దేశ్యమే కానీ, హత్యచేసే ఉద్దేశ్యంలేనట్లు గవర్రాజు చెబుతున్నాడు. కామరాజు కాక ఆ స్థానంలో నేనున్నట్లయితే ఆ హత్య జరిగి ఉండేదా.

అంతా అయోమయంగా ఉంది. కానీ, శేషగిరి ఘటికుడనీ అతను నన్నో కంట కనిపెట్టి ఉన్నాడనీ అర్థమవుతోంది. శేషగిరి ఈ విధంగా నన్ను పరీక్షిస్తాడని నేను కలలో కూడా అనుకోలేదు. అతను ఆరితేరిన మోసగాడులాగున్నాడు. అతనితో భేటీ నా ప్రాణాలకే ప్రమాదం. అత్యంత సామాన్యుణ్ణి నేను. కానీ, గవర్రాజు స్నేహం నన్ను సామాన్యుడి స్థాయినుంచి పైకి తీసుకుపోయినట్లు

చెబుతున్నాడతను.

గవర్రాజు నా ముఖంలోకే పరీక్షగా చూస్తూ "ఎప్పుడైనా ఎవరైనా మీ దగ్గరకు వచ్చి నిన్న మనిషి అడిగిన విధంగా ప్రశ్నలు వేస్తే తట్టుకుని బయట పడగలగాలి. ఏ పరిస్థితుల్లోనూ శేషగిరిగారి పేరు బయటకు రాకూడదు. పోలీసులు అసాధ్యులు. నిన్న మా మనిషి కంటేకూడా తెలివైన ప్రశ్నలువేసి మిమ్మల్నిరుకులో పెట్టగలరు. కానీ ఒక్క విషయం మీరు గుర్తుంచుకోండి. మీరు సుబ్రహ్మణ్యం ఇంటికి ఎప్పుడూ వెళ్ళలేదు. శివరావు హత్యను చూడలేదు. ఈ నిజాన్ని నమ్మినంత కాలం ఏ చిక్కు ప్రశ్నలూ మిమ్మల్ని బాధించవు. ఎవరూ మిమ్మల్నేమీ చేయలేరని నేను హామీ ఇస్తున్నాను. ఈ విషయం చెప్పడానికే పిలిచాను వస్తాను మరి!" అన్నాడు.

అతను వెళ్ళిపోయాక తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాను. ఇప్పుడేం చేయాలీ అని ఆలోచించాను. ఆ మోహన్ ఏమైతే నాకేం, ఆ డిటెక్టివ్ ఏమైతే నాకేం, తన్నుమాలిన ధర్మం లేదు. తిన్నగా ఇంటికి వెళ్ళిపోవడం నా వంటికి మంచిది. వచ్చేటప్పుడు బజార్లో కూరలు తెమ్మని అనసూయ చెప్పింది. అందుకని కూడా సంచీ కూడా తెచ్చాను.

కూరల మార్కెట్లో కూరలు కొనుక్కుని నేనింటికి వెళ్ళేసరికి ఇంట్లో నా గురించి ఒక అపరిచిత వ్యక్తి ఎదురు చూస్తున్నాడు. నన్ను చూస్తూనే లేచినిలబడి నమస్కారం చేసి, "నమస్కారం సార్, నన్ను రామారావంటారు. నేను ప్రయివేట్ డిటెక్టివ్ ను" అన్నాడు.

నా చేతిలోని కూరలసంచీ జారిపోయింది.

# 7

తనే పరిస్థితుల్లో మా యింటికొచ్చిందీ రామారావు వివరించి చెప్పాడు.

రామావతి స్వయంగా వెళ్ళి ఆయన్ను కలుసుకుని నిన్న మా యింటికొచ్చిన నకిలీ డిటెక్టివ్ సంగతీ, రాత్రి జరిగిన హత్యాప్రయత్నం గురించీ చెప్పిందట. శివరావు హత్యకేసులో తలాతోకా దొరక్క నానా అవస్థా పడుతున్న ఆయనకు, కాస్త ఆధారం దొరికినట్లయింది. క్షణాల మీద మా యింటికొచ్చేశాడు.

'ఎంత పని చేసింది రామావతి?' అనుకున్నాను.

"మా అమ్మాయి తరఫున మీకు క్షమార్పణలు చెప్పుకుంటున్నాను. అది మీకు లేనిపోని ఆశలు కల్పించింది. నిజానికి నాకీ కేసు గురించి ఏమీ తెలియదు. ఏదో పేపర్లలో చదివాను. అంతే!" అన్నాను.

రామారావు ముఖంలో నిరుత్సాహం కనబడలేదు. "మీకేవో తెలుసునని నేను భావించడం లేదు. నిన్న జరిగినదంతా విన్నాక నాకో అద్భుతమైన పథకం తట్టింది. అది అమలు జరపడానికి మీ సహకారం కావాలి" అని ఆగి నా ముఖంలోకి చూశాడు.

"క్షమించండి. ఏదో నా మానాన నేను బ్రతుకుతున్నాను. ఇలాంటి కేసుల్లో జోక్యం చేసుకోలేను. మీరు మరెవ్వరి సహాయాన్నయినా అపేక్షించండి" అన్నాను.

"శివశంకరంగారూ! అలా అంటే లాభం లేదు. మోహన్ని రక్షించవలసిన బాధ్యత నాకే కాదు, మీకూ ఉంది" అన్నాడు రామారావు.

"పిల్లలకు పాఠాలు చెప్పడం నా బాధ్యత. అది నేను సక్రమంగా నిర్వహిస్తూనే ఉన్నాను."

"అంతేనా. ఒక నిర్దోషి అన్యాయంగా శిక్షించబడుతూంటే అతన్ని రక్షించగలిగుండీ, పట్టనట్లూరుకోవడం మీ బాధ్యత అవుతుందా?" అన్నాడు రామారావు.

ఇవే మాటలు నిన్న ఒకమనిషి అన్నాడు. తను డిటెక్టివ్ రామారావు నన్నాడు. తను లొంగిపోయి, మోసపోయి, నిజం చెప్పేశాడు. ఫలితంగా ప్రతిఫలముంటుందన్నాడు. ఆ రాత్రి తనమీద హత్యా ప్రయత్నం జరిగింది. ఇప్పుడు మళ్ళీ ఇతను.

"ఇంతకీ మీరు డిటెక్టివ్ రామారావని నమ్మకమేమిటి?" అన్నాను. నన్ను పరీక్షించడానికి మళ్ళీ శేషగిరి ఎవరినైనా పంపి వుండవచ్చునని నాకు తోచింది.

అతను నవ్వి, "మీ అమ్మాయి నన్ను గుర్తుపట్టగలదు. ఇంకా సాక్ష్యాలు కావాలంటే, పోలీస్ స్టేషన్‌కు వెడదాం" అన్నాడు.

"ఆయన డిటెక్టివ్ రామారావుగారే నాన్నా" అంది రామావతి కాస్తగట్టిగా లోపల్నుంచి.

రామావతికీ కేసంటే చాలా ఆసక్తి ఉన్నట్లుంది. అన్నీ శ్రద్ధగా వింటోంది. నేను ఒక్కక్షణం ఆలోచించి "ఇంతకీ నేనేం చేయాలో చెప్పండి" అన్నాను.

"శివరావు హత్యను మీరు కళ్ళారా చూసినట్లు సాక్ష్యం చెప్పాలి."

ఆశ్చర్యంగా "అదెలా సాధ్యం, నేనా హత్యను చూడలేదే" అన్నాను.

"మీరు చూడలేదు. ఒక నిర్దోషిని రక్షించడానికి ఒక

అబద్ధం చెప్పాలి.''

''అబద్ధాలు చెప్పడం నా వల్ల కాదు'' అన్నాను నా మాట అబద్ధమని తెలుసుండీకూడా.

''మీరబద్ధమాడడం లేదు. ఆరోజు సుబ్రహ్మణ్యం ఇంటికి వెళ్ళారు. మీరు చూస్తూండగా హత్య జరిగిపోయింది. మీరు హంతకుణ్ణి చూశారు. హంతకుడుకూడా మిమ్మల్ని చూశాడు. అతనెవరో మీకు తెలియదు. కానీ, మిమ్మల్నతను బెదిరించి వెళ్ళిపోయాడు. మీరు బాగా భయపడి పోయారు. కానీ, ఇప్పుడు నిర్దోషిని రక్షించడం కోసం ముందుకువచ్చారు.''

''బాగుంది. ఈ అబద్ధం మోహన్‌ని రక్షించగలదను కుంటున్నారా, అదే నిజమైన పక్షంలో నేనే ఎందుకు ఈ అబద్ధం చెప్పాలి? మరెవరినైనా ఇందుకెన్నుకోవచ్చు గదా'' అన్నాను.

''శివశంకరంగారూ. అందుకు చాలా కారణాలు న్నాయి''అన్నాడు రామారావు. ''మీరు హత్య చూశారో లేదో తెలియదు కానీ, హత్య జరిగిన నాడు మీరా ప్రదేశంలో ఉన్నారన్నది నిజం. దుమ్ము కొట్టుకున్న ఆ గది తలుపులు మీరు తోసి ఉండాలి. ఆ తలుపులమీద వేలి ముద్రలు ఫోటో తీయబడ్డాయి. అది మీవే అయుండా లని నిన్న మీరు నకిలీ డిటెక్టివ్‌తో మాట్లాడిన దాన్ని బట్టి తెలుస్తోంది. ఆ సంభాషణంతా నాకు మీ అమ్మాయి పూర్తిగా చెప్పింది.

దాన్నిబట్టి హత్యా ప్రదేశంలో ఏదో ఒక దృశ్యం మీ కళ్ళ బడిందనీ అది మీకేకాక మరొకవ్యక్తికికూడా తెలిసి ఉండాలనీ అర్థమయింది నాకు. రాత్రి మీమీద హత్యా

ప్రయత్నం జరిగిందంటే మీరు చాలా ప్రమాదంలో ఉన్నారని తెలుస్తోంది. జరిగిన వాటినిబట్టి మోహన్ని రక్షించగల రహస్యం మీదగ్గరుంది. అసలు హంతకుడి పేరు బయటపెట్టడానికి మీరు భయపడుతున్నారు. కాబట్టి మీకూ మాకూ ప్రమాదంలేని పనేమిటంటే— హత్యను చూసినట్లూ, హంతకుడు మోహన్ కాదనీ, చెప్పటం అందువల్ల కేసు కొత్త మలుపు తిరుగుతుంది. హత్యా ప్రదేశంలో మోహన్ ఉన్నాడని తప్పితే, అతనే హత్య చేసినట్లు సరైన ఋజువు లేదు. ఆ ఋజువు లేకుండా అతను హత్య చేశాడనగల వారు మీ సాక్ష్యాన్ని నమ్మాలి.''

''మోహన్ ఆ గదిలో ఉన్నట్లు సాక్ష్యం లభించింది. అయినా అతను నిర్దోషి అని నమ్ముతున్నాను. కానీ, అదే గది తలుపులమీద నా వ్రేలిముద్రలుంటే నేను హత్య చూశానని ఎలా చెప్పగలరు?''

''చూశారని నేననడం లేదు. చూసినట్లు చెప్పండి చాలు. మీ సాక్ష్యాన్నెలా ఉపయోగించుకోవాలో నేను చూసుకుంటాను. ఈ సాక్ష్యమివ్వడం ద్వారా మీకు మరో గొప్ప ప్రయోజనముంది. మొదట్లో జులాయిగా తిరిగే మోహన్ ఒక అందమైన అమ్మాయిని చూసేక మారిపోయాడు. ఆ అందమైన అమ్మాయిని పెళ్ళిచేసుకో-వాలని అతను నిశ్చయించుకుని ఒకో చెడు అలవాటుకీ స్వస్తి చెబుతూవచ్చాడు. అతని దురదృష్టంకొద్ది జైలు పాలయ్యాడు కానీ ఈ పాటికా అమ్మాయి తలిదండ్రులతో సంప్రదింపులు జరిపి ఉండేవాడు.''

''ఎవరండీ ఆ అమ్మాయి'' అన్నాను అనుమానంగా.

‘‘మీ అమ్మాయి రామావతి’’ అన్నాడు రామారావు తాపీగా.

ఉలిక్కిపడ్డాను. అప్రయత్నంగా ‘‘రామావతీ !’’ అని గట్టిగా కేక పెట్టాను.

‘‘ఆ అమ్మాయిని మీరు పిలవ నవసరంలేదు. ఇది ఏక పక్ష ప్రేమ వ్యవహారం. మోహన్ ఆమెను ప్రేమిస్తున్నాడు. అతనా విషయా న్నామెకు తెలియబరిస్తే, ప్రేమంటే తనకు తెలియదనీ, పెళ్ళి గురించయితే తన తండ్రిని కలుసుకోమనీ, తండ్రి మాట తనకు వేదమనీ, ఇంకెన్నడూ తనవెంట పడవద్దనీ ఆమె అతనికి చెప్పేసింది. అతను బాగా ఆలోచించి మీ దగ్గరకు వద్దామని నిర్ణయం తీసుకునేసరికి, పోలీసులతన్ని పట్టుకున్నారు.’’

నా బుర్ర తిరిగిపోయింది. నాకు తెలియకుండా ఎన్ని రహస్యాలున్నాయి. నా కూతురు ప్రేమ వ్యవహారం నడుపుతోందా? నా కంటికి అమాయకురాలిలా కనిపిస్తున్నది.

‘‘పిలిచేవా నాన్నా!’’ అంది రామావతి.

పరీక్షగా దాని ముఖంలోకి చూశాను. ముఖంలో రవంత భయం తొంగి చూస్తున్నప్పటికీ నిష్కల్మషంగా వున్నాయి దాని కళ్ళు. కానీ, ఎంత అందం దానిది? ఒక లక్షాధికారి ఏకైక పుత్రుడిని వ్యసనాలకు స్వస్తి చెప్పేలా చేసిన ఆ అద్భుత సౌందర్యానికి నేను తండ్రిని! ఇంత కాలం నేను దాన్ని నా కూతురిగా గుర్తించాను తప్పితే, ఒక అందాలరాశిగా గుర్తించలేను.

‘‘అన్నీ వినే వుంటావు. ఈయన చెబుతున్న మాటలు నిజమేనా?’’

రామావతి ముఖంలో కాస్త ధైర్యం కనిపించింది.
"ఒకసారి నా కతను ప్రేమలేఖ అందించాడు. అతని కళ్ళ ముందే చింపి పారేశాను. తర్వాత నన్ను కలుసుకుని ప్రేమిస్తున్నా నన్నాడు. ప్రేమంటే అర్థం తెలియ దన్నాను. పెళ్ళి చేసుకుంటా నన్నాడు. నిన్నడగ మన్నాను. చదువుకోమని నన్ను నువ్వు కాలేజికి పంపిస్తున్నావు. చదువుకోవడం నా విధి, బాధ్యత. నీకు తెలియకుండా ఇంకేమీ చేయడంలేదు."

"నేను చెప్పానుగా—ఇందులో అమ్మాయిదేం తప్పు లేదు. అన్నీ, మీ ఇష్టాయిష్టాలమీద ఆధారపడి వున్నాయి. ఏది ఏమైనా మోహన్‌ని రక్షించడం విషయంలో మీరు బాగా ఆలోచించాలి."

"ఆలోచిస్తాను. కనీసం రెండురోజుల వ్యవధి కావాలి నాకు" అన్నాను.

"సరే—మీరు ప్రత్యక్ష సాక్షి అన్న అబద్ధం—ఒక మనిషి ప్రాణాల్ని కాపాడుతుందని మాత్రం మరిచి పోకండి" అంటూ లేచాడు రామారావు.

కానీ, నేను ప్రత్యక్షసాక్షి అన్న నిజం మరో మనిషిని జైలుపాలు చేస్తుందన్న విషయ మతనికి తెలియదు.

# 8

"ఇదీ పరిస్థితి శేషగిరిగారూ. మీతో మాట్లాడేవరకూ నేనేమీ చేయదల్చుకోలేదు" అన్నాను.

"పోలీసుల దృష్టిలో పడ్డావంటే మనమిలా మాట్లాడుకోవడంకూడా ప్రమాదకరం" అన్నాడు శేషగిరి కంగారుగా.

"అందుకే కదండీ—రెండ్రోజుల వ్యవధి అడిగాను. నిన్న ఆదివారం. ప్రయివేటుకు సెలవు. ఈరోజు ప్రయి

వేట్ల పేరుతో మీ ఇంటికొచ్చినపుడీ విషయం స్వయంగా మాట్లాడదామని వచ్చాను" అన్నాను.

శేషగిరి ముఖం గంభీరంగా అయిపోయింది. "ఈ కేసుగురించి నాకన్ని వివరాలూ తెలుసు. నిన్ను ప్రత్యక్ష సాక్షిగా వాళ్ళు నిరూపించలేరు. ఏ తలుపులమీదా నీ వేలిముద్రలు పడ్డడంగానీ, పోలీసులు తీస్కోవడంగానీ జరగలేదు. ఇది కేవలం ఆ డిటెక్టివ్ ఆడుతున్న నాటకం. మా వాడు చేసిన పొరపాటు, మీ అమ్మాయి తొందర పాటూ కలిసి మన ల్నిబ్బందిలో పెట్టేశాయి. ఇప్పుడు నువ్వు పోలీసుల దృష్టిలో పడ్డట్లే లెక్క. తప్పించుకో డానికొక్కటే మార్గముంది. హత్య కళ్ళారా చూశా నని ఒప్పేస్కో. రామారావు చెప్పినట్లే నీవు తోచిన రూపాన్ని వర్ణించు. చంపేస్తానని బెదిరించాడను. పోలీసు రక్షణ కోరు. అన్నీ సవ్యంగా ముగుస్తాయి. అలా కాక నా పీకెలమీదకు తీసుకొచ్చేవా, ఏ పోలీసులూ నిన్ను రక్షించలేరని మాత్రం గుర్తుంచుకో."

భయంగా తలాడించాను. "ఇంద — ఇవి ఖర్చుల కుంచుకో" అంటూ శేషగిరి పది వందరూపాయల నోట్లు నా కందించేడు. పైకి గంభీరంగా వున్నప్పటికీ శేషగిరి బాగా భయపడుతున్నాడని అర్థమయింది నాకు. ఒక రకంగా నేనూ బ్లాక్ మెయిలర్నయ్యానేమో ననిపిం చింది. కానీ, ఆ డబ్బు కాదనలేదు. అందుకుని జేబులోకి తోసేసి, "మీరు చెప్పినట్లే చేస్తాను" అని అక్కణ్నించి బయటపడ్డాను.

రోడ్డుమీదకు వచ్చేక రకరకాల ఆలోచనలు ఈగల్లా ముసురుకున్నాయి.

నేనిప్పు డెక్కడున్నాను, ఏం చేయబోతున్నాను.

ఏమీ అర్థం కావడంలేదు నాకు. హత్యాప్రదేశంలో శేషగిరిని కళ్ళారా చూశాను. కత్తిపిడిమీద వేలిముద్రలు తుడుస్తున్నా డతను. ఆ విధంగా ఈ హత్యకు నేను ప్రత్యక్షసాక్షిని. శేషగిరి పేరు తీసుకురాకుండా, మరెవరో నాకు తెలియని వ్యక్తిని అక్కడ చూసినట్లు నేనిప్పుడు పోలీసులకు చెప్పాలి. అలా చేస్తే మోహన్ రక్షించ బడతాడు. ఆ మోహన్ నా కూతుర్ని పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నాట్ట. అతను లక్షాధికారి బిడ్డ. నేను బడుగు బడిపంతుల్ని!

ఈ పెళ్ళికి నే నంగీకరిస్తానా? డబ్బున్నచోట కులం ప్రసక్తి వుండదా? కొన్నాళ్ళు జల్సాలకు అలవాటుపడ్డ మోహన్ ఎల్లకాలం బుద్ధిగా వుంటాడా?

ఏదేమైనా నా కూతురి కారణంగా నేను చిక్కుల్లో పడతానేమోనని భయంగా వుంది. దాని మూలంగానే డిటెక్టివ్ రామారావుకు నా సంగతి తెలిసిపోయింది. దాని మూలంగానే మోహన్‌ని రక్షించవలసిన బాధ్యత నామీద పడింది.

అసలీ మోహన్ ఎవరు? అతగాడి జీవిత మెలాంటిది?

ఇంతవరకూ నేను విన్నది కాక స్వయంగా అతని గురించి తెలుసుకోవాలి. అతని నిజస్వరూపం తెలుసు కున్నాకనే రామావతి పెళ్ళి విషయంలో ఏ నిర్ణయమూ తీసుకోవాలి. ఐనా, ఇప్పుడు మోహన్ మృత్యుముఖంలో వున్నాడు. నేను రక్షించకపోతే మృత్యు వతన్ని కబ ళిస్తుంది. అటువంటివాడిని రామావతి భర్తగా ఊహిం చడంకూడా తప్పు.

ఒక పర్యాయం మోహన్‌ని చూడాలనిపించింది. అతని ప్పుడెక్కడ వున్నాడో నాకు తెలుసును. అందుకే తిన్నగా ఆ పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాను. నేనెవరినో తెలి సేక, అతన్ని నేనెందుకు చూడాలనుకుంటున్నానో తెలుసుకో గోరాడు, ఇన్స్పెక్టర్.

"మా అమ్మాయీ, అతనూ ఒకే కాలేజీలో చదువు తున్నారు. ఇద్దరికీ తగుమాత్రం పరిచయముంది. చాలా బుద్ధిగా కనబడే ఆ కుర్రాడు హత్య చేశాడంటే నేను నమ్మలేకపోయాను. ఒక పర్యాయం అతన్ని కలుసుకుని మాట్లాడాలని వుంది" అని చెప్పాను. ఏ కళ నున్నాడో అంగీకరించాడా ఇన్స్పెక్టర్.

మొదటిసారిగా చూశాను మోహన్‌ని. ఇరవైకి లోపే వయసు. ఆరోగ్యంగా, దృఢంగా వున్నాడు. ప్రస్తుతం కళావిహీనంగా వున్నప్పటికీ, ముఖం అందమైనదే. అంద మైన ఆ ముఖానికి అమాయకత్వం వన్నె తెచ్చింది. ఆ ముఖం నిండా దిగులు పరుచుకుని వుంది ప్రస్తుతం.

"నన్ను శివశంకరం అంటారు. నువ్వు నన్నెరగవు కానీ, నేను నిన్నెరుగుదును" అన్నాను.

"శివశంకరం అంటే, రామావతి నాన్నగారా మీరు" అన్నాడతను.

"అవును."

అతను నాకు చేతులు జోడించి నమస్కారం చేశాడు.

"అదృష్టం బాగుండి వుంటే మనం మరోలా కలుసుకుని వుండేవాళ్ళం. మీ అమ్మాయి రామావతి దేవత. అటు వంటి ఆమెను కన్న మిమ్మల్ని చూసినందుకు నా జన్మ చరితార్థమైంది."

ఆశ్చర్యంగా చూశాను నేనతని వంక.

"అన్నిరకాల అలవాట్లూ వున్నాయి నాకు. వాటికి బానిసనై పోయాననే భావించాను. కానీ, రామావతి గురించి అన్నీ వదులుకో గలిగాను. నేనే ఆశ్చర్యపోయే విధంగా మారిపోయాను. ఇంతా చేసి ఆమెకూ, నాకూ అట్టే పరిచయంలేదు. ఆమెలో ఏదో దైవత్వముంది. ఆ దేవతతో పరిచయం పెంచుకునే ముందు నన్ను నేను సంస్కరించుకోవాలని గ్రహించాను. ఆ ప్రయత్నాల్లో నేనుండగా, విజయం సాధిస్తూండగా విధి నన్ను వెక్కిరించింది" విషాదంగా అన్నాడు మోహన్.

సినిమా డైలాగుల్లా అనిపించాయి నాకు. ఒక అందమైన ఆడపిల్లను చూసి, ఆమె ఏమీ చెప్పకుండానే తన పాడు అలవాట్లన్నీ వదిలిపెట్టే, ధనవంతుల అబ్బాయి సినిమాల్లో తప్ప వుండడని నా అభిప్రాయం. అందువల్లనే అతని మాటలు సినిమా డైలాగుల్లా అనిపించాయేమో!

"నిజంగా నువ్వు హత్య చేయలేదా?" తెలియనట్లు అడిగాను.

"హత్యా—నేనా?" అతను సినిమా హీరోలాగానే నవ్వాడు. "ఆపిల్ కోయడానికికూడా కత్తి వాడను నేను. రక్తం కళ్ళబడితే—జ్వరం వస్తుంది నాకు. అలాంటి వాణ్ణి కూడా హత్య చేయలేని నన్ను పోలీసులు హంతకుడంటున్నారు."

"కానీ, హత్యా ప్రదేశంలో నీవున్నట్లు ఋజువులు దొరికాయి. అక్కడున్న కుర్చీమీద నీ వ్రేలిముద్రలు దొరికాయి."

"అది నా దురదృష్టం. అక్కడికి నేను వెళ్ళాను.

బ్రతికున్నంత కాలం నన్ను సాధించిన శివరావు, చచ్చేక నాకు బ్రతుకన్నది లేకుండా చేశాడు" అన్నాడతను.

అతనింకా ఏదో చెపుతాడని గ్రహించి మాట్లాడలేదు. అనుకున్నట్లు గానే అతను మళ్ళీ మొదలు పెట్టాడు. "వయస్సు, డబ్బు, మితిమీరిన గారాబం నన్ను చెడు ద్రోవలో నడిపించాయి. అవే నన్ను శివరావులాంటి బ్లాక్ మెయిలర్ గుప్పిట్లోకి నడిపించాయి. నామానాన నన్ను బ్రతకనివ్వమనీ నేను మారేననీ, నన్నింక వేధించ వద్దనీ చెప్పడానికి నేను శివరావు దగ్గరకు వెళ్ళాను. నేను చేసిన తప్పల్లా, అక్కడికి వెళ్ళడమే. శివరావును కలుసుకుని మాట్లాడి వెళ్ళిపోయాను. తర్వాత కొద్ది సేపట్లో అతను అక్కడ హత్య చేయబడినట్లు విన్నాను. కొద్ది వారాల అనంతరం ఆ హత్యా నేరం నా మీద మోపబడింది."

"నీ రహస్యమేదో శివరావుకు తెలుసునన్నమాట, అదేమిటి?" అన్నాను.

మోహన్ నా వంక దీనంగా చూసి "మీవంటి ఉత్తముడికి చెప్పదగ్గ రహస్యం కాదది. అది నాకూ కామినికీ సంబంధించిన విషయం. కామిని గుడివీధిలో ఉంటుంది" అన్నాడు.

గుడివీధిలో కామిని అంటే నా కర్థమైంది. ఆ ఊళ్ళో గుడివీధిలో గుడి అంటూ ఏమీ లేదు. ఆ పేరెందుకొచ్చిందో తెలియదు కానీ. వ్యభిచారానికి మాత్రం ఆలయమా వీధి. నేనింకేం మాట్లాడలేదు. నా కివ్వబడిన టైము పూర్తి కావస్తోందేమో. "నీకు విడుదల లభించగలదని ఆశిస్తున్నాను" అని అక్కణ్ణించి ఇంటికి కదిలాను.

నేను ఇంటికి వెళ్ళేసరికి మళ్ళీ ఒక అపరిచిత వ్యక్తి నా కోసం ఎదురు చూస్తున్నాడు. నన్ను చూస్తూనే ఆయన లేచి నిలబడి "శివశంకరంగారంటే మీరే ననుకుంటాను. నా పేరు మాధవరావు. శివరావు హత్య కేసులో ఇరుక్కున్న మోహన్‌కి తండ్రిని" అన్నాడు.

# 9

"అన్నీ నాకు రామారావుగారు చెప్పారు. మీరే ఇప్పుడు మా వాణ్ణి రక్షించాలి" అన్నాడు మాధవరావు.

నే నిబ్బందిగా ముఖం పెట్టి, "రామారావుగారు మాట్లాడే తీరు నాకు నచ్చలేదు. ఆయన ఈ కేసులో విజయం సాధించగలడనీ నాకు తోచదు. మీరు మరి కాస్త మంచి డిటెక్టివ్‌ను కుదుర్చుకుంటే మంచిది" అన్నాను.

"ఎందు కలా గంటున్నారు?"

"ఆయన నన్నెన్ను కోవడంలోనే ఉంద తిరకాసంతా. నేనో సామాన్య మధ్య తరగతి మనిషిని. నామానాన నన్ను బ్రతకనివ్వక ఇలా హత్యకేసులో దొంగ సాక్ష్యాలు చెప్పమని నన్ను ప్రోత్సహించడం నాకు నచ్చలేదు. ఇలాంటి విషయాల్లో ఆరితేరిన వాళ్ళు బోలెడు మంది న్నారు. దొంగ సాక్ష్యాలు చెప్పడమే వృత్తిగా గల వారు చాలా మందున్నారు. అటువంటి వాళ్ళను వదిలి పెట్టి నా దగ్గర కాయన రావడం, వృత్తిలో ఆయనకు అనుభవం చాలదని తెలుపుతుంది."

"ఇలాంటి కేసులో, మీ లాంటివారి సాక్ష్యమే పని కొస్తుంది. మీలాంటి వారి సాక్ష్యానికున్న విలువ మరి దేనికీ ఉండదు. మిమ్మల్నెన్నుకోవడంలోనే రామారావు

గారి అనుభవం వ్యక్తమవుతుంది. అందులోనూ ఆయన సామాన్యులు కారనడానికి సాక్ష్యం, నా స్నేహితుడు శేషగిరి అతన్ని రికమెండ్ చేయడమే!" అన్నాడు మాధవరావు.

"ఏమిటీ, డిటెక్టివ్ రామారావును మీకు శేషగిరిగారు కుదిర్చిపెట్టేడా?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును, అనుకోని ఈ చిక్కు ఎదురయ్యే సరికి ఏం చేయాలో పాలుపోక మతిపోయి కూర్చున్నాను నేను. ఆపద్బాంధవుడిలా శేషగిరివచ్చి, డిటెక్టివ్ రామారావు గురించి చెప్పాడు. ఈయన కారణంగా ఎంతోమంది నిర్దోషులు రక్షించబడ్డారట. హైదరాబాద్ నించి ప్రత్యేకంగా రప్పించామీయన్ని" అన్నాడు మాధవరావు.

'శేషగిరి అసాధ్యుడు' అనుకున్నాను. తను చేసిన హత్యకేసులో మరొకతను ఇరుక్కున్నాడు. అతన్ని రక్షించిడానికొక ప్రఖ్యాత డిటెక్టివ్ని హైదరాబాద్ నించి రప్పించాడు. ఏమిటి ఇతని ధైర్యం! రామారావు పరిశోధించి నిజాన్ని బయట పెట్టగలిగితే శేషగిరి ఏం చేస్తాడు!

ఆలోచించగా రెండే రెండు అవకాశాలు కనిపిస్తున్నాయి. రామారావు పరిశోధన సరిగ్గా నడిపించడు. తన ప్రయత్నాలు తను చేస్తున్నట్లు కనబడుతూనే మోహన్ మీద కేసు మరింత బలపడేటట్లు చూస్తాడు. మోహన్కు ఉరిశిక్ష పడితే నలుగురితోపాటు తనూ మొసలి కన్నీళ్ళు కారుస్తాడు. ఏ పరిస్థితుల్లోనూ శేషగిరి మీదకు అనుమానం రాదు. అందుకే తన మనిషిని పరిశోధనలోకి దింపాడు. డిటెక్టివ్ రామారావు శేషగిరి

మనిషయుండాలి.

రెండవది శేషగిరికి నామీద పూర్తి నమ్మకం ఏర్పడి ఉండాలి. శివరావు హత్యకు నేను ప్రత్యక్షసాక్షిని. నేను చెప్పేవరకూ శేషగిరిమీదకు ఎవరి అనుమానమూ పోదు.

"డిటెక్టివ్ రామారావు గురించి శేషగిరిగారి కెలా తెలుసు?" అనడిగాను. సమాధానం గురించి చాలా కుతూహలంగా ఎదురు చూస్తూన్నాను.

"ఇదివరలో ఒక పర్యాయం రామారావు హైదరాబాద్‌లో ఇబ్బందిలో ఇరుక్కున్న శేషగిరిని రక్షించేడట. అది స్వానుభవమనుకోండి, లేకపోతే రామారావుగారు దేశంలో చాలామందికి తెలుసు. దొంగలకూ, హంతకులకూ ఆయన సింహస్వప్నం" అన్నాడు మాధవరావు.

అందులోని నిజానిజాలు నాకు తెలియవు. నేనెప్పుడూ డిటెక్టివ్ రామారావు పేరు వినలేదు. అయినా హత్యలూ పోలీసులూ, డిటెక్టివులూ వగైరా విషయాలమీద నాకాట్టే ఆసక్తి లేదు. అందువల్ల నేను వినకపోయినప్పటికీ ఆయన గొప్పవాడయుండవచ్చు. ఆయన నిజంగానే గొప్పవాడైన పక్షంలో శేషగిరి వ్యవహారం కొరివితో తల గోక్కున్నట్లే అవుతుంది.

"ఈ విషయంలో మీారేమీా దిగులు పడకండి. నేను చేయగలిగింది నేను చేస్తాను. అవసరపడే పక్షంలో మీా అబ్బాయి ప్రాణాలు రక్షించడం కోసం చిన్న అబద్ధం కూడా చెబుతాను" అన్నాను ఆలోచిస్తూ.

"మీా మేలు మరచిపోలేను. ఒక్కగానొక్క కొడుకు" అంటూ కళ్ళనీళ్ళొత్తుకున్నాడు మాధవరావు.

# 10

స్కూలుకు బయలు దేరబోతూండగా మా యింటికో అమ్మాయి వచ్చింది. మనిషి వన్నెలవిసనకర్రలా ఉంది. ముఖంలో అందముంది. వయస్సు ఇరవైకి లోపుండదని నాకు తోచింది.

"మీరే శివశంకరం మేస్టారనుకుంటాను" అందామె.

"అవును. నువ్వెవరు?" అనడిగాను.

"మరోలా అనుకోకపోతే ఒక అయిదు నిముషాలు మీతో మాట్లాడాలి" అందామె.

వాచీ చూసుకుని "అలాగే కానీ, ముందుగా మీ రెవరో తెలుసుకోవచ్చా?" అనడిగాను.

"నన్ను కామిని అంటారు. గుడి వీధిలో కామిని మేడంటే అందరికీ తెలుసు" అందామె సంకోచంగా.

ఆ అందరిలో నేనూ ఉన్నానని ఒప్పుకునేందుకు సిగ్గేసింది. "నీ మేడ సంగతి తెలియదు కానీ, గుడి వీధి గురించి ఆనోటా ఈనోటా విన్నాను" అన్నాను వెనకడుగు వేస్తూ.

ఇద్దరం చెరో కుర్చీలో కూర్చున్నాం.

"ఇక్కడికి రావడంలో నా స్వార్థం మాత్రమే కాక మీ మేలు కోరడం కూడా ఉన్నదని మనవి చేసుకుంటున్నాను" అంది కామిని.

"ఏమిటో త్వరగా చెప్పు. అవతల స్కూలుకు టైము కావస్తోంది" అన్నాను.

"ఏమిలేదు, మోహన్‌ని నిర్దోషిగా నిరూపించడానికి మీరు తప్పుడు సాక్ష్యమివ్వబోతున్నట్లు తెలిసింది. అలా చేయడంవల్ల మీ కేనష్టముని హెచ్చరించడానికి వచ్చాను" అంది కామిని.

ఆశ్చర్యపోయాను. అప్రయత్నంగా "ఈ విషయం నీ దాకా ఎలా వచ్చింది?" అని నాలిక్కరుచుకున్నాను. నా ప్రశ్నలోనే ఆరోపణ నంగీకరించడం జరిగి పోయింది.

కామిని నవ్వింది, "నాది మీకులా సాఫీ అయిన జీవితం కాదు. నా బాట నలుగురూ నడిచేది కాదు. ఇంకోలా చెప్పాలంటే నలుగురు నడిచే బాటను నేను" అని ఒక్క క్షణం ఆగిందామె. "కాలు జారిందని బాధ పడనవసం లేకుండా, క్రిందపడ్డ నా చేతికి రత్నాలు దొరి కాయి. అప్పుడు నేనదే నా వృత్తిగా స్వీకరించాను. వృత్తిలోకి దిగేక విలాసాలు పెరిగాయి. ఖర్చులూ పెరిగాయి. అందుకని సంపాదించడానికి రకరకాల మార్గాలెన్నుకున్నాను.

ఆ మార్గాల్లో ఒకటి శివరావు స్నేహం. పేరు పొందిన ధనికవ్యక్తుల్ని బ్లాక్ మెయిల్ చేసే అవకాశం నా ద్వారా శివరావుకు లభించింది. నాకు అందచందాలున్నాయి. వయసుంది. వయసుకు తగ్గ వంపులున్నాయి. ఆ వంపు సొంపులను సొమ్ముచేసుకునే తెలివి తేటలున్నాయి. నా వంటి ఆడది, పురుషులోకాన్నో ఊపు ఊపగలదనడానికి నేనే సాక్ష్యం! ముసలి వాళ్ళే నాకు లొంగిపోయినప్పుడు యువకులో లెక్క కాదు. అలాంటి కొంతమంది యువ కుల్లో మోహన్ ఒకడు."

నేను వాచీ చూసుకున్నాను.

కామిని మళ్ళీనవ్వింది. "కంగారు పడకండి మేస్టారూ. ఒక పూట బడికి ఆలశ్యంగా వెడితే ఏదైనా సమాధానం చెప్పుకోవచ్చు. కానీ నేను చెప్పేది వినకపోతే జీవి తాంతం విచారించవలసి ఉంటుంది."

"చెప్పదల్చుకున్న దేదో త్వరగా చెప్పొచ్చుగా" అన్నానేను కాస్త విసుగును ప్రదర్శిస్తూ. కానీ, నాకు వినాలని మనసులో చాలా కుతూహలంగా ఉంది.

"చెబుతున్నానుగా" అంది కామిని. ఆమె తనవానిటీ బ్యాగులోంచి ఒక ఫొటోతీసి నాకు అందించింది. చూసి అదిరిపడ్డాను. అందులో మోహన్, కామిని సభ్యప్రపంచం హర్షించని అసభ్యకరమైన విధంగా ఉన్నారు. ఆ ఫొటో నాకు కామిని ఎందుకు చూపించిందో అర్థం కాలేదు. నా ముఖ భావాలను గమనించడానికి కాసేపు ఆగి మళ్ళీ మొదలు పెట్టింది కామిని.

"ఇదీ మోహన్ చరిత్ర. అతని చర్యను నేను దృశ్య కావ్యంగా మలిచాను. ఈ ఫొటో బయటపడితే నాకేం ఫరవాలేదు. నా బ్రతుకు నలుగురికీ తెలిసినదే కాని, మోహన్ వ్యభిచారం చేసినట్లు తిరుగులేని ఋజువు దొరుకు తుంది. తప్పులు చేయకుండా ఉండలేని ఈ శ్రీమంతుని బిడ్డకు చేసిన తప్పు బయటపడితే మాత్రం పరువుపోతుం దిట. ఆ పరువును కాపాడుకోనడం కోసం శివరావు కతను నాలుగైదు వేల వరకూ చెల్లించుకున్నాడు. అందులో నాకూ వాటా ఉండి ఉండాలని అనుమానించాడు. నేను నిర్దోషిత్వాన్నభినయించాను. అతను నమ్మలేదు. నా సహకారం లేకుండా నా యింట్లో ఫొటోలెలా తీయగల డని అడిగేడు. ఆ శివరావెవరో నాకు తెలియదనీ, కావాలంటే అతని ఎదురుగానే నా నిర్దోషిత్వాన్ని నిరూ పించుకుంటానని అన్నాను. ఆ ప్రకారం ఒక రోజు మోహన్, నేను కలిసి వెళ్ళాం, శివరావుతో మాట్లాడ డానికి..."

ఆశ్చర్యంగా వింటున్నాను. కామిని ఏం చెప్పబోతోందో నాకు తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉంది. మరొక్కసారి చూసి ఆ ఫోటోను కామినికి తిరిగి ఇచ్చేశాను. ఫోటోను తిరిగి బ్యాగులో పెట్టుకుంటూ అంది కామిని "డబ్బు కక్కుర్తి ఉంటే తప్ప, ఈ ఫోటో చూసిన ఏ ఆడపిల్ల తండ్రీ తన కూతుర్ని మోహన్ కివ్వడానికి సిద్ధపడడు."

ఆ మాటలు సూటిగా నాకే తగిలాయి. రామావతి, మోహన్‌ల ప్రేమ కథ ఈమెకు తెలుసా? జైలునించి విడుదలయ్యేక మోహన్ నా ఇంటల్లుడు కావచ్చునని తెలిసే నాకా ఫోటో చూపించిందామె.

"మీరిద్దరూ శివరావు దగ్గరకు వెళ్ళేక ఏం జరిగింది?" అనడిగాను.

"అనుకోనిదే జరిగింది. అక్కడ సంభాషణ తప్పుదోవతొక్కింది. ఆ వేశంలో మోహన్ శివరావును హత్య చేశాడు" అంది కామిని.

"నేను నమ్మను" అన్నాను. ఎలా నమ్ముతాను? నా కళ్ళారా చూసిన దృశ్యం వేరే ఉంది మరి!

"ఎందువల్ల?" అంది కామిని అదోలా నా వంక చూస్తూ.

హఠాత్తుగా నేనేదో ట్రాప్‌లో పడుతున్నానేమోనని తోచింది. ఒకసారి రామారావు పేరుతో నకిలీ డిటెక్టివ్ వచ్చి వెళ్ళాడు. అప్పుడు నోరు జారినందుకు నన్ను చంపడానికి ప్రయత్నం జరిగింది. ఇప్పుడు మళ్ళీ అటువంటి ప్రయత్నమేదయినా జరుగుతోందా? తెలివిగా నా చేత నిజం చెప్పించాలని చూస్తున్నారా? ఈసారి ఇది

మాధవరావు తరఫున డిటెక్టివ్ రామారావు వేసిన పథక మేమో.

నన్ను నేను తమాయించుకుని "హంతకు డెవరో తెలుసుకోవాలని పోలీసులు నానా అవస్థాపడుతున్నారు. నీ సాక్ష్యం వాళ్ళ పని సులభం చేస్తుంది. అదీకాక నీ స్నేహితుడు శివరావును చంపిన దుర్మార్గుడికి శిక్ష పడాలని తాపత్రయం నీ కుండాలి. అదేమీ లేదు కాబట్టి" అని సూచిస్తున్నట్లుగా ఆగిపోయాను.

కామిని చాలా అందంగానవ్వి "మేస్టారూ, మీరు మీకులా ఆలోచిస్తున్నారు. నాకులా ఆలోచిస్తే అన్నీ మీకు అర్థమైపోతాయి. శివరావు నాకు స్నేహితుడే కావచ్చు. కానీ, బాగా అత్యాశాపరుడు. అతని కారణంగా నా కష్టమర్సు తగ్గారు. చాలామంది భయపడుతున్నారు కూడా నా దగ్గరకు రావడానికి. అతనికీ నాకు సంబంధంలేదని నమ్మించడం కాస్త కష్టంగానే ఉంది. శివరావు రంగంలోనించి తప్పుకుంటే అది నాకు మంచిదే అదలాగుంచండి. శివరావుకు మోహన్‌ని గురించి ఎవ్వరూ ఊహించలేని మరో రహస్యం తెలిసింది. అది చెప్పినప్పుడే మోహన్ ఆవేశపడి, అతన్ని చంపేశాడు. మీరు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం. ఆ నిజానికి నేను ప్రత్యక్షసాక్షిని" అంది.

"మేస్టారూ. ఈ విషయం నేను పోలీసుల కెందుకు చెప్పాలి ? మోహన్ ప్రాణాలిప్పుడు నా గుప్పిట్లో ఉన్నాయి. మోహన్ తండ్రి లక్షాధికారి. అందుకే ఆయనతో బేరం పెట్టాను. నేనీ రహస్యాన్ని దాచినందుకు లక్షరూపాయలు కావాలన్నాను. మొదట్లో మాధవరావు

గారంగీకరించేటట్లే కనపడ్డారు. కానీ, ఎలా దొరికేరో ఆయనకు మీరు దొరికారు. దాంతో నా లక్షరూపాయల బేరమూ ఎగిరిపోయేలా ఉంది. చూస్తూ చూస్తూ లక్ష రూపాయలనెలా వదులు కోగలను? అందుకే మీ దగ్గర కొచ్చాను.''

''నావల్ల ఏమిటి నీకు ప్రయోజనం!''

''ఈ కేసులో మీరు సాక్ష్యం చెప్పడం ద్వారా— నాకు లక్ష రూపాయల నష్టం వస్తుంది. ఆ తర్వాత మీది తప్పుడు సాక్ష్యమని నేను ఋజువు చేయగలను. అప్పుడు మీ పరువు గంగపాలవుతుంది. మీ ఉద్యోగం, మీ రూపం చూస్తూంటే మీరు చాల నీతిపరుల్లా కనబడు తున్నారు. ఒక నిర్దోషిని ప్రమాదం నుంచి రక్షించదల్చు కున్న పక్షంలో ఎలాగూ ఇప్పుడు ప్రాసెక్యూషన్ కేసంత బలంగా లేదు. నేనూ మాధవరావుగారు బేరం సెటిల్ చేసుకున్నాక అతనెలాగూ తప్పక విడుదలచేయ బడుతా డని నాకు నమ్మకముంది. అందువల్ల ఏవిధంగానూ కూడా మీరీ కేసులో జోక్యం చేసుకోవలసిన అవసరం నాకు కన బడడం లేదు'' అంది కామిని.

క్షణం ఆలోచించి ''నువ్వు చెప్పేది అబద్ధం. శివ రావును చంపిన వాణ్ణి నేను కళ్ళారా చూశాను. ఆ నిజాన్ని అబద్ధంగా ఋజువు చేయడం నీవల్ల కాదు'' అన్నాను.

''హత్య ఎందుకు, ఎప్పుడు. ఎల్లా జరిగిందో వివరంగా తెలిసినదాన్ని హెచ్చరిస్తున్నాను, అనవసరంగా తొందర పడి నవ్వులపాలు కాకండి. ఇది చెప్పడానికే వచ్చాను...'' అంటూ లేచింది కామిని. నేనూ లేచాను.

వెళ్ళిపోతూ మళ్ళీ అంది కామిని. "నాలాంటి దానికి పరువు గురించిన బాధలేదు. మీ గురించి నాకు బాధగా ఉంది. నా మాటలు గుర్తుంచుకోండి వస్తాను..."

# 11

"ఆ కామినికీ భూమ్మీద నూకలు చెల్లిపోయినట్లే. మీ రేమీ భయపడకండి. సంగతి నేను చూసుకుంటాను. మీరు మాత్రం సాక్ష్యమివ్వడానికి జంకకండి. ఎందుకంటే మీరలా సాక్ష్యం పలకడం ద్వారా ఈ కేసు శాశ్వతంగా మూతబడిపోతుంది. మీరు చెప్పిన మనిషి వాళ్ళకెలాగూ దొరకడు. అటు మోహన్, ఇటు నేనూకూడా రక్షించ బడతాం" అన్నాడు శేషగిరి.

"అసలు చెప్పకుండా ఊరుకోడానికి బాగానే వుంది కానీ ప్రత్యక్ష సాక్షినంటూ ముందుకు వచ్చి అబద్ధం చెప్పడానికి భయంగా ఉంది..."అన్నాను సంకోచిస్తూ.

"అప్పుడప్పుడు అశ్వద్ధామ హతః కుంజరః లాంటి నిజాలు చెబుతూ ఉండాలి మాబోటి వాళ్ళకోసం. ఇలాంటి వాళ్ళకి సాక్షాత్తూ శ్రీ కృష్ణుడు మద్దతు ఉండను కోండి" అన్నాడు శేషగిరి.

సమయానుకూలంగా పురాణ గాథల్నుపయోగించుకో గల శక్తి ఉన్న శేషగిరి ఆ పురాణాల్లోంచి నేర్చుకున్న దేమిటి? నా కళ్ళముందు శివరావు గుండెల్లో కత్తి పిడిని తుడుస్తూన్న శేషగిరి కనిపించాడు.

ఎటొచ్చీ అంతా మిస్టరీగా కనబడింది నాకు. నేను చూసిన హత్యకు తను ప్రత్యక్షసాక్షినంటుంది కామిని. హత్య ప్రదేశంలో నేను శేషగిరిని చూస్తే తను మోహన్ హత్య చేసాడంటోంది. ఎంత బరితెగించిన అబద్ధాలు?

శేషగిరితో మాట్లాడి బయట పడ్డాక ఒక పర్యాయం మాధవరావుగారింటికూడా వెళ్ళిరావాలనిపించింది. కామిని చెప్పిన నిజాన్నాయనకూ తెలియబర్చాలని అనుకున్నాను. నేను వెళ్ళేసరికి మాధవరావుగారింట్లోంచి ఏవో మాటలు వినపడి గుమ్మం దగ్గరే ఆగిపోయాను· ఆ మాటలు నా గురించే—

"చూస్తూ చూస్తూ ఆ దరిద్రపు కొంపనుంచి తెచ్చుకో మంటారా ఈ యింటి కోడల్ని..." మాధవరావు కోపంగా అంటున్నాడు.

దానికి సమాధానంగా మరో కంఠం "కంగారుపడ కండి ఏరు దాటేక బోడి మల్లయన్న సామెత ఉండనే ఉంది. ఇది కేవలం శివశంకరంగారిని బుట్టలో వేసుకునేందుకు నేను వేసిన పథకం. ఆ అమ్మాయి నా దగ్గరకు వచ్చినప్పుడు నేనామెతో వివరంగా మాట్లాడి మోహన్ లాంటి నిర్దోషిని కాపాడ్డానికి తన సహకారం కొంత వరకూ కావాలని చెప్పాను. ఆమె అంగీకరించింది. ఆమెకు మోహన్ మీద ఏమీ ఆశలులేవు. ఎటొచ్చీ శివశంకరం గారికి తెలిసిన నిజం బయటపడడంకోసం ఆమె తాత్కాలికంగా అబద్ధమాడ్డానికి ఒప్పుకుంది..." అంది.

"అసలా అమ్మాయి మీదగ్గర కెందుకొచ్చింది?"

సధానమిస్తున్నది రామారావు కంఠమని తెలుస్తూనే ఉంది. "ఆ రాత్రి వాళ్ళనాన్న మీద హత్యా ప్రయోగం జరిగిందని ఆ అమ్మాయికి తోచింది. అదే రోజు సాయంత్రం నకిలీ డిటెక్టివ్ రావడం ఆమె అనుమానాన్ని పెంచింది. దాంతో తండ్రికి చెప్పకుండా నా దగ్గరికే వచ్చేసింది. అప్పుడే నేనో పథకం వేశాను. మోహన్ కూడా తన

పాత్రను రక్తి కట్టించాడు. ఇంక ఒకటి రెండ్రోజుల్లో శివశంకరంగారి నోటి వెంట రహస్యం బయట పడగలదని ఆశిస్తున్నాను. చేసిన సహాయానికి ప్రతిఫలంగా ఆయనకు కొంత డబ్బు ముట్టచెప్పవచ్చు...''

''మోహన్ విడుదలవుతాడంటారా?''

''అతన్ని హంతకుడుగా నిరూపించడం కష్టమే! డైరెక్ట్ ఎవిడెన్సు లేకుండా ఊహతో ఒక మనిషిని హంతకుడుగా నిరూపిస్తే చట్టం అంగీకరించదు. ప్రాసిక్యూషన్ ఎంత బలంగా కేసు తయారు చేసుకున్నా శివశంకరంగారి సాక్ష్యం దాన్ని ఛిన్నాభిన్నం చేసేయగలదు...'' అన్నాడు రామారావు.

వారి సంభాషణను నేనింక వినదల్చుకోలేదు. నన్ను పీడిస్తున్న కొన్ని సందేహాలకు వాళ్ళ ప్రశ్నలలో సమాధానాలు లభించాయి. రామావతికీ, మోహన్‌కి పూర్వ పరిచయం లేదు. మోహన్ రామావతిని ప్రేమిస్తున్నాడన్నది అబద్ధం. మోహన్ తన ఇంటల్లుడు కావడం అసంభవం!

తేలిగ్గా నిట్టూర్చాను నేను, కానీ నా బలహీనత నాధారం చేసుకుని నన్ను మోసం చేయడానికి ప్రయత్నించిన డిటెక్టివ్ రామారావంటే నాకు చాలా కోపంగా ఉంది. ఆశపెట్టడానికి నేనేమైనా చంటిపిల్లాడినా? అతను నన్నేవిధంగా అంచనా వేశాడు.

అప్పటికి టైము ఏడుగంటల ముప్పై నిమిషాలయింది. నేను నా కలవాటైన కిళ్ళీ దుకాణం ముందు కాసేపు ఆగాను. ఆ కిళ్ళీ దుకాణంలో చాలా వార్తాపత్రికలూ, పుస్తకాలూకూడా అమ్ముతారు. ఏదైనా వార్తాపత్రికను

తీసుకుని ఓసారి పేజీలు తిరగేసి మళ్ళీ అక్కడ పెట్టేసే చనువూ, స్వతంత్రమూ నాకా దుకాణంలో ఉన్నాయి.

పేపరు చదువుతుండగా వెనకనుంచి ఎవరిదో చేయి నా భుజంమీద పడింది. ఉలిక్కిపడి వెనక్కి తిరిగాను. డిటెక్టివ్ రామారావు.

అతను నావంక నవ్వుతూ చూసి "మీతో అర్జంటుగా మాట్లాడాల్సిన విషయముంది, వస్తారా?" అనడిగేడు.

చేతిలోని పేపరు తీసి మడత పెట్టి దొంతరలో పెట్టేసి కిళ్ళీ కొట్టతని దగ్గర సెలవు తీసుకుని రామారావుతో బయ ల్దేరాను. దగ్గర్లో ఉన్న పార్కుకి తీసుకు పోయాడతను.

"మీరిప్పుడు మాధవరావుగారింటి దగ్గర్నుంచే కదూ వస్తుంట" అన్నాడు రామారావు.

"అవును."

"వచ్చిన వారు లోపలకు రాకుండా గుమ్మంలోంచే వెళ్ళిపోయారేం?"

"మీరు నన్ను చూశారా?" అన్నాను ఆశ్చర్యంగా.

రామారావు నవ్వి "ప్రయివేట్ డిటెక్టివ్‌లంతటి అజాగ్రత్తగా ఉంటారనుకోకండి. మీరు వస్తున్నట్లు చూసేకనే మా సంభాషణ మీరు వినవలసిన టాపిక్‌లోకి మారింది" అన్నాడు.

"అంటే నేను వినాలనే అలా మాట్లాడేమంటారు?" అన్నాను అపనమ్మకంతో.

"అనడం కాదు నిజమే. మీ చేత సాక్ష్యం చెప్పించడంకోసం నేనాడిన అబద్ధం ప్రమాదకరమైనదని నాకు తోచింది. మీవంటి సంస్కారవంతుల్ని అబద్ధం ఎంతగా గాయపర్చగలదో ఊహించేక నా తప్పు నేను సవరించుకో

వాలనుకున్నాను. అందుకే మాధవరావుగారితో మాట్లాడుతూ గుమ్మందాకా వచ్చిన నాకు గేట్లోంచి ఏదో ఆలోచిస్తూ వస్తున్న మీరు కనిపించారు. వెంటనే సంభాషణ మార్చాను..."

అసందర్భంగా తోచాయి నాకు రామారావు మాటలు. నన్ను వాళ్ళు చూసి ఉండరన్న నమ్మకం బాగా ఉంది నాకు. తీరా నేను వెళ్ళిపోబోయే ముందు నన్ను చూసుంటాడు రామారావు. జరిగినది గ్రహించి వెంటనే నన్ను ఫాలో చేసి వుంటాడు. ప్రతీ విషయం చాలా తికమకగా ఉంటోంది నాకు...

"అని చెప్పడానికే ఇప్పుడు నన్ను కలుసుకున్నారా?" అన్నాడు.

"కాదు. మీరేం చెప్పడానికి వచ్చేరో తెలుసుకుందుకు."

అవును నేను మాధవరావుగారికి కామిని విషయం చెప్పాలని వెళ్ళాను. వాళ్ళ సంభాషణ విన్నాక నా మనసు చెదిరి అక్రణ్ణించి బయటపడ్డాను.

"రామారావుగారూ మీరు ప్రయివేట్ డిటెక్టివ్‌గా బాగా పేరు సంపాదించుకున్న వారయుండవచ్చు. అంత మాత్రాన నాబోటివాణ్ణి అవమానించడమే మీ పరిశోధనా విధానం చేసుకోవడం నేను హర్షించలేకుండా ఉన్నాను. నాకు చాలా బాధగా ఉంది."

"మీ మనసు నొప్పిస్తే అందుకు నన్ను క్షమించమని కోరుతున్నాను. నా ఆశయాన్ని దృష్టిలో ఉంచుకుని నా తప్పులన్నీ మన్నించాలి మీరు..." రామారావు వినయంగా అన్నాడు.

"అన్నీ అబద్ధాలే చెప్పారు మీరు నాకు. పోలీసుల దగ్గర ఆ ఇంటి తలుపుల మీద పడ్డ నా వేలిముద్రలున్నాయన్నారు. అది అబద్ధం. తర్వాత మోహన్ నా కూతుర్ని ప్రేమిస్తున్నాడన్నారు. అదీ అబద్ధమే! ప్రతివారూ నా దగ్గర అబద్ధాలాడేవారే ఈ రోజు ఉదయం కామిని నా దగ్గరకు వచ్చికూడా దారుణమైన అబద్ధాలాడి వెళ్ళింది" అన్నాను విసుగ్గా ఉక్రోషంగా.

"కామిని ఎవరు?" ఆశ్చర్యంగా అడిగాడు రామారావు.

"ఈ కేసు చేపట్టిన మీకు కామిని తెలియకుండా ఉంటుందని అనుకోను...ఆమె గుడివీధిలో ఉంటుంది. వ్యభిచార వృత్తి, మోహన్‌కీ ఆమెకూ శారీరక సంబంధముంది. అందుకు సాక్ష్యంగా ఫోటోలున్నాయి. ఆఫోటోలు శివరావు దగ్గరున్నాయి. మోహన్ శివరావును హత్య చేయడం తను కళ్ళారా చూశానని కామిని అంటోంది" అన్నా గబగబా.

రామారావాశ్చర్యంగా అన్నీవిని నోరావలించి "మీరు కాస్త వివరంగా చెప్పాలి..."అన్నాడు.

నేను వివరంగా ఉదయం జరిగినదంతా చెప్పాను.

రామారావు సావధానంగా అంతా విని "చాలా ఆశ్చర్యంగా ఉంది. కేసు కొత్తమలుపు తిరుగుతోంది. ముగింపు ఎంతో దూరం లేదని తోస్తోంది నాకు. మాధవరావుగారు కామినికి సంబంధించిన రహస్యం నాదాకా రాకుండా జాగ్రత్త పడ్డాడండే—ఇందులో ఏదో తిరకాసుందనిపిస్తోంది. ఇది చాలా సీరియస్ విషయం"అన్నాడు.

"మీకు కామిని విషయం తెలియదంటే నాకు నమ్మ

కంగా లేదు'' అన్నాను.

''కామినీకీ మోహన్ కూ సంబంధముందనీ ఆవిషయంలో శివరావతన్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడనీ నాకు తెలుసు. కానీ కామిని మోహన్ చేసిన హత్యకు ప్రత్యక్షసాక్షి అనీ ఆ విషయమై మాధవరావుగారిని బ్లాక్ మెయిల్ చేస్తోందని నాకు తెలియదు.''

''ఆమె మాధవరావుగారిని బ్లాక్ మెయిల్ చేస్తుందన్న విషయం నిజమో అబద్ధమో నాకు తెలియదు. ఎందుకంటే అంతకుముందామె చాలా అబద్ధాలు చెప్పింది. శివరావు హత్యకు తను ప్రత్యక్షసాక్షినన్న ఆమె మాట ఏమాత్రం నిజం కాదు'' అన్నాను ఆవేశంగా.

రామారావు కుతూహలంగా నావంక చూసి ''నాకు తెలుసు. ఆ హత్యకు మీరొక్కరే ప్రత్యక్షసాక్షి!'' అన్నాడు.

నాల్కరుచుకున్నాను. రామారావు నేనూహించిన దానికంటె చాల తెలివైనవాడు. తమాషాగా నాచేత నిజం చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. ''నాకేం తెలియదు. నేనేమీ చూడలేదు...'' అన్నాను చటుక్కున.

''అయితే ఏ ఆధారంతో కామిని మాటలబద్ధమని మీరంటున్నారో చెప్పాలి...'' అన్నాడతను గంభీరంగా.

ఏదో చెబుదామని నోరు తెరిచాను కానీ ఏం చెప్పాలో తెలియలేదు. రామారావు నన్ను బోల్తా కొట్టించాడనే అనాలి. ఒక్క నిమిషం ఆగి ''ఏమో నాకలా అనిపించింది'' అన్నాను.

రామారావు నవ్వాడు. ''అలా అనిపించడానికేదో

కారణముండి ఉండాలి. కామిని వేశ్యకావడం బహుశా మీకా మెపై దురభిప్రాయాన్ని కలిగించి ఉండవచ్చు. కానీ నాకు కామిని మాటలు నిజమేననిపిస్తున్నాయి. మోహన్ తప్పక హంతకుడయుండాలి. నేరం ఋజువు చేయడం నా కర్తవ్యం కానీ నేరస్తుణ్ణి రక్షించడం నా అభిమతం కాదు. కేసు మోహన్ తరఫున స్వీకరించినప్పటికీ నేరస్థుడు మోహనే అయిన పక్షంలో అతన్ని నేనే హంతకుడిగా పోలీసులముందు నిలబెడతాను. ఈ విషయం తెలిసే ఏమో మాధవరావుగారు నాదగ్గర రహస్యాన్ని దాచాడు.''

నేను సూటిగా రామారావు వంకచూసి ''మీవృత్తిలో మీరెన్నడూ పొరపాటు అభిప్రాయాలు పడలేదనుకుంటున్నారా? మీరు హంతకుడిగా ఋజువు చేసే ప్రతీ ఒక్కడూ నిజమైన హంతకుడని మీరు నమ్ముతున్నారా?'' అడిగాను.

''అవును'' అన్నాడు నమ్మకంగా రామారావు.

''అయితే మీరు మోహన్‌ని హంతకుడిగా ఋజువు చేసినప్పుడు మాత్రం జీవితంలో మొట్టమొదటి సారిగా తప్పు చేశానని గ్రహించండి...'' అన్నాను.

''అంటే మోహన్ హంతకుడు కాదంటారు. ఏ ఆధారంతో ఈ మాటలు చెబుతున్నారూ అంటాను నేను.''

''హత్యను కళ్ళారా చూసిన ఒక వ్యక్తిగా'' అన్నాను.

''అయితే ఎవరు హంతకుడు.''

''అతనెవరో నాకు తెలియదు. కావాలంటే వర్ణించి చెప్పగలను'' అంటూ శేషగిరిని వర్ణించి చెప్పాను.

ఎటొచ్చీ శేషగిరికి లేని లాంగ్ హెయిరూ, మీసాలూ, మాత్రం కల్పించాను.

"మీ మాట నమ్మాలంటారు!" అన్నాడు రామారావు.

"నమ్మండి, నమ్మకపొండి—యిదే నే నివ్వబోయే సాక్ష్యం" అన్నాను.

"గుడ్. నా మాట నింత కాలానికి మన్నించినందుకు థాంక్స్. ఒక నిర్దోషికి శిక్ష పడకూడదనే అభిప్రాయంతో మీ సాయం కోరాను. కానీ, ఒక దోషిని రక్షించడాని కుపయోగపడేటట్లయితే, నేను మీ సాక్ష్యాన్నామోదించను సరిగదా, మీరు నా మాట కాదని సాక్ష్యానికి సిద్ధపడితే, తప్పని ఋజువుకూడా చేస్తాను. ఏ విషయమూ నేను కామినితో మాట్లాడేక తేలుస్తాను" అన్నాడు రామారావు.

"నా సాక్ష్యం నిజం. దాన్నబద్ధమని మీరు రుజువు చేయలేరు" అన్నాను నమ్మకంగా.

## 12

కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకుంటున్నాను. టైము తొమ్మిదీ ఇరవై దాటింది. ఇంక నిద్ర వచ్చేలాగుం దనుకుంటూండగా ఎవరో తలుపు తట్టారు. వెళ్ళి తలుపు తీశాను.

"శివశంకరంగారిల్లిదేనాండి" అంటూ లోపలకు ప్రవేశించాడో అపరిచితుడు.

అతన్ని నే నంతకుముం దెన్నడూ చూడలేదు. మనిషి బక్కపలచగా వున్నాడు. కాస్త పొడుగే అని చెప్పవచ్చు. వయస్సు సుమారు ముప్పై ఏళ్ళుండవచ్చు.

"ఇదే, నేనే శివశంకరాన్ని. మీ రెవరో తెలుసుకోవచ్చా?"

అతను నవ్వి, "నా పేరు శివరావు!" అన్నాడు.

నేను ఉలిక్కిపడ్డాను. "శివరావంటే."

"అదే సుబ్రహ్మణ్యం గారింట్లో హత్యచేయబడ్డ శివరావును నేనే" అన్నాడతను.

ముందు మతిపోయినట్లనిపించింది. తర్వాత చిరాకేసింది "చూడు మిస్టర్, నేను నీకు కొత్తవాణ్ని. నీకంటె పెద్ద వాణ్ని. నాతో నువ్వు పరాచికాలాడ్డం ఏం బాగోలేదు" కోపంలో ఏకవచనప్రయోగం చేశాను.

"నిజమే కానీ, నేను మీతో పరాచికాలాడుతున్నానని ఎందు కనుకుంటున్నారు?" అన్నాడతను నిబ్బరంగా.

"పరాచికాలు కాకపోతే నీకు కాస్త పిచ్చి వుందనుకోవాలి."

"చచ్చిపోయినవాణ్ని నా కెందుకు సార్, అవలక్షణాలంటగడతారు?" అన్నాడు శివరావు.

నాకు తిక్క రేగింది, "నీ మాటలు వినడానికి నాకు తీరుబడి లేదు. బయటకు వెళ్ళొచ్చు" అన్నాను.

"మీ రలాగంటే ఎలాగండీ, నా హత్యకు మీరు ప్రత్యక్ష సాక్షి. మీ రిప్పుడు ప్రమాదంలో వున్నారు. నన్ను చంపిన హంతకుడు బయటపడేవరకూ మీ ప్రాణాల్ని రక్షించాల్సిన బాధ్యత నామీద లేదూ?" అన్నాడతను.

అతను వెటకారమాడుతున్నాడో, నిజం చెబుతున్నాడో తెలియని అయోమయ పరిస్థితిలో పడ్డాను.

"శివరావు నంటావు. చచ్చిపోయినవాణ్నంటావు—నీ మాటల కర్థమేమిటనుకోవాలి?" అడిగాను తీవ్రంగా.

"మీ అందరి దృష్టిలో నేను చనిపోయినవాణ్ని. కానీ, నేను చావలేదు. కత్తిపోటు తినికూడా బ్రతికాను.

నేను జీవించడం వైద్యవిజ్ఞానానికే ఒక సవాల్" అన్నాడు శివరావు.

"ప్రతీకేవుంటే ఇంతకాలం ఏం చేస్తున్నావు?"

"పోలీసులీరోజే నన్నొదిలిపెట్టారు. నన్ను చంపిన హంతకుణ్ని పట్టుకోడానికి నేనే బయలుదేరాను. ఈ విషయంలో మీరు బాగా సహకరించగలరని తెలిసింది."

"ఇంకా నా సహకార మెందుకూ...నువ్వే సాక్ష్య మిచ్చుకోవచ్చు" అన్నాను వెటకారంగా. కానీ, విషయ మేమిటో నా కర్థం కాకుండా వుంది.

అసలిప్పుడు వచ్చినతను నిజంగా శివరావేనా?

మా ఇంటికి దగ్గర్లో ఒక పబ్లిక్ టెలిఫోన్ బూత్ వుంది. అక్కణ్నించి శేషగిరికి ఫోన్ చేసి విషయం చెప్పా లనుకున్నాను.

"కావాలండీ, మీ సహకారం కావాలి. ఎంతమంది సాక్ష్యమిస్తే అంత బలపడుతుంది కేసు" అన్నాడతను.

"అలాగే తప్పకుండా ఇస్తాను. నిన్ను చంపిన హంత కుణ్ని నేను చూడడమైతే చూశాను కానీ, యెవరో తెలియదు. తెలియజెప్పి వాణ్ని మళ్ళీ చూపించావంటే నీ కేసు మిస్టరీ తేల్తుంది. నాకు మనశ్శాంతీ లభిస్తుంది" అన్నాను చిరాగ్గా.

"మంచిది. మీరు కోరుకున్నవన్నీ జరుగుతాయి. పున ర్జన్మ నెత్తిన ఈ శివరావు అండ మీకు లభించింది. ఇంకేం భయపడకండి" అన్నాడు శివరావు.

"చాలా థాంక్స్. నువ్వు చెప్పదల్చుకున్నది పూర్తి అయింది కాబట్టి, ఇంక వెళ్ళిపోతా వనుకుంటాను. నాకూ నిద్ర వస్తోంది" అన్నాను నిర్మొహమాటంగా.

‘‘క్షమించాలి. నేను వెళ్ళడానికి రాలేదు. రెండు మూడ్రోజులు మీ యింట్లో వుండడానికే వచ్చాను’’ అన్నాడు శివరావు.

‘‘నా యింట్లోనా?’’ అన్నాను కంగారుగా. ‘‘ముక్కూ ముఖం తెలియనివాళ్ళ కింట్లో స్థానమివ్వడం నా కిష్టం లేదు. అందులోనూ నేను ప్రమాదంలో వున్నానని నువ్వే అంటున్నావు. ఆ ప్రమాదం నీ వల్లనే కాకూడదని లేదు కదా!’’

శివరావు నవ్వి, ‘‘నేను బయటకు పోవడంద్వారా, మళ్ళీ హత్య చేయబడే అవకాశముంది. మీ యిల్లే నాకు శ్రీరామరక్ష. నేను మీ యింట్లో లేకపోవడంద్వారా మీరుకూడా హత్యచేయబడే అవకాశముంది. అందుకే నన్ను మీ ఇంట్లో వుండనిస్తే ఉభయతారకంగా వుంటుంది’’ అన్నాడు.

‘‘మన్నించాలి. నువ్వు మరెక్కడికైనా వెళ్ళు. మా యింట్లో మాత్రం వుండొద్దు.’’

శివరావు ఓ క్షణం ఆలోచించి, ‘‘పోనీ, నా గురించి డిటెక్టివ్ రామారావుకి ఫోన్ చేసి కనుక్కోండి. ఆయన ఫోన్ నంబరు మీ దగ్గరున్నదని నా అభిప్రాయం’’ అన్నాడు.

నిజమే ననిపించింది. డిటెక్టివ్ రామారావుది కాక, శేషగిరిదికూడా నా దగ్గర ఫోన్ నంబరుంది. ఇద్దరికీ ఫోన్ చేసి ఈ విషయం చెప్పాలనుకున్నాను.

‘‘నువ్వు చెప్పింది బాగానే వుంది’’ అంటూ లోపలకు వెళ్ళాను. టెలిఫోన్ నంబర్లు నోట్ చేసుకున్న పుస్తకం చూడడానికి. నా కదలికను గమనిస్తూనే శివరావు ఉత్సా

హంగా ఈల వేశాడు.

టెలిఫోన్ నంబర్ను ఓ కాగితంమీద నోట్ చేసుకుని, "నువ్వుకూడా వస్తావా?" అన్నాను.

"వస్తానండి. ఇంట్లో ఉంటే మీకేమైనా అనుమానా లుండవచ్చు" అంటూ తనూ లేచాడు శివరావు.

ఇద్దరం బూత్ దగ్గరకు వెళ్ళాం. శివరావు బయట నిల బడ్డాడు. నేను లోపలకు వెళ్ళి తలుపులు వేసుకుని ముందుగా శేషగిరికి ఫోన్ చేశాను. శేషగిరి షాక్ తిన్నా డని పించిందతని మాటలు వింటూంటే. నిజమే మరి తన చేతుల్లో తను హత్యచేసిన శివరావు మళ్ళి తిరిగివచ్చే డంటే ఎలా నమ్మగలడు?

ఆ వచ్చిన తను శివరావో కాదో తెలుసుకున్నాక ఏం చేయాలో నిర్ణయించుకుంటానని చెప్పి ఫోన్ పెట్టేశాడు. శేషగిరి. తర్వాత డిటెక్టివ్ రామారావుకు ఫోన్ చేసి విష యం చెప్పాను. అతను నవ్వి కంగారు పడద్దనీ అతనికి ఆశ్రయమివ్వవలసిందనీ నా ప్రాణాలకు తన ప్రాణం అడ్డు వేస్తాననీ చెప్పాడు. అయినా నాకు భయంగానే ఉంది. కానీ మరి మాట్లాడలేదు. కంగారులో చేతో పట్టుకున్న నా పెన్ను జారి కింద పడిపోయింది. తీసుకోవడానికి వంగు న్నాను. అప్పుడు నన్నాకర్షించింది ఒక వస్తువు. అంత వరకూ నేను దాన్ని చూడలేదు.

# 13

సిగరెట్ పెట్టెకు రెట్టింపు సైజులో ఉన్న ఆ వస్తువు ఒక టేపు రికార్డర్ అని తెలుసుకునేందుకు నాకెంతో సేపు పట్టలేదు.

ఆ టేపు రికార్డర్ ఇంకా ఆన్ పొజిషన్లో ఉంది.

అదక్కడ ఎవరు పెట్టారు? నేనెవరితో మాట్లాడతానో తెలుసుకునేటందుకే అక్కడ అది పెట్టబడిందా?

చటుక్కున దాన్నందుకుని జేబులో పెట్టుకున్నాను. నేను బూత్ లోంచి బయటకు రాగానే "మేస్టారూ, మీ పరిశీలనా శక్తి బాగానే ఉంది కాని, టేప్ రికార్డర్ ఇలాగిచ్చేయండి" అన్నాడు.

"అయితే అదక్కడ నువ్వే పెట్టావా ?" అన్నాను కోపంగా.

"నేను కాదు నా మనిషి. మీ యింట్లో ఉండగా ఇందాక నేనో ఈల వేశాను చూశారా అదివినగానే నా మనిషిక్కడ టేపు రికార్డర్ పెట్టి చుట్టుపక్కల కాచు కూర్చున్నాడు. అది మీ దృష్టిలో పడుతుందని అనుకో లేదు. కానీ, ఒకోసారి అనుకోనివి జరుగుతాయి. ముందా టేపు రికార్డరిలాగిచ్చేయండి" అన్నాడు శివరావు.

నాకు భయం వేసింది. శరీరంలో వణుకు ప్రారంభ మైంది. శేషగిరి పేరు నా నోటినుంచి బయట పెట్టించ డానికి శివరావు పేరుతో వచ్చి నతను వేసిన ట్రిక్కు ఫలించింది. నన్నింక శేషగిరి బ్రతకనివ్వడు.

నేను చటుక్కున శివరావు చేయిపట్టుకున్నాను నెమ్మ దిగా అతనితో "శివరావు హత్య నేను చూశాను. నేను చూసేసరికి శివరావు చచ్చిపడి ఉన్నాడు. అతని గుండెల్లో కత్తి దిగబడి ఉంది. శేషగిరి ఆ కత్తి పిడిమీద జేబు రుమాలుతో తుడుస్తున్నాడు. ఈ విషయం నేను చూశా నని శేషగిరికి తెలుసు. నా మూలంగా అతని పేరు బయటకు వచ్చిందని తెలిస్తే నన్నింక నామరూపాలు లేకుండా నాశనం చేసేస్తాడు. నువ్వే నన్ను రక్షించాలి" అన్నాను.

శివరావు కళ్ళు ఉత్సాహంగా మెరిశాయి "ముందా కేపు రికార్డరిలాగివ్వండి మేస్టారూ!" అని అడిగి తీసు కున్నాడు. "నేను ముందే చెప్పాను గదా మీకీ రోజు ప్రమాదముందని. అందుకే నేను మీ యింట్లో ఉండ దల్చుకున్నాను, మీరేమీ భయపడకండి. ఈ శివ రావుండగా ఈగ కూడా వాలదు మీమీద"

నాకు భయం భయంగా ఉంది. నేనిప్పుడు శేషగిరితో పాటు శివరావుకూడా భయపడుతున్నాను. ఇద్దరం మళ్ళీ మా యింటికి వెళ్ళాం.

ఇద్దరం ఇంటికి వెళ్ళి కూర్చున్నాం ఓ పది నిముషాల సేపు. నాకు ధైర్యం చెప్పాడు. అతనికి మామూలుగా పక్క ఏర్పాటు చేశాను వరండాలో. "మీరు వెళ్ళిగదిలో తలుపులు బిడాయించుకుని పడుకోండి" అన్నాడు శివ రావు.

సరిగ్గా అప్పుడే ఎవరో తలుపు తట్టారు. నేను వెళ్ళి తలుపులు తీశాను.

వచ్చిన వ్యక్తి నాకు తెలుసు "గురుపట్టారా డిటెక్టివ్ రామారావు మీ యింటికి మళ్ళీ రావాల్సొచ్చింది" అన్నాడతను.

డిటెక్టివ్ రామారావు పేరుతో మొట్టమొదట నా ఇంటికి వచ్చిన నకిలీ డిటెక్టివ్ అతను.

నేనేమీ మాట్లాడలేదు. శివరావు కుర్చీలోంచి లేచి ఒక్క ఉదుటున అతని దగ్గరకు వచ్చి "మీరేనా డిటె క్టివ్ రామారావుగారు చాలా సంతోషంగా వుందండీ నాకు. నా హత్యకేసు మీరేకదూ పరిశోధిస్తుంట" అంటూ చేయి ముందుకు సాచాడు.

నకిలీ డిటెక్టివ్ తెల్లబోయాడు. అప్రయత్నంగానే చేతులు సాచి షేక్ హ్యాండిచ్చాడు. ఇంకా, నమ్మలేనట్లు చూస్తున్నాడతను. ఒక్క క్షణం అనంతరం తమాయించుకుని "సందేహం లేదు. మీరే శివరావు!" అన్నాడు.

"అదేంటండీ. అసలు సందేహమెందుకొచ్చింది మీకు" అన్నాడు శివరావు ఆశ్చర్యాన్నభినయిస్తూ.

"ఏమీ లేదు. మీరు మళ్ళీ ఎలా బ్రతికారు"

"ఆఁ నా ప్రాణం గట్టిది. పోస్టుమార్టం టైములో ఆగిపోయిన నా గుండె మళ్ళీ కొట్టుకోవడం ఆరంభించింది. దాంతో కొట్టుకుంటున్న కొన్ని గుండెలు మళ్ళీ ఆగిపోవడానికన్నట్టు నేను బ్రతికి వచ్చాను."

"ఇంపాసిబుల్!"

"ఇట్స్ పాసిబుల్" అన్నాడు శివరావు.

నకిలీ డిటెక్టివ్ నాకేసి చూసి "నేను మిమ్మల్ని హెచ్చరిద్దామని వచ్చాను. మీరు పెద్ద ప్రమాదంలో ఉన్నారు. కాస్త జాగ్రత్తగా ఉండండి. నా హెచ్చరిక నలక్ష్యం చేయకండి. ప్రమాదం తప్పించుకోవడం మీ చేతుల్లోనే ఉందన్న విషయం మీకూ తెలుసును. వస్తాను మరి!" అని గబగబా వెళ్ళిపోయాడు.

"అతను శేషగిరి మనిషి కదూ" అన్నాడు శివరావు సాలోచనగా.

అవునన్నట్లుగా తలాడించాను.

"వచ్చినవాడు శివరావేనో కాదో తెలుసుకుందుకు వచ్చాడు. ఈ రాత్రి శేషగిరికి నిద్రపట్టదు. ఆ తర్వాత మరి జైల్లోనే నిద్రపోతాడు" అని "ఇంక మీరు వెళ్ళిపడుకోండి మేస్టారూ!" అన్నాడు శివరావు.

నేను ముందు వీధి తలుపులు వేసి వచ్చాను. తర్వాత

శివరావువైపు చూస్తూ "అర్ధరాత్రి వీధి తలుపు తిసేటప్పుడు జాగ్రత్తగా ఉండు. ఒకసారి అలాంటి సందర్భంలో నే నా బంధువు కొకాయనకు ప్రాణప్రమాదంవచ్చి తప్పింది" అన్నాను.

"ఇలాంటి విషయాల్లో ఒకరు చెప్పాల్సిన అవసరం లేదు నాకు" అన్నాడు శివరావు సాలోచనగా.

# 14

"అవును కామిని నే మాట్లాడుతున్నాను."

"అర్జంటుగా మా ఇంటికి రావాలి. నేను శివశంకరాన్ని. ఇదివరలో ఒక పర్యాయం మా ఇంటి కొచ్చావు. నువ్వు చచ్చిపోయాడంటున్న శివరావు ప్రస్తుతం మా యింటిలో ఉన్నాడు."

బహుశా కామిని షాక్ తిందనుకుంటాను. మళ్ళీమాట్లాడ్డానికి కొన్ని క్షణాలు పట్టింది.

"సరే. ఇప్పుడే బయల్దేరి వస్తున్నాను" అవతల ఫోన్ క్లిక్ మంది.

నేను వెంటనే బయల్దేరి వచ్చి "కామిని బయల్దేరి వస్తోంది" అని శివరావుకు చెప్పాను.

శివరావు తన సరంజామాతో సిద్ధంగా ఉన్నాడు. కుర్చీ కింద టేపు రికార్డర్ పెట్టాడు.

ఒక అరగంటలో వచ్చింది కామిని. ఆమె వచ్చే ముందు రికార్డర్ ఆన్ చేసి ఉంచాడు శివరావు.

కామిని శివరావును చూస్తూనే తెల్లబోయింది "మై గాడ్ నువ్వా?"

"ఎస్ డార్లింగ్" అన్నాడు శివరావు.

"అదేమాట—అదే రూపం" కామిని అతన్ని విచిత్రంగా చూస్తూ అంది.

"అదేమిటి డార్లింగ్ నీ మాటలు నా కర్థం కావడం లేదు."

కామిని కుర్చీలో చతికిలబడింది "ఎవర్నువ్వు? ఎందు కొచ్చావ్?" అంది శివరావు వంక తీవ్రంగా చూస్తూ.

"నేను లేక నీ బిజినెస్ పడిపోయిందిగదా. అందుకని తిరిగివచ్చాను. పనిలోపనిగా నన్ను హత్యచేసిన వాళ్ళను పట్టివ్వడం నా వల్లనే జరిగితే బాగుంటుంది కదా అని తోచి."

"మాటలు కట్టిపెట్టు నువ్వు శివరావువి కాదు" అంది కామిని.

"ఎలా చెప్పగలవ్!" శివరావు వేళాకోళంగా అన్నాడు.

"శివరావు చచ్చిపోయాడు. మోహన్ అతన్ని పొడిచి చంపేశాడు" అంది కామిని.

"పొడిచేడన్నమాట నిజం కానీ, నేను చావలేదు."

"ఎంపాసిబుల్. శివరావు చచ్చేదాకా అక్కడే ఉన్నాన్నేను, నాడి ఆగిపోయేకనే అక్కణ్నించి కదల లేదు నేను."

"ఓహో! అయితే శివరావు హత్యకు నువ్వే ప్రత్యక్ష సాక్షి వన్నమాట!"

"అవు" అంది కామిని.

"మిస్ కామినీ. నేను చచ్చి బ్రతికాను, మీరందరూ చనిపోయాడనుకుంటున్న శివరావుని నేనే. అయినాకూడా నాముందే అబద్ధాలు చెబుతున్నావంటే నువ్వెంత గుండెలు తీసిన బంటువో తెలుస్తుంది" అన్నాడు.

కామిని చిత్రంగా చూసింది శివరావు వంక. ఒక్క నిముషం ఆగి "మోహన్ని రక్షించడం కోసం మాధవ రావుగారు పోలీసులకు డబ్బిచ్చి నకిలీ శివరావుని తయారు

చేయించాడన్నమాట. ఇప్పుడు కేసు రూపమే మారి పోతుంది. నువ్వెవరివో నాకు తెలియదు. నాకు లక్ష రూపాయల ఆదాయాన్ని పోగొట్టాలని చూస్తూన్నావు. నేనది సహించను, సహించలేను. నేను శివరావు హత్య కళ్ళారా చూశాను. మోహన్ హత్య చేశాడు. ఈ విష యాన్ని పోలీస్టేషన్లో ఇప్పుడే చెప్పివస్తాను. నువ్వో వేళ నిజంగా శివరావువే అయుండినప్పటికీ హత్యా ప్రయత్నం నేరానికైనా మోహన్‌కు కొంత శిక్ష పడుతుంది. ఆఖరి ప్రయత్నంగా మాధవరావు గారిని హెచ్చరిస్తాను" అంది.

"నన్ను హత్య చేసిందెవరో నాకంటే నీకు బాగా తెలుస్తుందను కుంటున్నావా కామినీ!" అన్నాడు శివరావు వ్యంగ్యంగా.

"తెలుస్తుంది. ఎందుకంటే నువ్వంటున్న నువ్వు నువ్వు కాదు." అంది కామిని.

"సరే. నేను శివరావుని కాదనుకో! అప్పుడు కూడా నీ సాక్ష్యానికి సవాలుంది. ఆ సవాలు ఈ శివశంకరంగారి వద్దనే వుంది."

కామిని నవ్వింది. "ఎవరి సవాలునూ నేను లెక్క చేయను. మోహన్ హంతకుడు. దీన్నెవరూ అబద్ధమన లేరు."

"అలాగా! అయితే హంతకుడు శేషగిరి అని శివశంకరం గారంటున్నారు. ఈ కేసులో ఆయన కూడా ప్రత్యక్ష సాక్షి" అన్నాడు శివరావు.

కామిని తెల్లబోయి నా వంక చూసింది. "ఇంత కాలం మీరు కల్పించబడ్డ సాక్షి అనుకుంటున్నాను. శేషగిరిగారిని

మీరు హంతకుడంటున్నారంటే ఇందులో ఏదో మోస ముంది!''

"మోసం నీలో వుంది." అన్నాడు శివరావు.

కామిని కళ్ళు ఎరుపెక్కాయి. ఆమె నా వంక తీవ్రంగా చూసి "మేస్టారూ! అబద్ధమాడకండి. నిజంగా మీరు శివరావు హత్యను కళ్ళారా చూశారా?" అనడిగింది.

నేను క్షణం తటపటాయించి జరిగినది వివరంగా చెప్పానామెకు.

నేను చెప్పినది వింటూనే కామిని ముఖం గంభీరంగా అయిపోయింది. వరండాలో కాస్సేపు నిశ్శబ్దం రాజ్యమేలింది. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ కామిని అంది. "శివ శంకరంగారు నిజమే చెబుతున్నారు. ఇప్పుడంతా నా కర్థమైంది. మోహన్ చేతిలో శివరావు చచ్చిన కొన్ని క్షణాలకు శేషగిరి ఇక్కడకు వచ్చి పరిస్థితి నర్థంచేసుకుని అతన్ని రక్షించడంకోసం కత్తి పిడిమీది వేలిముద్రలు తుడిచేసి వుంటారు."

శివరావు నవ్వాడు బిగ్గరగా. "కామిని! నీ ఊహా బలాన్ని కొనియాడకుండా వుండలేను. మోహన్ నీ కేసులో ఇరికించాలని కథను చాలా అందంగా మలిచావు కానీ, శేషగిరికి మోహన్‌ని రక్షించాల్సిన అవసరమేముంది?" అన్నాడు.

కామిని నవ్వి, "ఎంతయినా రక్తసంబంధం కదా! చూస్తూ చూస్తూ ఏ తండ్రి ప్రమాదంలో వదిలిపెట్టేస్తాడు!" అంది.

తెల్లబోయాను నేను.

# 15

శివరావు బ్లాక్ మెయిలర్ రూపంలో ప్రవేశించిన ప్రభుత్వం ఏజంటు.

నగరంలో దొంగనోట్లు విరివిగా ప్రింటవుతున్న విషయం ఆచూకీ తీయడాని కతనీ ఊరు వచ్చాడు. ఊళ్ళోని ధన వంతుల రహస్యాలను కొన్ని తెలుసుకుని వాళ్ళను బ్లాక్ మెయిల్ చేయడం మొదలుపెట్టాడు. అందుకతను కామిని సహాయం కూడా తీసుకున్నాడు. తనకు వచ్చే డబ్బులో ఎవరు ఎలాంటి డబ్బు ఇస్తున్నారన్న విషయాన్ని తను శ్రద్ధగా పరిశీలిస్తూ ఎప్పటికప్పుడు రిపోర్టు తయారుచేసి పంపుతూం డేవాడు. అతను పంపిన ఆఖరు రిపోర్టులో దొంగ నోట్ల గురించి కొంత ఆచూకీ దొరికిందనీ, రెండుమూడు రోజుల్లో నేరస్థుడు దొరకవచ్చుననీ అతను వ్రాశాడు.

ఆ నేరస్థుడు శేషగిరి అన్న విషయం అతను తన రిపోర్టులో వ్రాయలేదు. కానీ శేషగిరిని మాత్రం శివరావు బెదిరించడం మొదలుపెట్టాడు. అతను దొంగనోట్లు అచ్చు వేస్తున్న విషయం తనకు తెలిసిందనీ, తనకు పాతిక వేలి స్తే రహస్యం రహస్యంగా వుండగలదనీ శివరావు శేషగిరిని హెచ్చరించాడు. శేషగిరి పాతిక వేలూ ఇచ్చినట్లయితే అతని నేరం ఇంచుమించు బుజువై పోయినట్లే!

మోహన్ తల్లి చంద్రిక మాధవరావుగారికి దూరపు వరుసలో మరదలవుతుంది. చంద్రిక పెళ్ళికాకముందే శేషగిరితో చీకటి తప్పు చేసింది. ఆ తప్పు కారణంగా ఆమె గర్భవతి అయింది. శేషగిరికి అప్పటికే పెళ్ళయి పోయింది.

చంద్రిక తలిదండ్రులు ఏం చేయాలో తోచక తికమక

పడుతున్న సమయంలో విషయం మాధవరావుగారిదాకా వెళ్ళి ఆయన చంద్రికను చేసుకునేందుకు ముందుకు వచ్చాడు. ఆయన త్యాగశీలతనందరూ అభినందించారు. వివాహం కాగానే మాధవరావు భార్యతోసహా దూరప్రాంతాలకు పోయి, అక్కడ భార్య పండంటి కొడుకును కన్నాక మళ్ళీ తిరిగి వచ్చారు. ఆ బిడ్డడే మోహన్.

అయితే మాధవరావు త్యాగానికి అర్థం లేకపోలేదు' ఆయన నపుంసకుడు. ఆ విషయం నలుగురికీ తెలియడం ఆయన కిష్టంలేదు. తనూ వివాహితుడై తనకూ కొడుకో, కూతురో పుడితే తన గురించి ఎవరికీ అనుమానం రాదని ఆయన ఆశ. అందుకే గర్భవతి అని తెలిసి కూడా ఆయన చంద్రికను చేసుకునేందుకు సిద్ధపడ్డాడు. ఆ విధంగా ఆయనకు చంద్రిక తలిదండ్రులు కృతజ్ఞతతో పడివున్నారు, అటు తండ్రీ కాగలిగాడు.

అయితే చంద్రిక కింకా నూరేళ్ళ జీవితముంది. నపుంసకుడైన భర్తతో ఎన్నేళ్ళని నిగ్రహంగా వుండగలదు? ఆమె బరితెగించేయగలదన్న భయంతో తన బిడ్డకు తండ్రి అయిన శేషగిరి ఎలాగూ ఒక పర్యాయం ఆమెను కలిశాడు కాబట్టి తన భార్యను కలుకోవచ్చునన్నట్లు భార్యకు సూచన ప్రాయంగా తెలియజేశాడు. ఆ విధంగా—కావడానికి మాధవరావు భార్య అయినప్పటికీ చంద్రిక శేషగిరికి రెండో భార్యగా వుంటూవచ్చింది. మాధవరావు ఆమోద ముంది కాబట్టి ఈ విషయం బయటివారికెవ్వరికీ తెలియదు. కానీ బ్లాక్ మెయిలింగ్ వృత్తిగా పెట్టుకున్న శివరావు ఈ సమాచారాన్ని సేకరించగలిగాడు.

కలవారి బిడ్డగా ఘనంగా పెరుగుతున్న మోహన్ కి తన

చరిత్ర తెలియజెప్పి, శేషగిరిమీద కసిగొల్పి, శేషగిరి రహస్యాలన్నీ బయటపెట్టించాలని శివరావు పథకం వేశాడు. హత్యచేయబడడానికి ముందు రోజు సాయంత్రం అతను మోహన్‌ని కలిసి, తనకు తెలిసిన రహస్యం చెప్పాడు. మోహన్ ముందు తెల్లబోయాడు. ఇదంతా శేషగిరి కారణంగానే జరిగిందనీ, అతనిమీద పగ తీర్చుకునేటందుకు మంచి ఉపాయ మొకటుందనీ, మర్నాడుదయం తన్ను ఫలానాచోట కలుసుకోమనీ చెప్పాడు. శేషగిరి విషయంలో తనకు సహాపడే పక్షంలో కామిని విషయంలో కూడా మరి బ్లాక్ మెయిల్ చేయననీ చెప్పాడు శివరావు.

కానీ కథ శివరావనుకున్న విధంగా జరగలేదు. మోహన్ ఇంటికి వెళ్ళి తల్లిని నిలదీశాడు. ఫోన్ చేసి శేషగిరిని కడిగేశాడు. ఇద్దరి కథలూ విన్నాక అతనికి తన తల్లిమీదే తప్పులేదనిపించింది. అతను నెమ్మదిమీద శాంతించగలిగాడు. తప్పు చేయడంకంటె తప్పు బహిర్గతం కావడమే అవమానమనుకునే నైజం అతని రక్తంలో వుంది. శివరావుని చంపేయడమే అందుకు మార్గం అనుకున్నాడతను.

తన బ్లాక్ మెయిలింగ్ డబ్బులో శివరావు కామినికి కొంత వాటా ఇవ్వవలసివుంది. అతను సరిగ్గా తన కివ్వడం లేదనీ, తన్ను మోసం వేస్తున్నాడనీ కామినికి అనుమానం వచ్చింది. ఆమె అనుమానానికి శివరావు నవ్వేసి, "అంతగా నమ్మకం లేకపోతే నాతోపాటు రా. రహస్యంగా పొంచి వుండి జరిగేది చూడు." అన్నాడు.

మర్నాడే శేషగిరి శివరావుకు పాతిక వేలిచ్చుకోవలసి వుంది. ఆ టైముకు ఒక అరగంట ముందుగా మోహన్‌తో

అపాయింట్ మెంటు పెట్టుకున్నాడు శివరావు. మోహన్ ని బాగా రెచ్చగొట్టి, అతనా స్థితిలో వుండగా శేషగిరి అక్కడకు రావాలని అతని పథకం.

శివరావు, కామిని ఇంట్లోకి వెళ్ళారు. కామిని ఎవరికీ కనబడకుండా ఒక మూల నక్కింది.

అన్న టైముకి మోహన్ వచ్చాడు. అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఏం నిర్ణయించుకున్నావ్?" అడిగేడతను.

"నువ్వు చెప్పింది అబద్ధం." అన్నాడు మోహన్.

"నా దగ్గర ఋజువులున్నాయి." అన్నాడు శివరావు.

"నీ కథలో కొన్ని లోపాలున్నాయి. మరోసారి చెప్పు!" అన్నాడు మోహన్. అతన్ని రెచ్చగొట్టే పద్ధతిలో మొత్తం కథంతా చెప్పాడు శివరావు.

"చాలా వివరంగా గుర్తుంచుకున్నావ్. ఈ సమాచారం ఇంకా ఎవరికైనా తెలుసా?" అన్నా మోహన్.

"మీ నాన్నకూ, శేషగిరికీ, మీ అమ్మకూ తర్వాత... ఈ రహస్యం తెలిసినవాణ్ణి నేనొక్కడినే. నా దగ్గరకు వచ్చిన రహస్యం చాలా పదిలంగా వుంటుంది. నన్ను దాటి పోదు." అన్నాడు శివరావు.

"మంచిది." అంటూ మోహన్ లేచాడు. "ఆ శేష గిరిని బ్రతకనివ్వను. నేనేం చేయాలో చెప్పు." అంటూ శివరావుని సమీపించాడు. శివరావు ముఖంలో సంతోష రేఖలు కనబడ్డాయి. కానీ క్షణంలో మెరుపువేగంతో అతని గుండెల్లో కత్తి దిగబడింది. శివరావు వెనక్కు పడి పోయాడు. కత్తి బలంగా దిగబడింది. శివరావు మళ్ళీ మాట్లాడలేదు.

చాటుగా ఈ విషయం చూస్తున్న కామిని భయంతో వణికిపోయింది. ఏ రహస్యం దాచడంకోసం మోహన్ శివరావుని హత్యచేశాడో అదే రహస్యం తనకూ ఇప్పుడు తెలిసింది. పైగా హత్య తను కళ్ళారా చూసింది. ఆమె అక్కణ్ణించి ఎలాగో తెలివిగా మోహన్ కళ్ళబడకుండా బయటపడగలిగింది.

శేషగిరి వెళ్ళేసరికి మోహన్ ఇంకా అక్కడే వున్నాడు. అప్పటికి హత్య జరిగి పది నిమిషాలయిందో లేదో. జరిగింది అర్థమయింది శేషగిరికి. "హత్య చేశావా? తక్షణం దొడ్డి దారిన పారిపో!" అన్నాడు. మోహన్ పారిపోయాడు.

తర్వాత శేషగిరి గబగబా అక్కడ అన్నీ వెదికాడు. శవం జేబులో కొన్ని కాగితాలు, ఫోటోలు దొరికాయి. అవి తీసుకుని, మోహన్ని రక్షించడంకోసం అతనక్కడి కొచ్చిన ఆధారాలు పరిశీలించాడు. కత్తి పిడిమీద ఎందుకైనా మంచిదని వ్రేలిముద్రలు తుడుస్తున్న సమయంలో నేనాయన్ను చూశాను.

శివరావు ప్రభుత్వపు ఏజంటు కావడంతో దర్యాప్తు చాలా రహస్యంగా జరిగింది. కొన్ని ఆధారాలతో మోహన్ని అరెస్టు చేశారు. కానీ సరైన ఋజువులింకా లభించలేదు.

నా రెండో కూతురు రామావతి నాకూ, నకిలీ డిటెక్టివ్‌కూ జరిగిన సంభాషణ అసలు డిటెక్టివ్‌కు చేర్చడంతో కేసుకు మళ్ళీ ఆధారం దొరికింది. నాచేత శేషగిరి పేరు చెప్పించడంకోసం చాలా తంటాలు పడ్డారు.

ప్రతి ప్రభుత్వపు ఏజంటుకూ సాధారణంగా దూప్సు వుంటారు. అవసరాన్ని బట్టి ఈ దూప్సుని ఉపయోగించడం

జరుగుతుంది. ఈ డూప్స్ కూడా అసలు ఏజంటు పోలికల్లో వుంటారు. అచ్చు ఒరిజినల్ ఏజంటులా తయారు కావడానికి కొద్దిపాటి మేకప్ చాలు. నడక, ప్రవర్తన, అలవాట్లు వగైరాలన్నీ ఒరిజినల్ ఏజంటుకిలాగానే వీరూ అలవర్చుకుంటారు. నాచేత నిజం చెప్పించడానికి ఆఖరి ప్రయత్నంగా శివరావు స్థానంలో డూప్ వచ్చాడు. ఫలితం సాధించాడు.

జరిగినదంతా గ్రహించేక నా కనిపించింది :—అంత కాలం శేషగిరి హంతకుడని నిరూపించడానికి నన్ను నేను ప్రత్యక్ష సాక్షిగా భావిస్తూవచ్చాను. కానీ హంతకుడు శేషగిరి కాదు.

అందుకే మన కళ్ళను కూడా మనం నమ్మకూడదు. కళ్ళముందేదైనా జరిగినప్పటికీ ఎవ్వరూ సాక్షులు కాలేరు. ఈ సకల చరాచర ప్రపంచంలో అన్నీ తెలిసిన ప్రత్యక్ష సాక్షి ఆ పరమాత్మ ఒక్కడే!

—: ఐపోయింది :—

# రాబందుల చేతిలో రాకుమారి

**అజీజ్**

అది డెహ్రాడూన్‌కి వంద కిలోమీటర్ల దూరాన ఉన్న ఖోనితాల్ నగరంలోని సీక్లఫ్ హోటల్.

ఆ హోటల్ గదిలో నేనూ, నా అసిస్టెంట్ సార్జంట్ డేవిడ్, లేడీ ఇన్వెస్టిగేట్ షీలా, ప్రభుత్వ ప్లాస్టిక్ సర్జరీ నిపుణుడు సంఘుమిత్రా కూర్పుని ఆ కేసు గురించి ఆలోచిస్తున్నాం.

ఉదయం తొమ్మిదిగంట లవుతోంది.

అత్యంత రహస్యమైన ఒక మిషన్ మీద, భారత స్పెషల్ బ్రాంచ్ తరఫున మేమక్కడికి పంపబడ్డాం.

చైనా సరిహద్దులకీ, మన సరిహద్దులకీ మధ్య సిక్కిమ్ లాగే రత్నాగఢ్ అనే చిన్న సంస్థానం ఉంది. రాజా

మణిపాల్ దానికి పాలకుడు. సిక్కిమ్ ఈ మధ్యే సంతోష పూర్వకంగా మన రాజ్యంలో విలీనమై, మన రాష్ట్రాల్లో ఒక రాష్ట్రంగా నిలిచిపోయింది.

అది చూచి రత్నాగడ్ రాజ్యమూ మనలో విలీనం కావడానికి నిశ్చయించింది. ప్రస్తుతం అక్కడ ప్రభుత్వానికీ, ప్రజానాయకులకీ మధ్య ఈ విషయంలో చర్చలు జరుగుతున్నాయి.

చైనాకు సిక్కిమ్‌లాగే, రత్నాగడ్ మీదుగా మన భూభాగంలో ప్రవేశించడానికి సులువైన మార్గాలున్నాయి. ఒక విధంగా చూస్తే సిక్కిమ్, రత్నాగఢ్ దేశాలు మనకు పెట్టని కోటల్లా నిలిచి ఉన్నాయని చెప్పాలి.

వాటిని దాటందే, చైనా మన గడ్డమీద కాలు మోపలేదు. భారత స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్ పినాక్‌పాణి ఆదేశానుసారం ఈ రోజు సాయంత్రం ఐదు గంటలకి నేనూ, నా అసిస్టెంట్ డేవిడ్ కార్లో, ఇక్కడికి నాలుగు మైళ్ళ దూరాన, ఓ నిర్మానుష్యమైన ప్రదేశంలో ఉన్న, ప్రభుత్వ ఫారెస్ట్‌డాక్ బంగళా చేరుకుని, అక్కడ బస చెయ్యాలి.

ఆ బంగళాకి ఫర్లాంగు దూరంనించి ఓ అరణ్యం ప్రారంభమౌతుంది. ఆ అరణ్యం దాటాకనే, రత్నాగఢ్ సీమలు ప్రారంభమౌతాయి. రత్నాగడ్ అవలివైపే ఉన్నాయి చైనా సరిహద్దులు.

డేవిడ్ నా నౌకరు రూపంలో వస్తాడు. చూసేవాళ్ళకి మే మా అడవిలో వేట కోసం వచ్చినట్లు భ్రాంతి కలిగించాలి. మా వెంట డబుల్ బారల్ గ్రైఫల్స్, వేటకు

అవసరమయ్యే ఇతర సామానూ ఉంటుంది.

అక్కణ్ణించే ప్రారంభమౌతుంది మా పరిశోధన.

అత్యవసర పరిస్థితి ఏర్పడితే, ఇక్కడ మన సరిహద్దుల్లో ఉన్న సైనిక సహాయం తీసుకోవచ్చు. మాకు ఎలాంటి సహాయం కావలసి వచ్చినా, తక్షణం చెయ్యవలసిందిగా, రక్షణశాఖనించి ఇక్కడి సైనికాధికార్లకు మెసేజ్ అందింది.

ఈ రాత్రి పదిగంటల ప్రాంతంలో, ఢిల్లీనించి ఓ హెలికాప్టర్ వచ్చి, ఈ హోటల్ మీది టెరియస్‌లో దిగి, ఎమర్జన్సీ సమయంలో మాకు సహాయపడటానికి సిద్ధంగా ఉంటుంది.

ఇన్ని ఏర్పాట్లు జరిగిన ఈ మిషన్ ఎటువంటిదో ఇక మీరే ఊహించుకోవాలి. ఆ మిషన్ ఏమిటి? మేమిక్కడికి ఏ ఉద్దేశంతో పంపబడ్డాం? అనే విషయాలు మా పరిశోధన ముందుకు సాగేకొద్దీ మీ కన్నీ తెలుస్తూనే ఉంటాయికదా?

## 2

సాయంత్రం నాలుగ్గంటలకి, కావలసిన సామానుతో, డేవిడ్‌తో కార్లో బైలుదేరేను. ప్లాస్టిక్ సర్జరీ నిపుణుడు సంఘమిత్రనీ, షీలనీ హోటల్లో ఉండి నా ఆదేశంకోసం ఎదురు చూస్తూండమని చెప్పేను.

ఐదు గంటల ఏడు నిమిషాలకి ఆ డాక్ బంగళా చేరుకున్నాం. మా కారు గేటుగుండా లోనికి ప్రవేశించగానే కనిపించింది పోర్టికోలో ఆగి ఉన్న ఓ ఇంపాలాకారు!

సాలోచనగా తలూపుతూ చిన్నగా నవ్వుకున్నాను.

కారు పోర్టికోలో ఆపి, రెండుమూడుసార్లు హారన్

మోగించేడు డేవిడ్. మరు క్షణం లోపలినించి ఆ బంగళా ముసలి ఉద్యోగి ఒకడు పరిగెత్తుకు వచ్చేడు.

"మేము ఘోనితాల్ నించి వస్తున్నాం. ఇక్కడ బస జెయ్యడానికి రెండు గదులు కావాలి!" అన్నాను.

"ఇక్కడున్నవి మూడే గదులు సార్! ఒక దాంట్లో ఇదివరకే రత్నాగఢ్ రాకుమారి వచ్చి ఉన్నారు. ఒకటి మీకిచ్చి మూడో గది ఖాళీగా ఉంచాలి."

"దేనికి?"

"ఇది ప్రభుత్వ రెస్ట్‌హౌస్ కదా సార్, ఏ క్షణంలోనైనా ఏ ప్రభుత్వ ఆఫీసరైనా రావచ్చు కదా?" అన్నాడా వృద్ధుడు మమ్మల్ని పరీక్షగా చూస్తూ.

"ఆ ఇంపాలా కారు రాకుమారిదేనా?" అడిగేను అటు సైగ జేసి.

"ఔను సార్!"

"రాకుమారి ఈ నిర్జన ప్రదేశంలో వచ్చి దేనికి బస జేసింది?" అడిగేను ఆశ్చర్యంగా.

"ఆమెకి వేటాడే హాబీ ఉంది. వారం రోజుల్నించీ ఇక్కడే బసజేసి ఉన్నారు."

"వెరీగుడ్ మేమూ వేటకోసమే వచ్చాం. వెళ్ళి రాకుమారికి మా నమస్కారాలు అందజెయ్యి." అన్నాను నవ్వుతూ.

"క్షమించండి సార్. చీకటి పడ్డాక ఆమె ఎవర్నీ చూడరు. బైటకి రారు!"

"ఏం? భయమా? వేటకి వచ్చిన రాకుమారి వెంట పెద్ద బలగమే ఉండాలిగా?"

ఆ వృద్ధుడు నవ్వి—"ఎవర్నీ వెంటతీసుకు రాలేదు

సార్ ఒంటరిగానే ఉన్నారు" అన్నాడు.

"చాలా ఆశ్చర్యంగా ఉందే! సరే గది చూపించు. సామాను లోపల పెట్టాలి. అన్నట్టు నీ పేరేమిటి?" అడిగేను.

"ప్యారాసింగ్ సాబ్!" అన్నాడతను బంగళా వేపు నడుస్తూ.

మాకు గది చూపించి, సామాను లోన పెట్టడంలో డేవిడ్ కి సహాయపడి, రిజిష్టర్ లో మా గురించి రాసుకుని వెళ్ళిపోయేడు ప్యారాసింగ్.

"డేవిడ్ లోపలినించి లోడ్ జేసిన రైఫల్ తీసుకురా!" అన్నాను వరండాలో నిల్చుని.

"ఇప్పుడా? దేనికి?" అడిగేడు డేవిడ్ ఆశ్చర్యంగా.

నవ్వి—"ఆ రాకుమారితో పరిచయం జేసుకోడానికి!" అన్నాను వరండాలోని లైటు వెలిగిస్తూ.

డేవిడ్ మళ్ళీ ప్రశ్న వెయ్యకుండా గదివైపు నడిచేడు. రెండు నిమిషాల్లో రైఫల్ తో తిరిగి వచ్చేడు.

"గాలిలో రెండుసార్లు ఫైర్ జెయ్యి" అన్నాను.

అది డబుల్ బారల్ రైఫల్ గనక రెండే తూటాలుంటాయి. డేవిడ్ మౌనంగా రైఫల్ ఎత్తి రెండు సార్లు ఫైర్ జేసేడు.

చెవులు చిల్లులుపడే చప్పుడుతో పరిసరాలు మారుమోగేయి.

అంతే, మరుక్షణం మాగది పక్కనే ఉన్న గది తలుపు తెరుచుకుని ఓ యువతి ఖంగారుగా బైటికి వచ్చింది.

పాతికేళ్ళుంటాయి. పాదాల వరకూ వేళాడే పల్చని

తెల్లగాను. గులాబిరంగు ఒళ్ళు. భుజాలవరకూ కత్తిరించిన జుత్తు. కళ్ళు చెదరగొట్టే అందం ఆమెది.

మమ్మల్ని చూడగానే, "ఫైరింగ్ ఎవ్వరు జేసేరు?" అడిగింది వణికే కంఠంతో.

నవ్వి—"నేనే!" అన్నాడు.

"మీ చేతిలో రైఫల్ లేదే?" అడిగింది ఆశ్చర్యంగా.

"అదిగో, నా సర్వెంట్ చేతిలో ఉంది. ఈ ఫైరింగ్ వల్ల మీకు భయంవేసివుంటే క్షమించండి. ఆరైఫల్ ట్రిగ్గర్ కాస్త పాడైతే ఇప్పుడే రిపేర్ చేసి సరిగ్గా పని జేస్తుందో లేదో చూడాలని గాలిలో ఫైర్ జేయించేను."

"అబ్బే, నాకేం భయం? ఇంతవరకూ నిశ్శబ్దంగావున్న వాతావరణంలో అలా హఠాత్తుగా చప్పుడైతే, ఏమిటా అని పరిగెత్తుకు వచ్చేను. ఇంతకీ, ఎవ్వరు మీరు?" అడిగింది మమ్మల్ని పరీక్షగా చూస్తూ.

"నా పేరు రాజారెడ్డి. ఇతను నా నౌఖరు డేవిడ్. ఈ అడవిలో రెండు మూడు రోజులు వేటాడాలని వచ్చాం!" అన్నాను నవ్వుతూ.

"ఓ వెరీగుడ్! నేనూ వేటకోసమే ఇక్కడ ఉంటున్నాను."

"ఒంటరిగానా?"

రాకుమారి తెలూపింది. "రాజరిక కార్యకలాపాలతో మునిగి తేలే మా పేలెస్‌లో నాకు చెప్పలేని విసుగు పుడుతుంది. కాలు కదిపితే సేవకులు. ఎక్కడికి కెళ్ళినా అంగ రక్షకులు. ఆ జీవితం భరించలేక కొన్నాళ్ళు స్వేచ్ఛా వాయువు పీలుస్తూ ఒంటరిగా గడపాలని వచ్చేను. రండి, అలా వరండాలో కూర్చుని మాట్లాడుకుందాం!" అంటూ

వరండా మధ్య వేసివున్న సోఫావైపు నడిచింది రాకుమారి.

"నేనొక పారిశ్రామిక వేత్తని. కలకత్తాలో ఓ ఎరువుల ఫ్యాక్టరీ నడుపుతున్నాను. మీ పేరు తెలుసుకోవచ్చా?" అడిగేను సోఫాలో కూర్చుంటూ.

రాకుమారి నవ్వి—"మేనక!" అంది.

అప్పుడు గమనించేను, ఆమె పలువరస ముత్యాల్లా తళతళ మెరవడం.

"మేనక స్వర్గంలో వుంటుంది. కొంపదీసి మీరు ఆకాశం నించి దిగివచ్చిన అప్సరస కాదు కదా?"

ఈసారి పకపక నవ్వి—"నో. నో. మిస్టర్ రాజారెడ్డీ! నేను ప్రిన్సెస్‌ని. రత్నాగఢ్ రాకుమారిని!" అంది.

"థాంక్ గాడ్! నా జీవితంలో ఒక రాకుమారి కంపెనీ కూడా లభిస్తుందని ఎన్నడు ఊహించలేదు. మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషం!" అన్నాను ఆమె రాకుమారి అని తెలియనట్టు ఆశ్చర్యంగా నటిస్తూ.

రాకుమారి ఏదో అనడానికి నోరు తెరిచింది. సరిగ్గా అదే క్షణంలోంచి దిక్కులు మారుమోగేలా మూడు సార్లు రైఫిల్ పేలిన శబ్దం వినిపించింది. ఆ శబ్దం వినగానే అంత వరకూ నవ్వుతూ తుళ్ళుతూ వున్న రాకుమారి భయంతో గజగజ వణకసాగింది.

"అరణ్యంలో ఎవ్వరో ఏ అడవి పందినో వేటాడుతూ ఫైర్ జేసి ఉంటారు. ఈ మాత్రానికే మీరలా భయపడితే ఎలా?" అన్నాను సిగరెట్ తీస్తూ.

"అ... బ్బే! నాకేం భయం? నే... నేం భయపడ్డం లేదే?" అంది మేనక తడబడుతూ.

రెండు నిమిషాల తరవాత హఠాత్తుగా మళ్ళీ మూడు

సార్లు ఫైరింగ్ శబ్దం వినిపించింది. దాంతో, ఈసారి
మేనకలో విచిత్రమైన మార్పు వచ్చింది. కూర్చున్నదల్లా
ఉన్మాదంవచ్చినట్టు చివాల్న లేచి గదిలోకి పరుగెత్తింది.

నిమిషం తరవాత బైటికి వచ్చిన ఆమె చేతిలో రైఫిల్
చూసి నివ్వెరబోయేను. నేనింకా ఆ ఆశ్చర్యం నించి
తేరుకోకముందే మేనక ఢాం, ఢాం, ఢాం, అని మూడు
సార్లు గాలిలో ఫైర్ జేసింది. అది ఎస్. ఎల్. ఆర్.
(సెల్ఫ్ లోడింగ్ రైఫిల్).

ఒక్క ఉదుటున సోఫాలోంచి లేచి, ఆమె దగ్గరికి
పరిగెత్తి, గట్టిగా చేయి పట్టుకున్నాను.

ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో ఆమె ఛాతీ ఎగిరి పడు
తోంది.

"మేనకా దేవీ! ఏమిటిది? మతి చలించలేదు కదా?"
అన్నాను ఆమె చేతిలోంచి రైఫల్ లాక్కుంటూ.

మేనక ఉన్మాదంనించి తేరుకున్నట్టు ఉలిక్కిపడి, నా
వైపు చూసి, "అయ్యామ్ అఫుల్లీ సారీ! తుపాకీ శబ్దం విన
గానే నాకు వళ్ళు తెలీకుండా పోతుంది" అంది.

అది నన్ను జో కొట్టడానికి చెబుతున్న పచ్చి అబద్ధం
అని ఆమె మొహం మీద పేరుకున్న స్వేద బిందువులే
స్పష్టం జేస్తున్నాయి.

"రండి, భోజనం చేసేక అంతా చక్కబడుతుంది"
అంటూ ఆమెను వెంటబెట్టుకుని డైనింగ్ హాల్లోకి
నడిచేను.

భోజనాలయేక మేనక సెలవు తీసుకుని వెళ్ళిపోయింది.

నా గదిలో కెళ్ళి "డేవిడ్ నీ భోజనం కానిచ్చి'
వెచ్చని దుస్తులు తీసుకుని బైట, ఏ చెట్టు చాటునో

కూర్చుని, రాత్రంతా ఈ బంగళా ముందు కాపలా కాయాలి. ముఖ్యంగా మేనక గదిమీద ఓ కన్ను ఉంచి, ఆమె కదలికలు గమనించాలి!" అన్నాను.

డేవిడ్ తలూపేడు.

"దేనికైనా మంచిది, గుళ్ళు నింపిన రివాల్వర్ కూడా ఉంచుకో. కొన్ని స్పేర్ బుల్లెట్స్ కూడా జేబులో వేసుకో వాలి. అవసరం కలిగితే షూట్ జెయ్యడానికి వెనకాడ వద్దు."

"ఓ. కె. సర్!" అన్నాడు డేవిడ్.

గదిలో లైటార్పి పక్కమీద వాలా నేగాని, నా ఆలోచనలన్నీ మేనక చుట్టే భ్రమిస్తున్నాయి.

ఒక దేశపు రాకుమారి, అందాల సుకుమారి, ఒంటరిగా ఎవ్వరి తోడూ, అండా లేకుండా ఈ నిర్జన ప్రదేశంలో దేనికి బసజేసింది? దూరాన అరణ్యంలోంచి వినిపించిన ఆ తుపాకి శబ్దాలేమిటి? అవి వినగానే మేనక బెదిరిన లేడిలా ఎందుకు మారిపోతుంది? ఆ తుపాకి ప్రేలుళ్ళ మధ్య ఏవైనా సీక్రెట్ సిగ్నల్స్ ఉన్నాయా?

ఇలా ఆలోచిస్తూ నాకు తెలీకుండానే నిదరలోకి జారుకున్నాను.

# 3

"సార్! సార్!" అన్న పిలుపుతో కళ్ళు తెరిచాను. డేవిడ్ తలుపు తడుతున్నాడు.

టైం చూసుకున్నాను. ఉదయం ఆరుగంటలు.

లేచి వెళ్ళి తలుపు తెరిచాను.

డేవిడ్ లోనికిరాగానే, తలుపు మూసి, "ఎనీ ఇంపార్టెన్స్?" అడిగేను.

"పెద్దగా చెప్పుకోతగ్గది కాదు. రాత్రంతా, మేనక గదిలో అనేకసార్లు లైటు వెలగటం, ఆరిపోడం జరిగింది. అంతే?" అన్నాడు డేవిడ్.

"ఎన్నిసార్లు అలా జరిగి ఉంటుంది?" అడిగేను ఆలోచిస్తూ.

"ఒక నిర్ణీతసమయం అనేది లేకుండా, రెండు మూడు గంటలకోసారి లైటు వెలిగి, కాసేపటికి తిరిగి ఆరిపోయేది. దీన్నిబట్టి మేనక ఏదో తీవ్రమైన ఆలోచనలతో సమమత మౌతూ, నిదరపట్టక లేచి లైటు వెలిగిస్తోందని ఊహించేను. నాలాగే, ఆమెకూడా జాగారాం జేసిందని వేరే చెప్పనవసరం లేదు" అన్నాడు డేవిడ్.

"ఆల్ రైట్! నువ్వు కాసేపు పడుకో. పది గంటల తరువాత లేపుతాను. రాత్రంతా జాగారం జెయ్యడం వల్ల నీ కళ్ళు పీక్కుపోయేయి." అన్నాను డేవిడ్ భుజం తట్టి.

తలూపి మంచంవైపు నడిచేడు.

తలుపు తెరచి మేనక గదివైపు వెళ్ళేను. ఆ గది తెరచే ఉంది. గదిమధ్య సోఫాలో కూర్చుని, బెడ్ టీ తీసుకుంటోంది మేనక.

"గుడ్ మార్నింగ్ మిస్ మేనకాదేవీ!"అన్నాను తలుపు దగ్గరే నిల్చుని.

ఆమె ఉలిక్కిపడి తలెత్తి, "ఓ వెరీ గుడ్ మార్నింగ్ మిస్టర్ రాజారెడ్డీ! ప్లీజ్. కమిన్!" అంది నవ్వుతూ.

లోనికెళ్ళి సోఫాలో ఆమెకెదురుగా కూర్చున్నాను.

మరో కప్పులో టీ కలిపి ఇస్తూ "పెందరాళే నిదర లేచారే?" అంది.

"నాకు ఐదు గంటలకే నిద్ర మేల్కొంటుంది. పెందరాళే నిదర లేవడం వల్ల వంట్లో కాస్త ఏక్టివిటీ వస్తుంది" అన్నాను కప్పు అందుకుంటూ.

కాఫీ తాగి, కప్పు టీపాయ్‌మీద పెట్టేను.

"మిస్టర్ రెడ్డీ! ఓ మాటడగనా?" అంది మేనక.

"సందేహం దేనికి? అడగండి!" అన్నాను ఏమిటో అనుకుంటూ.

"మీ నౌఖరు రాత్రంతా దేనికి మేల్కొన్నాడు?"

మేనక వేసిన ఈ ప్రశ్నతో, తేలు కుట్టినట్టు ఉలిక్కిపడ్డాను. నా ఖంగారు వ్యక్తం కానివ్వకుండా, వెంటనే ఆమె ప్రశ్నకి జవాబు అల్లి నవ్వేను.

"వాడికో పిచ్చి నమ్మకం ఉంది. అరణ్యప్రాంతాల్లో ఒక నాగుపాము ఉంటుందనీ, దాని పడగమీద ఓ మణి ఉంటుందనీ, అది ఆ మణి వెలుగులో రాత్రులు ఆహారం కోసం తిరుగుతుంటుందనీ, దానికి కనిపించకుండా, పొంచి ఉండి, అదిరాగానే చంపి, ఆ మణిని చేజిక్కించుకోవాలనీ అప్పుడప్పుడూ వాగుతుంటాడు." అన్నాను తడుముకోకుండా.

"కానీ, అతను రాత్రంతా బంగళా ముందున్న ఓ చెట్టు కింద కంబళీ కప్పుకుని కదలకుండా కూర్చున్నాడే?" అంది మేనక ఆశ్చర్యంగా.

"విచిత్రంగా ఉందే? ఇంతకీ చీకట్లో అతన్ని మీరెలా చూడగలిగేరు?"

"నా దగ్గర చీకట్లోనూ చూడగలిగే, ఇన్‌ఫరార్ లెన్స్ బైనాక్యులర్స్ ఉన్నాయి. దాంతో చూస్తే రెండు మైళ్ళదూరాన ఉన్న వస్తువు రెండు గజాల దగ్గర కనిపిస్తుంది!"

"అలాగా! వాడు కదలక మెదలక కూర్చున్నాడంటే ఆ పాముకోసం చూసిచూసి నిదర ముంచుకువచ్చి, నిదర పోయుంటాడు!"

"లేదండీ! అతను రాత్రంతా మేల్కొనే ఉండి, బంగళావైపు చూస్తుండటం నా కళ్ళారా చూసేను." అంది మేనక ఖచ్చితంగా.

"అలాగా! ఉండండి. వాడిప్పుడు పడుకున్నాడు. నిదరలేచేక అడుగుతాను సంగతేమిటో!"

ఐనా, మేనక ముఖంలో తృప్తి పడ్డ సూచనలు కనిపించలేదు.

"మిస్టర్ రాజారెడ్డీ! ఈ రాత్రి మీరు నా గదిలో పడుకుంటారా?"

అన్న ఆమె ప్రశ్న అర్థంకాక, "ఏమన్నారూ?" అన్నాను నివ్వెరబోయి.

"ఐమీన్, మీరీ రాత్రి నా గదిలో గడిపి, మీనౌఖరు నిజంగా మీతో మణి గురించి అలా చెప్పిఉంటే, నామీద విశ్వాసం లేకుంటే, మీరే స్వయంగా చూడండి, రాత్రే నాకు అనుమానం వేసింది. వాడెవడో గూఢచారి అయుంటాడనీ, రాత్రంతా బంగళామీద నిఘావేసి, ఎవ్వరి రాక కోసమో ఎదురు చూస్తున్నాడని."

మేనక సామాన్యురాలు కాదనీ, ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే రకమనీ, ఇకనించీ కాస్త జాగ్రత్తగా మసలుకోవాలనీ దాంతో తెలిసిపోయింది.

"అలాగా! పదండి, ఇప్పుడే వెళ్ళి వాడి విషయం కనుక్కుంటాను," అంటూ లేచి బైటికి నడిచేను.

వెనకే నన్ను అనుసరిస్తూ వచ్చింది.

మా గదిలో మంచంమీద గుర్రు కొడుతున్న డేవిడ్‌ని తట్టి లేపేను.

అతను లేవగానే, కన్నుగీటి, "రాత్రంతా బంగళా ముందు చెట్టుకింద కూర్చుని కాపలా కాసేవుట. నిజమేనా?" అడిగేను తీక్షణంగా.

డేవిడ్‌ది సెన్సిటివ్ మైండ్ కనక వెంటనే గ్రహించి' చాలా శాంతంగా అన్నాడు. "సర్, ఇది అడివి ప్రదేశం కనక, ఈ చుట్టు పక్కల క్రూరమృగాలు విచ్చలవిడిగా తిరుగు తుంటాయి. పైగా, ఈ బంగాళా తలుపులు ఏ కాలానివో తెలీదు. ఒక్క తోపుతో కింద పడేట్టు న్నాయి.

మనిషి వాసన తగిలి, ఏ క్రూరమృగమైనా తలుపు విరగొట్టి లోనికి దూరవచ్చు. మీకు హాని కలిగించవచ్చని రైఫిల్‌తో రాత్రంతా బైట కాపలా కాసేను."

"ఐతే, ఆ మణి గురించి నీవు చెప్పిందంతా అబద్ధమన్న మాట!" అన్నాను కోపం నటిస్తూ.

డేవిడ్ నవ్వి "ఔను సార్! అలా చెప్పకపోతే, మీరు నన్ను రాత్రంతా బైటకాపలా కాయడానికి ఒప్పుకునేవారా?" అన్నాడు.

ఆ మాట వినగానే మేనక కిలకిలనవ్వి "మీ నౌఖరు నమ్మిన బంటులా ఉన్నాడు." అంది.

"కేవలం నౌఖరు అనుకోకండి. ఇతను నా మిత్రుడు కూడా!" అన్నాను.

మేనక తలూపి "నిజమే! ఒక మంచి మిత్రుడే ఇలా చెయ్యగలడు మరి! అదలా వదలండి. ఈ రోజు మీ ప్రోగ్రాం ఏమిటి?" అడిగింది.

"వేరే ఏముంటుంది? వేట. సూర్యుడస్తమించేవరకూ అడవిలో వేటాడాలని నిశ్చయించేను. మీరూ నా వెంట వస్తారా?"

"ష్యూర్! నేను తయారయ్యేలోగా మీరూ రెడీ అవండి" అని తన గదికి వెళ్ళిపోయింది.

డేవిడ్ సమయస్ఫూర్తికి అతని అభినందించి, ప్రయాణానికి అవసరమయ్యే ఏర్పాట్లు జెయ్యమని చెప్పి, కాలకృత్యాలు తీర్చుకోడానికి బాత్‌రూం వైపు నడిచేను.

గంటలోగా నేనూ, డేవిడ్ తయారయ్యాం.

మేనకని పిలవాలని ఆమె గదివైపు వెళ్ళాను. తలుపు మూసివుంది. తట్టబోయి ఆ ప్రయత్నం విరమించుకున్నాను, తలుపు పక్కనే కిటికీ వుంది. మెల్లిగా అటు జరిగేను. అద్దాల కిటికీ అది. లోపలినించి సగంవరకూ కప్పుతోంది కర్టెన్.

జాగ్రత్తగా కిటికీలోంచి గదిలోకి చూసేను.

అంతే! రెప్ప వెయ్యకుండా అలా చూస్తుండిపోయేను.

మేనక మంచంమీద కూర్చుని, పసిపిల్లలా ఏడుస్తోంది. ఆమె చేతిలో కేబినెట్ సైజు ఫోటో! ఆమె చూపులు ఆ ఫోటోమీదే నిలిచివున్నాయి.

ఏడుస్తోంది. పంటితో పెదవిని అదిమిపట్టి, శబ్దం బైటికి రానివ్వకుండా ఏడుస్తోంది.

నా మస్తిష్కంలో కోటి ప్రశ్నలు ఉవ్వెత్తున లేచేయి.

ఆ ఫోటో ఎవ్వరిది? ఆమె దేనికి ఏడుస్తోంది?

ఐదు నిమిషాలు తీవ్రంగా ఆలోచిస్తూ అక్కడే నిల్చున్నాను.

తరువాత తేరుకుని మునివేళ్ళతో మెల్లిగా తలుపు తట్టేను.

"ఎస్!" లోపలినించి వినిపించింది.

"నేను. రాజారెడ్డిని." అన్నాను సామాన్యంగా.

"వెయిట్ ప్లీజ్! నేను తయారవుతున్నాను."

"త్వరగా కానివ్వండి. లేకుంటే ఎండ ఎక్కువై పోతుంది." అన్నాను.

పది నిమిషాల తరవాత తలుపు తెరుచుకుంది. అంత వరకూ ఏడుస్తున్న మేనక కళ్ళలో ఇప్పుడు కన్నీటి ఛాయలు లేవు. నవ్వుతోంది. ఏమీ జరగనట్టు మామూలుగా నవ్వుతోంది.

"కమిన్!" అంది తలుపు కడ్డం తొలిగి.

అప్పుడు చూసేను ఆమె దుస్తులు. వేటకి వాడే పాంటూ, షర్టూ వేసుకుంది. కాళ్ళకి స్పంజి బూట్స్!

"మీరీ దుస్తులు విడిచేస్తే బావుంటుందని నా అభిప్రాయం!" అన్నాను గదిలోకి నడుస్తూ.

"దేనికి?" అడిగింది ఆశ్చర్యంగా.

"ఈ దుస్తుల్లో వున్న మీమీద నా దృష్టి పడితే, గురి తప్పవచ్చు!" అన్నాను నవ్వుతూ.

మేనక నవ్వి, "నన్నూ మీలాగే ఒక మగాడిగా భావిస్తే ఏ ప్రమాదమూ వుండదు." అంది.

"మేనకాదేవీ! మీవంటి సుకుమారిని, మతిపోగొట్టే అందగత్తెని ఒక మగాడిగా ఎలా భావించమంటారు? నేను స్త్రీని స్త్రీగా చూడాలనుకుంటాను."

"అంటే, నన్నీ దుస్తులు విడిచి చీర కట్టుకోమంటారా?"

నవ్వి తలూపేను.

"ఐతే, మీ వెంట వేటకి వచ్చే ప్రోగ్రాం కేన్సిల్ జేసుకుంటాను. మీరే వెళ్ళిరండి!"

"మైగాడ్! అలా ఐతే, నేనూ నా ప్రోగాం కేన్సల్ జేసుకోవలసివస్తుంది మరి!"

మేనక పకపక నవ్వి, "డోంట్ డిసప్పాయింట్ ప్లీజ్! ఈ రోజు పూర్తిగా అరణ్యంలో కెళ్ళకుండా, ఈ చుట్టుపక్కలే పక్షుల్ని వేటాడదాం!" అంది.

భుజాలు ఎగరేసి, "ఆజ్ యువర్ లైక్!" అన్నాను ఆమె కోరిక శిరసావహిస్తున్నట్టు.

నేనక్కడికి వేటకోసం రాలేదుగా!

# 4

పగలంతా వేటలో గడిచిపోయింది.

సాయంత్రం ఐదు గంటలకి తిరిగి బంగళా చేరాం.

స్నానం అదీ కానిచ్చి, భోజనం ముగించేసరికి రాత్రి ఎనిమిదయింది.

మా దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయింది మేనక.

"నిన్న రాత్రంతా నీవు జాగారం చేశావ్! ఈ రాత్రి నేను చేస్తాను. నువ్వు నిశ్చింతగా పడుకో!" అన్నాను డేవిడ్‌తో.

"మీరు బైట కాపలా కాస్తే ఆమె తప్పక చూసి తీరుతుంది."

నవ్వేను. "ఆ సంగతి నాకూ తెలుసు. ఈ రోజు గది లోపలే, కిటికీ దగ్గిర కూర్చుని చూస్తుంటాను, బైనాక్యులర్స్‌తో."

డేవిడ్ తలూపి పక్కమీద వాలేడు.

గది తలుపు గడియపెట్టి, నా సూట్‌కేస్‌లోంచి బైనా

క్యులర్స్ తీసేను. కిటికీ దగ్గర స్టూలు వేసి, గదిలోని లైటార్పి, స్టూలుమీద కూర్చుని సిగరెట్ అంటించేను.

ఈ రాత్రి ఏదో సంఘటన జరిగి తీరుతుందని నా మనసు చెబుతోంది. మేనక దేనికో రాత్రంతా భయపడుతుంది. అందుకే రాత్రి నిదరపోకుండా, మాటిమాటికీ గదిలో లైటు వెలిగించి ఆర్పుతుంది. ఇన్‌ఫరార్ లెన్స్ బైనాక్యులర్స్‌తో దూరదూరం వరకూ పరిశీలిస్తుంది.

ఆమె భయం ఏమిటి ? ఎవ్వరికోసం ఎదురు చూస్తుంది? అరణ్యంలో మారుమోగే ఆ తుపాకి ప్రేలుళ్ళేమిటి ? అవి వినగానే ఇంత చలిలోనూ మేనక ఒంట్లోదేనికి చమటలు పడతాయి? ఉన్మాదిలా తన తుపాకీతో రీఫైరింగ్ దేనికి జేస్తుంది ?

బైనాక్యులర్స్‌తో కిటికీగుండా బైట చీకటిలో పరీక్షగా చూస్తూ కూర్చున్నాను. చుట్టూ భయంకరమైన నిశ్శబ్దం! అరణ్యంలోంచి నక్కల ఊలలూ, మృగాల అరుపులు పక్షుల విచిత్రమైన కూతలూ లీలగా వినిపిస్తున్నాయి.

రాత్రి సరిగ్గా పదిగంటలకి వినిపించింది శబ్దం.

అరణ్యంలో మూడుసార్లు పేలిన రైఫిల్ శబ్దం.

అరణ్యం ఆర్తనాదం జేస్తోందా అనిపించింది క్షణం పాటు.

రెండు నిమిషాల తరవాత తిరిగి అదే నిశ్శబ్దం చోటు జేసుకుంది. బైనాక్యులర్స్‌లోంచి పరీక్షగా చూస్తూకూర్చున్నాను, నా గుండెజేసే చప్పుడు నాకే స్పష్టంగా వినిపిస్తోంది.

మరో ఐదు నిమిషాలు గడిచి ఉంటాయి.

కీచుమనే శబ్దంతో నా చెవులు నిక్క బొడుచుకున్నాయి.

అది తలుపు తెరిచిన శబ్దం!

మేనక తన గదిలోంచి పిల్లిలా వరండాలోకి వచ్చింది. రెప్ప వెయ్యకుండా ఆమెనే చూస్తున్నాను. రెండు నిమిషాలు అటూఇటూ చూస్తూ నిల్చుంది, తన నెవ్వరైనా గమనిస్తూన్నారేమోనని.

తరవాత సవ్వడి కాని అడుగులతో వరండా మెట్లుదిగి, కాంపౌండులో అడుగుపెట్టింది. అప్పుడు గమనించేను. ఆమె చేతిలో రైఫల్, మెడలో వేళ్ళాడుతున్న బైనాక్యులర్స్‌ని.

ఆ తుపాకి పేలుళ్ళకి తన రైఫల్‌తో జవాబిస్తుందేమోనని చూడసాగేను.

నా అంచనా తప్పింది. మేనక, బైనాక్యులర్స్‌ని కళ్ళ దగ్గర పెట్టుకుని చీకటిలో చుట్టూ పరీక్షగా చూస్తోంది. నిమిషం తరవాత ఆమె దృష్టి అరణ్యంలో ఓ చోట నిలిచింది.

తనలో తాను సాలోచనగా తలూపి. వెనుదిరిగి మా గదివైపు చూడసాగింది. ఎవ్వరూ గమనించడం లేదనుకుంది కాబోలు, కాంపౌండ్ గేటువైపు నడవసాగింది.

శబ్దం కానివ్వకుండా గేటు తెరిచి అవతలికెళ్ళి, తిరిగి గేటు మూసింది.

ఒళ్ళు గగుర్పొడిచే ఆ వాతావరణంలో, ఆ కారు చీకటిలో ఆ సుకుమారి నడిచి పోతుంటే, నాకే చెప్పలేని భయం వేసింది.

చటుక్కున స్టూల్ మించి లేచి, తలుపుని సమీపించేను. క్షణం వృధా చెయ్యకుండా తలుపు తెరిచి బైటికెళ్ళేను.

లోపల డేవిడ్ ఒంటరిగా నిదరబోతున్నాడు. అందుకే తలుపుకివతల గడియపెట్టి వరండా మెట్లు దిగేను. గబగబ గేటు సమీపించి, అవతలికెళ్ళి తిరిగి యథాప్రకారం మూసేశాను. తెలియని ఎక్సైట్ మెంట్ తో నా రక్తం వేగంగా ఉరకలు వేస్తోంది.

బైనాక్యులర్స్ తో మేనక వెళ్ళిన వైపు చూశేను.

కనిపించింది.

వెనుదిరిగి చూడకుండా, వడివడిగా ముందుకు సాగుతోంది.

చాలా జాగ్రత్తగా వెంబడించాలి. ఆమెకే మాత్రం అనుమానం వేసినా, రహస్యం ఏమిటో తెలుసుకోడం దుర్లభం! కాళ్ళకింద ఎండుపుల్ల విరిగిన శబ్దంకూడా కానివ్వకుండా జాగ్రత్త పడుతూ ముందుకి కదిలేను.

రోమాలు నిక్కబొడుచుకునే ఆ పరిసరాల్లో నిర్భయంగా ముందుకుపోతున్న మేనకని మనసులోనే అభినందించకుండా ఉండలేకపోయేను.

గంటన్నర అలా నడిచేమనుకుంటాను.

దూరాన, మిణుకు మనే కాంతి కనిపించేసరికి, బైనాక్యులర్స్ లోంచి పరీక్షగా చూశేను.

అది కాటేజ్! అరణ్యం మధ్య ఒంటరిగా ఉన్న కాటేజ్!

మేనక అటే వెళుతోంది.

సాలోచనగా తలూపేను. మిస్టరీ అంతా ఆ కాటేజ్ లోనే దాగి ఉందన్నమాట.

ఐదు నిమిషాలలో సిగరేట్ కాల్చేవాణ్ని. గంటన్నరైనా సిగరెట్ చవిమూశ్ళేదు. కారణం, లైటర్ వెలుగుకి

మేనక ఎక్కడ వెనుదిరిగి చూస్తుందో అని.

సిగరెట్ తాగాలని జిహ్వ జివజివ లాడుతోంది. అతి కష్టంమీద ఓర్చుకుంటూ ముందుకు సాగుతున్నాను.

ఇద్దరం దాదాపు ఆ కాటేజ్‌కి చేరువయ్యాం.

ఓ చెట్టు చాటున ఆగిపోయేను.

మేనక అటూ ఇటూ చూడకుండా కాటేజ్‌ని సమీపించింది. కాటేజ్ ద్వారం దగ్గిర ఇద్దరు కాపలావాళ్ళు గన్స్ పట్టుకు నిల్చున్నట్టు లీలగా కనిపిస్తోంది.

మేనక కాటేజ్‌ని సమీపించగానే ఒకడు ఆమె చేతిలోని రైఫల్ లాక్కున్నాడు. మరుక్షణం కాటేజ్ తలుపు తెరుచుకుంది. ఆమె లోనికెళ్ళగానే తలుపు మూసుకుంది.

లోపల ఏంజరుగుతుందో చూడాలన్న క్యూరియాసిటీతో నా గుండె దడదడ కొట్టుకోసాగింది. చెట్లచాటున పొదలచాటునా నక్కుతూ సాధ్యమైనంత వరకూ అలికిడి కానివ్వకుండా జాగ్రత్తపడుతూ, కాటేజ్ వెనక్కి జేరుకున్నాను.

అక్కడ అద్దాల కిటికి ఉంది. కిటికీగుండా లోపల వెలుగుతున్న లాంతర్ కాంతి సన్నగా ఇవతలికి పడుతోంది.

కిటికీని సమీపించి, చీకట్లో ఒదిగి, లోనికి చూసేను.

గది మధ్య మేనక నిల్చునుంది. ఆమె కెదురుగా మిలిటరీ యూనిఫాంలో ఉన్న చైనీస్ ఆఫీసర్! అతని చేతిలో పిస్తోలు!

"మేజర్ చ్యాంగ్‌లూ! ఫైరింగ్ జేసినన్నెందుకు పిలిపించేరు? మరో రెండు రోజులు పోయేక, నా నిర్ణయం

తెలియజేస్తానన్నాగా?" అంటోంది మేనక అతన్ని తీక్షణంగా చూస్తూ.

చ్యాంగ్ లూ నవ్వి "గడువు పూర్తి కాకముందే పిలిపించవలసి వచ్చింది రాకుమారీ!" అన్నాడు.

"అదే, ఎందుకూ అని అడుగుతున్నాను!"

"ఆ డాక్ బంగళాలో నీతోబాటు బస జేస్తున్నది ఎవ్వరూ?" అడిగేడు చ్యాంగ్ లూ.

మేనక కనుబొమలు ముడివడ్డాయి. "మన సమస్యకీ, వారికీ ఏమిటి సంబంధం?"

"ఉంది! అందుకే అడుగుతున్నాను. ఎవ్వరువాళ్ళు?"

"నిన్న సాయంత్రం వచ్చేరు. ఎవ్వరో రాజారెడ్డిట. పారిశ్రామిక వేత్తలు. వేటకోసం వచ్చేడుట, అతని వెంట ఓ నౌఖరు ఉన్నాడు. అతనిపేరు డేవిడ్! ఇంతకంటే, వాళ్ళగురించి నాకు తెలీదు?"

"అది తెలీజెయ్యడానికే పిలిపించాం. వాళ్ళెవరనుకున్నావ్? భారతగూఢచారులు. అర్థమైందా?"

మేనక ఆశ్చర్యంతో నోరు తెరచింది.

"మనమధ్య సాగుతున్న వ్యవహారాన్ని భారత ప్రభుత్వం ఎలా పసిగట్టిందో పసిగట్టింది.మా ఎత్తుల్ని చిత్తుజెయ్యడానికి వాళ్ళని పంపించింది. చెవులు రిక్కించుకు విను.

నీ తండ్రిని ప్రాణాలతో తిరిగి చూడాలనుకుంటే, రెండే రెండు రోజులు. ఆ రెండు రోజుల్లో నీ నిర్ణయం తెలీజెయ్యాలి. ఏ చిన్న పొరబాటు జరిగినా, తరవాత చింతించి ప్రయోజనం ఉండదు?" అన్నాడు చ్యాంగ్ లూ కఠినంగా.

మేనక నిర్జీవంగా తలూపింది.

"వాళ్ళు ప్రాణాలతో ఉండడం చాలా ప్రమాదం. ఈ రాత్రి మూడు గంటలకి వాళ్ళిద్దర్నీ ఆ బంగళాలోనే నిశ్శబ్దంగా చంపివెయ్యాలని నిశ్చయించేను."

మేనక కళ్ళల్లో భయం.

"ఇక నీవు వెళ్ళవచ్చు!" అన్నాడు చ్యాంగ్ లూ ఆజ్ఞాపిస్తున్నట్టు.

మేనక ఏదో అడగడానికి తటపటాయిస్తూ అక్కడే నిల్చుంది.

"ఏమిటి?" అడిగేడు.

"డాడీని ఓసారి చూడాలనుంది?" అంది మేనక అతి కష్టంమీద.

చ్యాంగ్ లూ నవ్వి "ఇప్పుడు కాదు. రెండు రోజుల తరవాత ఆయన్ని సజీవంగా చూస్తావో, శవరూపంలో చూస్తావో నీనిర్ణయంమీద ఆధారపడుంటుంది. యూ కెన్ గో నౌ!" అన్నాడు తలుపు చూపిస్తూ.

మేనక విధిలేనట్టు వెనుదిరిగింది. తలుపుగుండా బైటికి నడిచింది.

కిటికీ దగ్గర్నించి కదిలేను. ఒదిగి ఒదిగి నడుస్తూ కాటేజ్ ముందు భాగంవైపు వెళ్ళేను. అప్పటికే మేనక కాటేజ్ లోంచి ఇవతలకి వచ్చింది. ఆమె చేతిలో ఇప్పుడు రైఫిల్ ఉంది!

ఆమె వెనకే నేనూ నడక సాగించేను.

ఇంతవరకూ తేలు కొండీలలా నా మస్తిష్కంలో కద లాడే అసంఖ్యాకమైన ప్రశ్నలకి కొన్ని జవాబులు దొరికేయి.

అరణ్యంలో మారుమోగే తుపాకీ ప్రేలుళ్ళకి కారణం,

మేనక ఈ నిశీధిరాత్రిలో ఒంటరిగా ఇంతదూరం రావడం తలుపు మూసుకుని తన గదిలో ఫోటో చూస్తూ ఏడవడం, ఇవన్నీ ఏమిటో తెలిసిపోయేయి. ఇంకా కొన్ని ప్రశ్నలకి జవాబులు దొరికితే, ఈ మిస్టరీ ఏమిటో పూర్తిగా బోధ పడుతుంది.

ఆ చైనీయులు మేనక తండ్రిని, అంటే రత్నాగఢ్ రాజా మణిపాల్ ని కిడ్నాప్ జేసి అరణ్యం మధ్యఉన్న ఆ కాటేజ్ లో బంధించేరన్నమాట. అతని ఏకైక సంతాన మైన, అతని తరవాత రత్నాగఢ్ రాజ్యానికి రాణి కాబోయే మేనకాదేవికి, కొద్ది రోజుల వ్యవధి ఇచ్చి తాము కోరేది ఇస్తావో కన్నతండ్రిని చంపుకుంటావో తేల్చు కోమని బ్లాక్ మెయిల్ జేస్తున్నారు.

వాళ్ళు కోరేదేమిటి? అదేమాకు తెలియాలి. తెలుసుకు తీరాలి!

మేనకకి తండ్రిమీద అపారమైన ప్రేమ ఉందని ధార లుగా కారే ఆమె కన్నీళ్ళే సాక్ష్యం! తండ్రి కోసం ఆమె ఆ చైనీయుల షరతులకి ఒప్పుకోదు కదా? దాంతో భారత దేశానికి ఏదైనా విపత్తు వాటిల్లదు కదా?

ఇలాటి ఆలోచనలతో డాక్ బంగళాని సమీ పించేను.

మేనక గేటు తెరచి లోనికెళ్ళి, నాలుగువైపులూ జాగ్ర త్తగా చూసుకుంటూ తన గదివైపు వెళ్ళింది. తలుపు తెరచి లోనికెళ్ళింది.

ఆమె గది తలుపు మూసుకున్న పది నిమిషాల వరకూ అక్కడే నిల్చుని, మెల్లిగా గేటు తెరచి లోనికెళ్ళేను. నిశ్శబ్దంగా నడుస్తూ నాగది జేరుకుని, ఇవతలినించి గడియ లాగి లోనికి దూరి తలుపు మూసేను.

# 5

చీకట్లో డేవిడ్ గురక వినిపిస్తోంది.

లైటర్ వెలిగించి చూసేను. మంచంమీద వెల్లకిలా పడుకుని గుర్రుకొడుతున్నాడు. తట్టిలేపేను. ఎంతటి గాఢ నిదరలో ఉన్నా, చిన్న కుదుపుతో లేచి కూర్చుంటాడు డేవిడ్.

నన్ను చూడగానే, "ఎనీ హేపెండ్ సర్?" అన్నాడు ఆతృతగా.

తలూపి, అంతవరకూ జరిగిందంతా అతనికి వివరించేను.

రిస్టువాచీ చూసుకుని, ఇప్పుడు రెండు గంటలకి ఇంకా నాలుగు నిమిషాలున్నాయి. మరో గంటలో మనల్ని చంప డానికి మేజర్ చ్యాంగ్ లూ మనుషులురావచ్చు. జాగ్రత్త" అన్నాను.

డేవిడ్ నవ్వి "మన దగ్గర రెండు స్టెయిన్ గన్స్. హేండ్ గ్రెనేడ్స్ ఉన్నాయి. మీరు నిశ్చింతగా ఉండండి," అన్నాడు.

"స్టెయిన్ గన్స్, గ్రెనేడ్స్ మన దగ్గర ఉంచుకోడం మంచిదే. కానీ, వాటి అవసరం కలక్కపోవచ్చు." అంటూ నా సూట్ కేస్ తెరిచేను.

బట్టలకింద దాచిన చిన్న ప్లాస్టిక్ పెట్టితీసేను. అందులో రెండు సిరెంజ్ లూ, కొన్ని స్నేక్ పాయిజన్ ఇంజక్షన్లూ ఉన్నాయి. సిరంజిలకి సూదులు బిగించి, ఫైల్ తో ఇంజ క్షన్ సీసాల మూతల కట్ జేసి, రెండు సిరంజ్ లలో వాటిని ఎక్కించాను.

ఈలోగా డేవిడ్ తోలుసంచి తెరిచి, రెండు స్టెయిన్ గన్స్, రెండు హేండ్ గ్రెనేడ్స్ తీసి, మేగజన్స్ లో

బుల్లెట్స్ నింపి, గన్స్‌కి ఫిట్ జేసేడు.

ఆతనికి ఓ సిరంజ్ ఇస్తూ "స్టెయిన్ గన్స్ భుజాన తగిలించుకుని, గ్రనేడ్స్ జేబుల్లో వేసుకుని, కుడిచేతిలో ఈ సిరెంజ్ రెడీగా పట్టుకో. ఇందులో పాము విషంతో తయారు జేసిన లిక్విడ్ ఉంది. మనల్ని చంపడానికి ఎవ్వరైతే వస్తారో, వెనకనించి వాళ్ళమీద మెరుపు దాడిజేసి, కాలి పిక్కల్లో ఈ ఇంజక్షన్స్ గుచ్చాలి. తక్షణం నీలి రంగుకి మారతాయి. శవాలని ఈడ్చి పొదల్లో పడెయ్యాలి.

ఎంతకీ వాళ్ళు తిరిగి రాకపోయేసరికి, వారిని వెదుక్కుంటూ ఎవ్వరో ఒకరు వస్తారు. నీలి రంగులో ఉన్న ఆ శవాలని చూడగానే, పాముకరిచి ఉంటాయని భావిస్తారు. మనక్కావలసింది అదే!" అన్నాను సిరెంజి డేవిడ్ చేతికిస్తూ.

సరిగ్గా అదే క్షణంలో తలుపు తట్టిన శబ్దం కావడంతో చటుక్కున లైటర్ ఆర్పేశాను.

గదిలో చిమ్మ చీకటి!

మళ్ళీ తలుపు తట్టిన శబ్దం.

"వాళ్ళేనా?" అడిగేడు డేవిడ్ మెల్లిగా.

"కాదు, వాళ్ళేఉంటే, ఇలా బాహాటంగా తలుపు తట్టరు. నీవు సడీ పొజిషన్‌లో ఉండు. నేవెళ్ళి చూస్తాను" అంటూ తలుపువైపు అడుగువేశాను.

"దేనికైనా మంచిది. స్టెయిన్‌గన్ తయారుగా పట్టుకోండి." అన్నాడు డేవిడ్.

సేఫ్టీ కాచ్ లాగి, చేంజ్ లివర్ని బ్రస్ట్‌ఫైర్ అయేలా 'బి'

మీదికి జరిపి, ట్రిగ్గర్ మీద వేలుఉంచి తలుపుని సమీపించేను.

నిశ్శబ్దంగా గడియతీసి కొద్దిగా తలుపు తెరిచేను.

మేనక !

చీకట్లో వరండాలో నిల్చునుంది.

తలుపు పూర్తిగా తెరిచి "మీరా!" అన్నాను.

మేనక లోనికివచ్చి "ఔను!" అంటూ చటుక్కున తలుపు మూసేసింది.

ఆమె ఇలా వస్తుందని నేను ఊహించలేదు.

"మిస్టర్ రాజారెడ్డీ! మీతో ముఖ్యవిషయం చెప్పాలి. ప్లీజ్. త్వరగా నా గదిలోకి పదండి. తలుపు గుండా కాదు. ఆ కిటికీలోంచి అవతలికి దూకి, నా గదికిటికీ తెరచి ఉంచేను. దాని గుండా నా గదిలోకి వెళ్ళండి. క్విక్!" అంది.

"ఇంతకీ, విషయమేమిటో కాస్త విపులంగా చెప్పండీ!" అన్నాను కుతూహలం ఆపుకోలేక.

"చెప్పేదేదో నా గదిలోనే చెబుతాను. ఆలస్యంజేస్తే మీకే ప్రమాదం. ప్లీజ్, త్వరగా పదండి."

దాంతో, ఆమె ఏం చెప్పదలచుకుందో చూచాయగా ఊహించేను.

డేవిడ్‌ని పదమన్నట్టు సైగజేసి, కిటికీవైపు నడిచేను.

ముగ్గురం కిటికీగుండా అవతలికి దూకి, పక్కగదిలో జేరాం.

ఆ గదిలోనూ చీకటి!

"లైటు వెలిగిస్తే ప్రమాదం. అవతలి వాళ్ళకి తెలిసిపోతుంది, మన ఉనికి!" అంటూ మంచం మీది బైనాక్యు

లర్స్ అందుకుని కిటికీ దగ్గరికి పరిగెత్తింది మేనక.

బైనాక్యులర్స్‌తో కిటికీగుండా చుట్టూ కలయజూసి, తృప్తిపడి మమ్మల్ని సమీపించింది.

"మిస్టర్ రెడ్డీ! ఈ రాత్రి మూడు గంటలకి మిమ్మల్ని చంపబోతున్నారు."

"ఎవ్వరు?" అడిగేను ఏమీ తెలీనట్టు.

"చెబుతాను. ముందు నా ప్రశ్నకి సూటిగా జవాబివ్వండి. మీరు భారత గూఢచారులు కదూ?"

ఇక దాచి లాభంలేదు. జేబులోంచి సిగరెట్ తీసి అంటించేను.

"చెప్పండి. మీరు భారత గూఢచారులు కదూ?" అడిగింది మేనక మళ్ళీ.

తాపీగా సిగరెట్ దమ్ములాగి, "ఔను" అన్నాను.

"థాంక్ గాడ్!" అని నిట్టూరిచ్చింది మేనక. "మీపట్ల ఎంతో విశ్వాసం ఉంటేతప్ప, భారతప్రభుత్వం మిమ్మల్ని ఇక్కడికి పంపి ఉండదు. దీన్నిబట్టి నేనూ మీ పట్ల విశ్వాసం ఏర్పచుకుంటున్నాను.

నేనూ, నా తండ్రీ, నా చిన్నదేశమూ ఒక విపత్తులో ఇరుక్కున్నాం. మమ్మల్ని ఈ సుడిగుండంనించి ముక్తి కలిగించగలరా?" మేనక స్వరంలో వేడుకోలు.

"రాకుమారీ! ముందు విషయాలన్నీ విపులంగానూ, స్పష్టంగా మాకు చెప్పండి. మా ప్రాణాలని పణంగా పెట్టి మిమ్మల్ని ఆదుకుంటాం!" అన్నాను ఆమెలో ధైర్యం నింపుతూ.

మేనక రుద్ధ కంఠంతో చెప్పసాగింది: "సిక్కిమ్ ప్రభుత్వమూ, ప్రజలు ఎవ్వరి బలప్రయోగం లేకుండా, తమకు

తామే నిర్ణయం తీసుకుని భారతదేశంలో విలీనమయ్యేరు. అలాగే, మేమూ మా ప్రభుత్వమూ భారతభూమిలో కలిసి పోడానికి నిశ్చయించాం.

దాంతో చైనా ప్రభుత్వానికి కన్ను కుట్టింది. మేమూ వాళ్ళ దేశంలో కలిసిపోతే, రత్నాగఢ్ ప్రజలు సుఖశాంతులతో జీవించే ఏర్పాట్లు జెయ్యగలమనీ, మాకూ మా బంధువులకూ ఉన్నత పదవులిచ్చి సత్కరించగలమనీ సందేశాలు పంపేరు. మే మా సందేశాన్ని వెంటనే త్రోసి పుచ్చాం.

త్యాగనిరతికీ, శాంతి జీవనానికీ ఔదార్యానికి ప్రతీకగా, ప్రపంచ దేశాలన్నిటిలోనూ తలమానికంగా, వెలుగొందుతున్న భారతదేశంలోనే విలీనం కావాలని మా ప్రజలూ తమ అభిప్రాయం వ్యక్తం జేసేరు.

ఈ విషయంలో భారతప్రభుత్వంతో సంప్రదింపులు జరుగుతున్నాయి. దాంతో, టిబెట్ లాగే, మా రాజ్యాన్ని బలప్రయోగం ద్వారా దౌర్జన్యంగా కబళించడానికి ఎత్తు వేసింది చైనా.

మేజర్ చ్యాంగ్ లూ నాయకత్వాన, పటిష్టమైన పథకం వేసి మా నాన్నని అపహరించడం జరిగింది.

ఆయన్ని సజీవంగా తిరిగి పొందాలనుకుంటే, వేట నెపంతో మా పేలెస్ వదలి ఈ బంగళాలో మకాం జెయ్యమనీ, అరణ్యంలోంచి మూడు సార్లు రైఫిల్ ఫైరింగ్ వినిపించగానే అరణ్యంలో తూర్పు దిశగా ముక్కుకి సూటిగా ప్రయాణం జెయ్యాలనీ, ఓ కాటేజ్ కనిపిస్తుందనీ, అక్కడే నాతో సంప్రదింపులు జరుపబడతాయనీ, ఈ విషయం ఏమాత్రం ఇతర్లకి తెలిసినా, డాడీని

క్రూరంగా చంపేస్తామనీ సందేశం పంపారు.

వాళ్ళు చెప్పినట్టే ఇక్కడ బసజేశాను. అరణ్యంలోంచి ఆ ఫైరింగ్ వినిపించగానే తూర్పుదిక్కుగా నడిచి వెళ్ళేను కాటేజ్ కనిపించింది. అక్కడే మేజర్ చ్యాంగ్ లూ నాతో సంప్రదింపులు జరిపేడు."

"ఏమని?" అడిగేను ఆతృతగా.

"మా రాజ్యానికి పడమటి దిశగా ఓ కొండ వుంది. దాని మీద మా తాత ముత్తాతలు కట్టిన ఓ శిథిలమైన కోట ఉంది. చైనా సరిహద్దులనించి ఆ కోటవరకూ నేలలో పెద్ద సొరంగం తవ్వేరుట. ఇలా కోటలో ఎక్కడో ఓచోట ఆ సొరంగం ద్వారం తెరవడమే మిగిలిందిట.

మా నాన్నని ప్రాణాలతో దక్కించుకోవాలనుకుంటే రత్నాగఢ్ రాకుమారిగా, మా రాజ్యం చైనాలో విలీనం కావడానికి నిశ్చయించినట్టు ప్రకటించమనీ, ఆపదలో ఆదుకోడానికి, మా కోరికపై మా దేశంలోవున్న భారత సైన్యాన్ని వెళ్ళిపోవలసిందిగా ఆదేశించమనీ.

ఒకవేళ భారతప్రభుత్వానికి అనుమానం వేసి, సైనికంగా ఈ విషయంలో జోక్యం కలుగజేసుకోడానికి ప్రయత్నిస్తే తాము తవ్వించిన ఆ సొరంగం ద్వారా తమ సైన్యాన్ని పంపి, భారత సేనమీద మెరుపు దాడిజేసి తుడిచి పెడతామనీ చెప్పేడు.

నన్ను తీవ్రంగా ఆలోచించి ఓ నిర్ణయానికి రావడానికి కొద్ది రోజులు వ్యవధి ఇవ్వమని కోరేను. ఇచ్చిన ఐదు రోజుల వ్యవధిలో ఒక రోజు గడిచిపోయింది గనక, ఇహ నాలుగు రోజుల్లో నా నిర్ణయం తెలుపవలసి ఉంటుందనీ చెప్పేడు.

తిరిగి వచ్చేను. ఆనాటి నించీ రాత్రింబవళ్ళూ నేను పడుతున్న బాధ ఏ పగవాడూ పడకూడదు. ఇంతలో మీరు వచ్చేరు. మీరు గూఢచారులని చ్యాంగ్ లూకి ఎలా తెలిసిందో తెలిసిపోయింది. మిమ్మల్ని చంపెయ్యడానికి నిశ్చయించేడు.

మీరు భారత గూఢచారులని తెలియగానే, అంధకారంలో ఏకాకిగా కుమిలిపోతున్న నాకు ఏదో ఆశాకిరణం కనిపించినట్టు తోచింది. మిమ్మల్ని ఆ రాక్షసుల బారినించి కాపాడి, మీ సహకారంతో మా సమస్యని తీర్చుకోవాలని నిశ్చయించేను'' అంది మేనక ఏడుస్తూ.

నేనామెని ఓదార్చలేదు.

కాసేపటికి మేనక తిరిగి మామూలు స్థితికి వచ్చింది.

''ఆ సొరంగ ద్వారం, కోటలో ఎక్కడ తెరుచుకుంటుందో మీకు తెలుసా?'' అడిగేను.

''తెలీదు!''

పెదవి విరిచేను. ''అదే తెలిస్తే వాళ్ళ మిషన్ని పునాదులతో సహా స్మాష్ జెయ్యడానికి వీలవుతుంది. సరే! మీ పేలెస్‌లో మీ దగ్గరి బంధువు లెవ్వరూ ఉండరా?''

''దగ్గరి బంధువులు చాలామందే ఉన్నారు. కాని, మా పేలెస్‌లో ఉండరు. వారికి స్వంత భవనాలున్నాయి మాతోబాటు పేలెస్‌లో ఉండేది మా చిన్నాన్న కొడుకు రణ్‌జిత్ ఒక్కడే! రెండేళ్ళ క్రితం లండన్‌లో చదువు పూర్తిజేసి, ఒకరకం పిచ్చివాడిగా మారి తిరిగివచ్చేడు.''

''ఇక్కడికి వచ్చి బాగుపడ్డాడా?''

''నో. నో. ఇక్కడికి వచ్చేక పిచ్చి ఇంకాస్త ఎక్కువే అయింది. నాన్న అతనికి వేరే భవనం కట్టించి అందులో

ఉంచేరు, రణ్‌జిత్ ఆ భవనం విడిచి బైటికి రాడు. బైటికి రాకూడదని నాన్నగారి ఆజ్ఞ."

సాలోచనగా తలూపుతూ రిస్టువాచీ చూసుకున్నాను. రెండున్నర!

"ఆల్ రైట్ మిస్ మేనకా దేవి! మా దేశంపట్ల మీకున్న అభిమానానికీ, మీరు తీసుకున్న ఈ నిర్ణయానికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు తెల్పుకుంటున్నాను. ఇక సమయం ఆసన్నమైంది. మీరు గాఢ నిదరలో ఉన్నట్టు నటిస్తూ మంచంమీద పడుకోండి. మిగిల్న విష యాలు మేము చూసుకుంటాం. డేవిడ్! కమాన్" అంటూ కిటికీ వైపు నడిచేను.

కిటికి గుండా ఇద్దరం అవతలికి దూకాం.

కాంపౌండ్‌లోనే ఒకమూల ఇటు మాగది కిటికీ, అటు తలుపు కనిపించేలా, చెట్టుచాటున నక్కి నిల్చున్నాం. ముందే కారుచీకటి. ఆ చెట్టు వెనక, మా ఉనికి మరో ప్రాణి పసిగట్టే ఆస్కారం లేదు.

సరిగ్గా మూడుగంటల ఐదునిమిషాలకి కాంపౌండ్ గేటు కిర్రుమంటూ తెరుచుకుంది. నా గుండె గతి వేగం అందు కుంది. గేటువైపు చూసేను. రెండు ఆకారాలువస్తున్నాయి. పొట్టి ఆకారాలు.

అంటే, చైనీస్ సోల్జర్స్ అన్నమాట! ఇద్దరూ వెనకా ముందూ ఆలోచించకుండా బంగళా వెనుక భాగంవైపు వస్తున్నారు.

డేవిడ్‌ని సడీ అవమన్నట్టు మోచేతో పొడిచేను.

ఇద్దరూ మమ్మల్ని దాటి, కిటికీ వైపు నడుస్తున్నారు.

చెట్టుచాటునించి కదిలేము.

వాళ్ళు మా గది కిటికీని సమీపించడం, మేము చిరుతల్లా వాళ్ళమీదికి లంఘించడం ఒకేసారి జరిగాయి. ఊహించని ఆ మెరుపు దాడికి వాళ్ళ మతులు పోయేయి. వెనకనించి మా ఎడం చేతులు వాళ్ళ మెడచుట్టూ వేసి, కాలిపిక్కల్లో ఇంజక్షన్స్ పొడిచాం!

రెండు నిమిషాల్లో ఇద్దరూ కాళ్ళూ, చేతులూ వేళాడేశారు. పట్టు వదలగానే మొదలు నరికిన చెట్లలా కింద కూలేరు. భుజాలు పట్టి ఈడ్చి పొదల దగ్గర పడేశాం.

అంత చలిలోనూ మా శరీరాలు చమటతో తడిసిపోయేయి. తిరిగి కిటికీగుండా మేనక గదిలో దూకాం. చప్పుడు విని లేచింది. "మేనకా దేవీ! మేము సురక్షితంగా ఉన్నాం" అంటూ ఆమెను సమీపించేను.

"థాంక్ గాడ్!" అంది ఆనందంగా.

"మనం వెంటనే ఇక్కణ్ణించి బైలుదేరి థోనితాల్ వెళ్ళాలి" అన్నాను.

"దేనికి?"

"ఓ పథకం ఆల్లేను. అది అమలు జరపటానికి."

"సరే!" అంది.

"మన సామానంతా పేక్ జేసి సిద్ధం జెయ్" అన్నాను డేవిడ్ తో.

"నా సామానుకూడా సర్దుకోనా?" అడిగింది మేనక.

"నో! మీ సామాను యథాతథంగా ఇక్కడే ఉండనివ్వండి" అన్నాను.

మేనక ఎదురు ప్రశ్న వెయ్యలేదు.

సరిగ్గా నాల్గంటలకి, మా కార్లో ముగ్గురం బైలుదేరాం.

# 6

ఉదయం ఆరుగంటలకి ఫోనితాల్లో మేము దిగిన హోటల్ జేరుకున్నాం. ఢిల్లీనించి హెలికాప్టర్ తీసుకు వచ్చిన పైలెట్ కూడా, షీలా, సంఘమిత్రలతో బాటు అదే గదిలో ఉన్నాడు.

అతని పేరు విశ్వనాథన్.

స్నానం అదీ జేసి రిలాక్స్ అయ్యేక, అందరం కూర్చుని టిఫిన్ కానిచ్చి చర్చల్లోకి దిగాం.

ప్లాస్టిక్ సర్జరీ నిపుణున్ని చూస్తూ అన్నాను. "మిస్టర్ సంఘమిత్రా ప్లాస్టిక్ సర్జరీలో నైపుణ్యం చూపే సమయం వచ్చింది. రాకుమారి మేనకా దేవిని షీలగా, షీలని మేనకగా మార్చివెయ్యాలి."

"ఎందుకూ?" అడిగింది మేనక ఆశ్చర్యంగా.

"షీల మీ రూపంలో తిరిగి డాక్ బంగ్లా వెళుతుంది. రాత్రి తొమ్మిదీ పదిగంటల మధ్య మీరు రావలిసిందిగా, అరణ్యంలోంచి సిగ్నల్స్ వినిపిస్తాయి. షీల ఆ కాటేజ్ జేరుకుని, చ్యాంగ్ లూను కలుసుకుంటుంది.

ఆ కోటలో వాళ్ళు తవ్విన సొరంగ ద్వారం తెరవడానికి అనుమతిస్తున్నాననీ, వారి షరతులన్నిటినీ అంగీకరిస్తున్నాననీ ప్రకటిస్తుంది."

"అంటే, రాత్రి డాడీ వాళ్ళ చెరనించి విడుదలవుతాడన్నమాట." అంది మేనక ఉత్సాహంగా.

"చెప్పలేను. వాళ్ళు షీలని తిరిగి మీ రాజధానికి వెళ్ళిపొమ్మని చెప్పవచ్చు. తమ లక్ష్యం పూర్తయ్యేక మీ నాన్నని విడుదల జేస్తామనవచ్చు. లేదా, ఇంకేదైనా చెప్పవచ్చు. ఖచ్చితంగా చెప్పలేను."

సంఘమిత్ర సర్జరీ మెటీరియల్స్ ఉన్న లెదర్ బ్యాగ్

అందుకని, "మీరిద్దరూ నాతో ఆ పక్క గదిలోకి రండి!" అన్నాడు.

షీలా, మేనకా అతని వెనక పక్క గదిలోకి వెళ్ళేరు.

తలుపు మూసుకుంది.

పైలెట్ వైపు తిరిగేను. "మిస్టర్ విశ్వనాథన్! ఈ రాత్రి మనం ప్రయాణం కావలసివుంది. హెలికాప్టర్ని రెడీ పొజిషన్లో ఉంచాలి!" అన్నాను.

అతను తలూపేడు.

రెండు గంటల తరవాత గది తలుపు తెరుచుకుంది. వెళ్ళిన వాళ్ళు వెళ్ళినట్టే తిరిగి వచ్చారేమిటూ? అని క్షణం పాటు నివ్వెరబోయేను.

సంఘమిత్ర నవ్వి—"డియర్ రెడ్డీ! నాపని ముగిసింది" అన్నాడు.

"ఏమిటలా రెప్పవెయ్యకుండా చూస్తున్నారు?" అంది మేనక.

"పోల్చుకోలేక పోతున్నారా?" అంది షీల.

అది మేనక కంఠం!

వాళ్ళలా మాట్లాడకుంటే, ప్లాస్టిక్ సర్జరీ ముగిసిందని నేను ఊహించగలిగేవాణ్ణి కాదు. ఆ కంఠాలని బట్టి, మేనక వేషంలో ఉన్నది షీల అనీ, షీల వేషంలో ఉన్నది మేనక అనీ తెలిసింది.

"మిస్టర్ సంఘమిత్రా! ఇటీజ్ రియల్లీ ఎ గ్రేట్ ఫుల్ మాజిక్. యు ఆర్ ఎ జీనియస్" అన్నాను అతన్ని అభినందిస్తూ.

"ఇహ మీరిద్దరూ మీమీ కంఠాలు మార్చుకుంటే, కన్నవాళ్ళుకూడా గుర్తించలేరు" అని జేబులోంచి వెడ

ల్పాటి బెల్టు తీసేను. ఆ బెల్టు మధ్య అరలో, శక్తివంతమైన చిన్న ట్రాన్స్‌మీటర్ ఉంది.

దాన్ని షీలకి ఇస్తూ—"దీన్ని కాలి పిక్క దగ్గర కట్టుకో. ఎప్పటికప్పుడు నీ గురించి రిపోర్ట్ ఇస్తుండాలి. రివాల్వర్, స్పేర్ బుల్లెట్స్ బ్లౌజు లోపల భద్రం జేసుకోవాలి. అంతే కాదు. నీ సూట్ కేసులో ఉన్న సైనేడ్ కేప్సూల్స్ తీసి, కుడిచేతి చూపుడువేలు గోరుకింద అతికించుకో! అత్యవసర పరిస్థితి ఏర్పడితే దాన్ని ఉపయోగించవచ్చు" అన్నాను.

షీల తలూపింది.

ఆమె పట్ల నాకు పూర్తి విశ్వాసం ఉంది. సామాన్యురాలు కాదు. మంచి స్ఫురద్రూపి. క్షణాలమీద నిర్ణయాలు తీసుకుని అమలు జరిపే చురుకైన ఆడది.

మిగతా వాళ్ళని అక్కడే ఉండమనీ, షీలాను డాక్ బంగళాలో డ్రాప్ జేసి వస్తాననీ చెప్పి, షీలతో కార్లో బైలుదేరాను.

రెండు గంటల్లో బంగళా చేరుకున్నాం.

పోర్టికోలో కారాపగానే దిగి, బంగళా వెనక్కి వెళ్ళి పొదల దగ్గర చూసేను. రాత్రి మేము చంపిన చైనీస్ సోల్జర్స్ శవాలు మాయం! నవ్వుకుంటూ తిరిగి షీల దగ్గరికి వచ్చేను. ఆమెకి ఇవ్వవలసిన ఇన్‌స్ట్రిక్షన్స్ ఇచ్చి, అక్కణ్ణించి బైలుదేరేను.

ఎందుకో మనసు బరువెక్కింది. చైనీయులవంటి మృత్యుగహ్వరంలోకి వెళ్ళబోతున్న షీలని మళ్ళీ చూడగలనా? సజీవంగా తిరిగివస్తుందా? ఆమె నకిలీ మేకని వాళ్ళు పసిగట్టితే?

ఇలాంటి ఆలోచనలతో కారు నడుపుతూ వెనుదిరిగి చూసేను. షీల వరండాలో నిల్చుని నన్నే చూస్తోంది!

నిట్టూరుస్తూ కారు మరో రోడ్డులోకి తిప్పేను. స్పెషల్ బ్రాంచి డైరెక్టర్ ఇచ్చిన మ్యాప్ ప్రకారం, ఆ రోడ్డు ధోనితాల్ పొలిమేరల్లో ఉన్న మన సైనిక చౌకీని చేరుస్తుంది. సైనికాధికార్లతో మాట్లాడి, ఈ రాత్రి అమలు జరుపబోయే పథకం అల్లాలి.

సైనిక చౌకీని సమీపించగానే, పెట్రోలింగ్ గార్డ్స్ అటకాయించేరు. వాళ్ళకి నా ఐడెంటిఫికేషన్ కాగితాలు చూపించి, వెంటనే కమాండెంట్‌ని కలుసుకోవాలని చెప్పేను.

ఆ సెక్టర్ కమాండెంట్, బ్రిగేడియర్ సిచిదేవా నా ఐడెంటిఫికేషన్ కాగితాలు తనిఖీ జేయ్యగానే సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టేడు.

"డిఫెన్స్ మినిస్ట్రినించి ఆదేశాలు అందేయి, మీకు ఎప్పుడు ఏ సహాయం కావలసినా వెంటనే అందించమని. చెప్పండి!" అన్నాడు.

నా పథకం ఏమిటో అతనికి విపులంగా వివరించేను.

బ్రిగేడియర్ వెంటనే అందుకు సమ్మతించేడు.

అతనిదగ్గిర సెలవు తీసుకుని, తిన్నగా ధోనితాల్ బైలుదేరేను.

# 7

రాత్రి సరిగ్గా తొమ్మిదిన్నరకి నా జేబులోని ట్రాన్స్‌మీటర్‌నించి సన్నని శబ్దం రాసాగింది. వెంటనే దాన్ని బైటికి తీసి ఏరియల్ లాగి, బటన్ వత్తేను.

"హలో...హలో షీల కాలింగ్!" వినిపించింది.

"ఎస్... ప్రొసీడ్ ..." అన్నాను.

"ఐదు నిమిషాల క్రితం అరణ్యంలోంచి తుపాకి ప్రేలుడు వినిపించింది. నేను బైలుదేరుతున్నాను" అంది షీల.

"ఓ. కే. వెంట రైఫిల్ తీసుకెళ్ళడం మరిచిపోకు. మేనక అరణ్యంలోకి వెళ్ళేటప్పుడు, తనకూడా రైఫల్ తీసికెళ్ళేది. దానితో అరణ్యంలో ఏ క్రూరమృగమైనా దాడి జరిపితే ఎదుర్కోవచ్చు" అన్నాను.

"ఆల్ రైట్. ఇక ఉంటాను" క్లిక్‌మన్న శబ్దంతో ట్రాన్స్‌మిటర్ ఊరుకుంది.

ఏరియల్ దించి, దాన్ని జేబులోకి తోస్తూ అందరివైపు చూసేను. హోటల్ గదిలో అందరం కూర్చుని, షీల సందేశంకోసమే ఎదురుచూస్తున్నాం.

"డియర్ సంఘమిత్రా! నేనూ, మేనకా, డేవిడ్ హెలికాప్టర్‌లో బైలుదేరుతున్నాం. మీరు ఇక్కడే ఉండి, మా తదుపరి సందేశంకోసం ఎదురుచూడండి!" అన్నాను సోఫాలోంచి లేస్తూ.

సంఘమిత్ర తలూపేడు.

పైలెట్‌తో సహా, మిగతా అందరం కావలసిన వస్తువులు తీసుకుని, హోటల్ పైన టేరియస్‌లో రెడీగా ఉన్న హెలికాప్టర్ ఎక్కాం.

రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకి, రత్నాఘుడ్‌లో ఉన్న ఆ శిధిలమైన కోటదగ్గిర దిగింది హెలికాప్టర్. షీల వేషంలో ఉన్న మేనక ఆశ్చర్యంతో చుట్టూ చూడ సాగింది. కారణం, భారతసైన్యం ఆ కోటని నలువైపులా చుట్టుముట్టి ఉంది.

హెలికాప్టర్ దిగగానే, బ్రిగేడియర్ సచిదేవ తన జూనియర్ ఆఫీసర్లతో మా దగ్గరికి వచ్చేడు.

"మీరు కోరినట్టు రెండు కంపెనీల సైన్యం, కోటని చుట్టుముట్టి రెడీగా ఉంది..." ఇంకా అతని మాట పూర్తికాక ముందే నా జేబులోని ట్రాన్స్‌మిటర్ సన్నని శబ్దం చెయ్యసాగింది.

చటుక్కున దాన్ని తీసి, ఏరియల్ లాగి మీట వత్తేను.

"షీల కాలింగ్ ...షీల కాలింగ్ ..." అని వినపించగానే, నా రక్తం ఉరకలు వేసింది.

"ఎస్ ...అయామ్ లిస్‌నింగ్" అన్నాను.

"ఆ కాటేజ్ చేరుకోగానే, బైట నిల్చున్న సెంట్రీలు నా చేతిలోని రైఫిల్ లాక్కుని లోనికి పంపేరు. లోపల చ్యాంగ్‌లూ ఒక్కడే ఉన్నాడు. తన ప్రభుత్వం, నా నిర్ణయాలతో నిమిత్తం లేకుండా, తనే ఒక నిర్ణయం తీసుకుందనీ, ఈ రాత్రి రెండు గంటలకి, వాళ్ళ సైన్యం, కేవలరీ టాంకులతోనూ, ఆర్టిలరీ ఫిరంగులతోనూ సారంగంగుండా కోటలోకి ప్రవేశిస్తుందనీ, రత్నాగడ్ మద్దతుకోసం అక్కడున్న మన సైన్యంమీద మెరుపు దాడి జరిపి, రత్నాగఢ్ రేడియోలో ఆ రాజ్యం తమ స్వాధీనమైనట్టు ప్రకటిస్తుందనీ, ఇదంతా రాజా, రాకుమారిల ఇచ్ఛానుసారమే జరిగినట్టు చెబుతుందనీ, పరిస్థితులు చక్కబడేవరకూ నన్నూ, రాజాగార్ని అక్కడే బంధించి ఉంచి, తరువాత విడుదలజేస్తామనీ చెప్పేడు.

అంతేకాదు, ఆ నీచుడు నన్ను కాటేజ్ లోని ఓ గదిలోకి బలవంతంగా లాక్కెళ్ళి బలాత్కరించబోయేడు. వెనకా ముందూ ఆలోచించడానికి నా దగ్గిర వ్యవధి లేక

పోయింది. వేలి గోరుకింద అతికించుకున్న. సైనేడ్ కేప్‌సూల్ని వాడి మెడలో గుచ్చేసేను.

తక్షణం ప్రాణం వదిలేశు. వాడి జేబులు వెదికి, రాజు గార్ని బంధించి ఉంచిన గదితాళంచెవులు తీసుకున్నాను. అంతేకాదు, వాడి జేబులో చిన్న మ్యాప్ కూడా దొరికింది. దేనికైనా మంచిదని దాన్ని తీసుకున్నాను.

ఆ మ్యాప్‌లో రత్నాగఢ్ పర్వత పంక్తులూ, కొన్ని కోడ్లూ చిత్రించబడున్నాయి. ఆ పర్వత పంక్తుల్లో ఓ గుట్ట మీద క్రాస్ గుర్తు వెయ్యబడుంది. దానిమీదే శిధిలమైన కోట చిత్రించబడుంది.

ఆ తాళంచెవులతో రాజుగార్ని బంధించిన గది తెరిచి అయన్ని కట్టేసిన సంకెళ్ళు విప్పి, కిటికీగుండా ఇద్దరం కాటేజ్ వెనకభాగంవేపు దూకాం.

కాటేజ్ చుట్టూ గస్తీ తిరుగుతున్న కాపలావాళ్ళ కళ్ళుగప్పి, అరణ్యంలో ప్రవేశించాం. ఇప్పుడు దాదాపు ఆ డాక్‌బంగళా చేరువలో ఉన్నాం...''

''నీవు నిజంగా ఒక గొప్ప పని జేశావ్ షీలా! అయామ్ రియల్లీ ప్రౌడాఫ్‌యూ! ఆ మ్యాప్‌ని ఇంకా స్త పరీక్ష మాని అందులో ఇంకా ఏవైనా ముఖ్యవిషయాలు తోస్తాయేమో చెప్పు'' అన్నాను ఉత్సాహంగా.

''చుట్టూ చీకటి. ఏమీ కనిపించడంలేదు...''

''ప్రయత్నించు. ప్రయత్నించి చూడు. నీమీదే అంతా ఆధారపడుతుంది. కోటలో, వాళ్ళు సొరంగద్వారం ఎక్కడ తెరవబడుతుందో తెలిస్తే మా పని చాలా సులువౌతుంది...'' అన్నాను.

''ఉండండి......చుక్కల వెలుగులో ప్రయత్ని

స్తాను..." అంది షీల.

రెండు నిమిషాలు నిశ్శబ్దం!

"ఆఁ! కోట చిత్రించిఉన్నచోట, ఇంటూ మార్కు మధ్య చిన్న ఫిరంగి చిత్రించబడుంది. దానిచుట్టూ గుండ్రని గీత గీసి ఉంది."

"థాంక్స్యూ షీలా! థాంక్స్యూ వెరీమచ్! ఈ మిషన్‌లో మేము సక్సెస్ అయ్యామంటే, ఆ ఖ్యాతి నీకే దక్కుతుంది. మీరిద్దరూ సాధ్యమైనంత త్వరగా డాక్ బంగళాని సమీపించి, కాచుకోండి. హెలికాప్టర్‌లో డేవిడ్‌ని పంపిస్తున్నాను" అని ట్రాన్స్‌మీటర్ · జేబులో వేసుకుంటూ టైం చూసేను.

ఒంటిగంట!

"డేవిడ్! నువ్వూ, పైలెట్ హెలికాప్టర్‌లో ఆ డాక్ బంగళా బైలుదేరండి. బంగళా చుట్టుపక్కలే ఎక్కడో షీలా, మేనక తండ్రీ మీకు కనిపిస్తారు. వాళ్ళని తిరిగి ఇక్కడికి తీసుకురావాలి" అన్నాను.

డేవిడ్ తలూపి, పైలెట్ వెంట వెళ్ళిపోయేడు.

మరోగంటలో శత్రువు తవ్విన సొరంగద్వారం తెరుచుకుంటుంది.

"మేనకాదేవీ! ఈ కోటలో ఎక్కడో పాతకాలపు ఫిరంగి ఉంది. జ్ఞాపకం జేసుకుని చెప్పండి."

"ఇందులో జ్ఞాపకం జేసుకునేదేమీ లేదు. కోట ఈశాన్యదిశలో ఓచోట చక్రాలు లేని ఫిరంగి, మట్టిలో సగంవరకూ కప్పుకుపోయి పడుంది!"

"ప్లీజ్! త్వరగా మమ్మల్నక్కడికి తీసికెళ్ళండి" అన్నాను.

రాకుమారి వెనక అందరం రాళ్ళూ రప్పలూ దాటు కుంటూ ఫిరంగిని సమీపించాం. ఆ చుట్టుపక్కలే ఎక్కడో సొరంగద్వారం తెరుచుకోబోతోంది!

బ్రిగేడియర్ సచిదేవ్ వైపు తిరిగి అన్నాను. "మన రెండు కంపెనీల్లో, ఓ కంపెనీని ఇక్కడికి పిలిపించి, మిగతావాళ్ళని ఉన్నచోటే ఎలాట్ పొజిషన్‌లో ఉండ మనండి."

బ్రిగేడియర్ తక్షణం ఆదేశాలు జారీచేసేడు.

మరుక్షణం బిలబిల మంటూ ఓ కంపెనీ సైన్యం వచ్చి, ఆ ఫిరంగి చుట్టుపక్కల విరిగిపడ్డ శిథిలాల మాటున నక్కి రెడీ పొజిషన్‌లోకి వచ్చింది.

వాళ్ళదగ్గర స్టెయిన్ గన్స్, ఎస్.ఎల్.ఆర్. (సెల్ఫ లోడింగ్ రైఫల్) ఎల్.ఎమ్.జి. (లైట్ మెషిన్‌గన్) బి.ఎమ్.జి. (బిగ్ మెషిన్ గన్) త్రీఇంచ్ మోటార్స్ ఉన్నాయి.

నేనూ, మేనకా, బ్రిగేడియర్ ఓ రాయి చాటున పడుకుని చూడసాగాం.

సరిగ్గా రెండు గంటలకి—

భయంకరమైన ప్రేలుడుతో, ఆ ఫిరంగి పదిగజాల ఎడంగా భూమి బద్దలయింది. ఆ ప్రేలుడికి ఉవ్వెత్తున లేచిన రాళ్ళూ రప్పలూ మా మీద పడకుండా మోచేతుల్లో మొహాలు దాచుకున్నాం.

ఐదు నిమిషాల తరవాత వాతావరణం మామూలు స్థితికి వచ్చింది. తలెత్తి చూసేను. తెరుచుకున్న ఆ సొరంగం ద్వారంగుండా ఓ యువకుడు ఇవతలికి వచ్చేడు.

అతన్ని చూడగానే, "మైగాడ్! మా చిన్నాన్న

కొడుకు, రణ్‌జిత్ అతనే!'' అంది మేనక దిగ్భ్రాంతితో.

"అతను శత్రువుతో చేతులు కలిపి, ఈ కుట్రలో పాల్గొన్నాడన్న మాట!'' అన్నాను సాలోచనగా తలూపుతూ.

"పిచ్చివాడిలా నటిస్తూ ఇంత ద్రోహానికి పూనుకుంటాడనుకోలేదు'' అంది మేనక.

ఇంతలో రణ్‌జిత్ వెనక, చైనీస్ ఆర్మీ యూనిఫాంలో ఉన్న ఇద్దరు ముగ్గురు ఆఫీసర్లు సొరంగంలోంచి బైటికి వచ్చేరు. రెప్పవెయ్యకుండా అటే చూస్తూ పడుకున్నాం.

గంటలోగా, చూస్తూ చూస్తూనే శత్రువుకి చెందిన దాదాపు నాలుగువందలమంది సిపాయిలు అన్ని రకాల ఆయుధాలతో ఇవతలికి వచ్చేరు.

ఓ చైనీస్ ఆఫీసర్, రణ్‌జిత్ భుజం తడుతూ ఏదో అంటున్నాడు.

ఫైరింగ్ ఆర్డర్ యివ్వమన్నట్టు బ్రిగేడియర్‌కి సైగ చేసేను.

"బ్రస్ట్ ఫైర్!'' అన్న బ్రిగేడియర్ సింహగర్జనతో, మన సైనికులు వాళ్ళమీద గుళ్ళవర్షం కురిపించారు.

అటువంటి పరిస్థితి వస్తుందని ఊహించని శత్రు సైనికులు చీమలదండుల్లా నేలకూలసాగేరు. అరగంట వరకూ మరతుపాకుల మోతతో ఆ ప్రదేశం మారు మోగింది.

గుళ్ళవర్షాన్ని తట్టుకుంటూ చెల్లాచెదురుగా పారిపోబోతున్న శత్రు సైనికుల్ని, కోటచుట్టూ పొంచి ఉన్న మన రెండవ కంపెనీ మట్టుబెట్టింది.

బాలభానుని తొలి కిరణాలు శత్రుసైనికుల శవాలమీద ప్రసరిస్తూ ఉదయించేయి.

బ్రిగేడియర్ సచిదేవని మనసారా అభినందించేను. మేనక మొహంమీది మాస్క్ తీసేసి నిండుగా నవ్వింది.

ఇంతలో, ఆకాశాన హెలికాప్టర్ వస్తున్న శబ్దం విని, అందరం అటు చూడసాగాం, హెలికాప్టర్ కోటచుట్టూ ఓ రౌండ్ కొట్టి మెల్లిగా మేమున్న ప్రదేశంలో దిగింది. కాక్‌పిట్‌లోంచి, పైలెట్, డేవిడ్, షీలా, రాజు మణి పాల్ చిరునవ్వులతో దిగేరు.

మేనక పరుగెత్తికెళ్ళి తండ్రిని కౌగిలించుకుంది.

షీల మొహంమీది మాస్క్ తీసి, "ఈ విజయం నీదే!" అన్నాను. అప్యాయంగా తండ్రికి మమ్మల్నందర్నీ పరిచయం జేసింది మేనక.

"మీరు జేసిన సహాయానికి ఈ జన్మంతా కృతజ్ఞులం" అన్నాడు రాజు మణిపాల్ చేతులు జోడిస్తూ.

"ఇందులో మేము జేసిన సహాయం ఏమీ లేదు. మీ అమ్మాయి సహకారంవల్లే ఇటు మీ దేశానికీ, అటు మా సైన్యానికీ నష్టంకలక్కుండా ప్రమాదం తప్పిపోయింది!" అన్నాను.

అందరిదగ్గిరా సెలవుతీసుకుని షీలా, డేవిడ్‌లతో హెలి కాప్టర్ ఎక్కేను.

హెలికాప్టర్ కొద్ది దూరం ఎగిరేక, అనుకోకుండా కాక్‌పిట్‌లోంచి కిందికి చూసేను.

మేనక సజల నయనాలతో చెయ్యి ఊపుతోంది!

—: ఐపోయింది :—

# గూడుపుఠాణి

## రంకిరెడ్డి రాము

రోడ్డుమీద నడుస్తున్న నేను ఉలిక్కిపడ్డాను.

నా ముందు నడుస్తున్న వ్యక్తి జేబులోంచి పర్స్ క్రింద పడింది. ఆ వ్యక్తి గమనించకుండా వెళ్ళిపోతున్నాడు. నేను ఒంగి ఆ పర్స్ తీసుకుని అతడిని పిలిచాను 'సార్' అంటూ.

అవ్యక్తి వెనక్కి తిరిగాడు.

"మీ పర్స్ జేబునుంచి పడిపోయిందండీ!" అంటూ పట్టుకెళ్ళి అతడి చేతికిచ్చాను.

ఆ వ్యక్తి సిల్క్ లాల్చీ, పంచె ధరించి వున్నాడు' కళ్ళకు గోల్డ్ ఫ్రేమ్ కళ్ళజోడు పెట్టుకుని పెద్ద ధనవంతుడిలా కనిపిస్తున్నాడు. పర్స్ చూడగానే అతడి కళ్ళు

మెరిసాయి. పర్స్ తెరచి చూసుకున్నాడు. నేనూ తొంగి చూసాను అందులోకి.

వందకాగితాల దొంతరవుంది దానిలో.

అతడు సంతృప్తిగా తలాడించి పర్స్ జేబులో పెట్టుకుని "చాలా థాంక్స్! రండి కాఫీ త్రాగుదాం" అన్నాడు.

"అబ్బే! ఒద్దండీ!" అన్నాను మొహమాటంగా.

పైకలా అన్నానేగానీ కడుపులో మంటగా వుంది భోజనంచేసి అప్పుడే రెండు రోజులయింది. ఈ నీరసం మీద అసలు బయటకు వచ్చివుండే వాడిని కాదు.

కానీ, నేను పాసయిన బి. ఏ. డిగ్రీకి ఓ సార్థకత రావాలన్నా, మండే కడుపును చల్లార్చాలన్నా నాకో ఉద్యోగం కావాలి! ఆ ఉద్యోగం కోసం ప్రయత్నాలు చెయ్యాలి! ఆ ప్రయత్నాల్లో భాగంగా రోజూ లైబ్రెరీకి వెళ్ళి 'హిందూ' లోని వాంటెడ్ కాలమ్స్ చూడటం, నాకు సరిపోయే ఉద్యోగం ఏదైనా కనపడితే దానికో అప్లికేషన్ పడేయటం అలవాటు చేసుకున్నాను.

అలా లైబ్రెరీకి వెళుతుండగానే ఈ వ్యక్తి జేబులోని పర్స్ క్రిందపడటం, అది నా కళ్ళబడటం జరిగింది.

"చూడుబాబూ! నీ స్థానంలో మరొక రెవరైనావుండి వుంటే నా పర్స్ నాకు దక్కేది కాదు. అలాగని ఈ కాఫీతో నీ మంచితనానికి వెల కడుతున్నాననుకోకు. ఏదో నా సంతృప్తి కోసం కాఫీ త్రాగుదువు గాని. పెద్దవాడిని. ఈ విషయంలో నాకు చిన్న కోరిక కాదని నా మనసు బాధ పెట్టకు బాబూ!" అన్నాడు.

నాకు ఆయన అలా బ్రతిమలాడ్డం చూసాక ఆయన

మాట కాదన్నందుకు చాలా సిగ్గు పడ్డాను.

"సరే! పదండి" అని ఆయనను అనుసరించాను.

ఇద్దరం 'వోల్గా' రెస్టారెంట్ లోకి వెళ్ళి కూర్చున్నాం. ఆయన ఏవో టిఫెన్లు ఆర్డర్ చేసాడు.

"నీ పేరేమిటి బాబూ?" అడిగారు ఆయన.

"విజయ్" అన్నాను ముక్తసరిగా.

"ఏం చేస్తున్నావ్?" మళ్ళీ అడిగారు.

"ఉద్యోగం కోసం వేటాడుతున్నాను" అన్నాను' డిగ్రీ ఫస్ట్ క్లాస్ లో పాసయి ఏడాది కావస్తున్నా ఉద్యోగమే దొరకలేదనే కసి అంతా ఆ మాటల్లో కుదిస్తూ.

"ఏం చదివావు?"

చెప్పాను.

"చూడు నాయనా! నిన్ను చూస్తుంటే చాలా అభిమానం, నిజాయితీ కలవాడిగా కనిపిస్తున్నావు. ఓ ఉద్యోగం ఇప్పిస్తాను. చేస్తావా?" అడిగాడు ఆయన.

నా కళ్ళు ఆనందంతో మెరిసాయి. ఆయన మాటలు అమృతం తాగినట్లనిపించాయి. నమ్మలేనట్లు చూసాను ఆయన వైపు.

"ఏం విజయ్! చేస్తావా?" అన్నారాయన మళ్ళీ.

నోట మాటరాక చేస్తానన్నట్లుగా తలూపాను.

కాఫీ త్రాగి బయటకు వచ్చాక ఓ రిక్షాని పిలిచారు. ఇద్దరం ఎక్కి కూర్చున్నాక రిక్షా బయలుదేరింది. ఆయన చెప్పిన డైరెక్షన్ల ప్రకారం రిక్షా మారుతీ నగర్ లోని 2-30-1 నెంబర్ ఇంటి ముందాగింది.

రిక్షాదిగి డబ్బులిచ్చేసాక ఆ ఇంటిలోనికి నడిచారు. నేను ఆయన్ను అనుసరించాను.

పైకి ఇల్లులావుంది కానీ, అది ఆఫీస్. బయట ఓ ప్యూన్ యూనిఫారమ్ వేసుకుని నిలబడి వున్నాడు.

నన్ను తీసుకొచ్చినాయన్ను చూడగానే ప్యూన్ నమస్కారం పెట్టాడు. ఆయన హుందాగా తలవూపి లోనికి నడిచారు.

లోపల పెద్ద హాలుంది. దాన్ని అందమైన ప్లైవుడ్ తో నాలుగు భాగాలుగా పార్టీషన్ చేసారు. మొదటి గదిలో రెండు కుర్చీలు వున్నాయి. ఓ టేబుల్ మీద రెమిగ్టన్ టైప్ మిషన్ వుంది. దానిముందున్న కుర్చీలో ఓ ఇరవై ఏళ్ళ అందమైన యువతి కూర్చుని ఏదో టైప్ చేస్తోంది.

రెండో టేబుల్ మీద ఫైళ్ళను పరిశీలిస్తున్నాడు ఓ వ్యక్తి. ఆగదికి ఎడమవైపు ఓ డోర్, కుడివైపు మరో డోర్ ప్లైవుడ్ తో చేసినవి వున్నాయి.

నన్ను తీసుకువచ్చిన వ్యక్తి కుడివైపు వున్న డోర్ తెరచుకుని వెనక్కి తిరిగి నన్ను రమ్మన్నట్లు సైగ చేసారు.

నేను ఆయన్ను అనుసరించాను.

ఆ గదిలో ఓ గాడ్రేజ్ టేబుల్, దాని వెనుక ఓ రివాల్వింగ్ చైర్ వున్నాయి. చైర్ లో నలభై ఏళ్ళ వ్యక్తి కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. బహుశా ఆఫీసర్ అయి వుంటారనుకున్నాను.

ఆఫీసర్ నన్ను తీసుకొచ్చి నాయన్ను చూడగానే కుర్చీలోంచి లేచి "సదాశివంగారా! నమస్కారం. ఏమిటి చాలా కాలానికి దయచేశారు?" అంటూ ఆహ్వానించాడు.

అప్పుడే తెలిసింది నాకు ఈయన పేరు సదాశివం అని. సదాశివంగారు ఓ కుర్చీలో కూర్చుని నన్నో కుర్చీలో

కూర్చోమన్నారు.

"ఇతడు నాకు బాగా కావలసిన వ్యక్తి. బి. ఏ. ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాడు. మన ఆఫీస్‌లో ఏదైనా పోస్ట్ ఖాళీగా వుంటే..."

"మీరు చెప్పటమూ, నేను కాదనటమూనా? అయినా మీరు అలా అడగకూడదు, నన్ను ఆజ్ఞాపించాలి!" అంటూ ఆఫీసర్ టేబుల్ మీద కాలింగ్ బెల్ నొక్కాడు.

మరు నిముషంలో గదిలో ప్యూన్ ప్రత్యక్షమయ్యాడు.

"గుర్నాథంగారినిలా రమ్మను" అని ఆజ్ఞాపించాడు ఆఫీసర్.

కొద్ది నిముషాల తర్వాత ఓవ్యక్తి స్వింగ్ డోర్ తెరుచుకుని లోపలకు ప్రవేశించాడు.

"చూడండి గుర్నాథంగారూ! ఈయన రేపటినుంచి మన ఆఫీస్‌లో పని చేస్తారు. మొన్న ఖాళీ అయిన సీట్ ఈయనకు ఇవ్వండి. టైపిస్ట్‌తో అప్పాయింట్ మెంట్ ఆర్డర్ టైప్ చేయమని చెప్పండి. ఇప్పుడే జాయినింగ్ రిపోర్టు ఇస్తారు" అన్నారు.

ఆ తర్వాత పనులు చకచకా జరిగిపోయాయి. జాయినింగ్ రిపోర్టు వ్రాసాక కూడా నాకు అంతా కలలా అనిపించింది.

ఏడాదినుంచి విశ్వప్రయత్నాలు చేసినా రాని ఉద్యోగం ఆఫ్టరాల్ చిన్న ఉపకారం చేసినందువలన, కనీసం నా డిగ్రీ సర్టిఫికెట్లన్నా చూడకుండా వచ్చింది.

అన్నీ పూర్తయ్యాక "రేపటినుండి రెగ్యులర్‌గా వచ్చేయండి ఆఫీస్‌కి. మీరేం చెయ్యాలో గుర్నాథంగారు చెప్తారు. మిగిలిన ఆఫీస్ స్టాఫ్‌కికూడా రేపే పరిచయం

చేస్తాను. ఉదయం పది గంటలకల్లా వచ్చేయండి'' అన్నారు ఆఫీసర్.

నేను కృతజ్ఞతగా నమస్కారించాను.

సదాశివం గారు లేచి ఆఫీసర్ కి థాంక్స్ చెప్పి బయటకు నడిచారు.

కొంతదూరం నడిచాక ''మీకు నా కృతజ్ఞతలు ఎలా చెప్పాలో తెలియటంలేదండీ!'' అన్నాను.

ఆయన నా భుజం తట్టి ''నిజాయితీగా నీ వుద్యోగం చేసుకుని నీతోపాటు నాకూ పేరు తీసుకురా! అదే నాకు కృతజ్ఞతలు చెప్పినట్లవుతుంది'' అన్నారు.

నేను ఆయన్నుండి శలవు తీసుకుని రూమ్కి బయలుదేరాను.

నేను పుట్టినసంవత్సరానికి మా నాన్న గుండెపోటుతో చనిపోయాడు. మాకేమీ ఆస్తిపాస్తులు లేకపోవటంవలన అమ్మ నన్ను చాలా కష్టాలుపడి చదివించింది. మా పెదనాన్నగారు బాగా స్థితిపరులు. ఆయన భార్యావిధేయుడు. భార్యకు తెలియకుండా నా చదువుకి ఆయన అప్పుడప్పుడు సాయం చేసేవారు.

మా పెదనాన్నగారికి పిల్లలు లేరు. ఆయనకు నన్ను దత్తత చేసుకోవాలని వుండేదట. కానీ ఆయన భార్య అది పొసగనివ్వక ఆమె తరఫు బంధువుల కుర్రాడిని తెచ్చుకుని దత్తత చేయించిందట.

ఆ తర్వాత నా కాలేజీ చదువుకోసం మేము ఆ వూరు వదిలి ఇక్కడకు వచ్చేసాం, నేను శ్రద్ధగా చదివటం వలన డిగ్రీలో స్కాలర్ షిప్ సంపాదించుకుని చదువు గట్టెక్కించాను.

డిగ్రీ రిజల్ట్ రాగానే అమ్మకూడా తన పని అయిపోయి నట్లు ఈ లోకంనుంచి తప్పుకుంది.

## 2

మర్నాడు తొమ్మిది గంటలకల్లా వున్న బట్టలలోనే కాస్త మంచివి తొడుక్కొని ఆఫీస్‌కి బయలుదేరేను.

నాకు చాలా ఆనందంగా వుంది. ఈ రోజు నేను కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించబోతున్నాననే వూహ నన్ను ఉత్తేజితుణ్ని చేస్తోంది.

మారుతీనగర్ వెళ్ళేసరికి పావు తక్కువ పదయింది. నడక వేగం పెంచాను.

మరో అయిదు నిమిషాల్లో ఆఫీస్ ముందున్నాను. ఆఫీస్ తలుపులకు తాళం వేసివుంది. ఇంకా టైం కాలేదని ఎవరూ రాలేదేమోనని అక్కడే నిల్చున్నాను.

మరో అరగంట గడిచింది. ఎవరూ రాలేదు. నాకు చాలా ఆశ్చర్యంగావుంది. నన్ను పది గంటల కల్లా రమ్మ న్నారు ఆఫీసర్. మరి పదిన్నరయినా కనీసం ప్యూన్ కూడా రాడేం? ఈ రోజున శలవా? శలవైతే నన్నెందుకు రమ్మ న్నారు. శలవు సంగతి నాతో చెప్పటం మర్చిపోయారా?

ఆలోచిస్తున్న నేను ఆ ఇంటి గోడకున్న చిన్న బోర్డ్ చూసి వులిక్కిపడ్డాను.

"టులెట్" బోర్డ్ అది.

అదెలా సంభవం? నిన్న ఆఫీస్ వున్న ఇంటికి ఈరోజు టులెట్ బోర్డ్? నాకు బాగా గుర్తుంది. నిన్న ఇదే ఇల్లు. డోర్ నెంబర్ కూడా గుర్తు పెట్టుకున్నాను.

అక్కడే గేటుకు మేకులతో కొట్టివున్న చిన్న రేకు ముక్కమీద వున్న డోర్ నెంబర్ చూసాను దగ్గరకెళ్ళి.

అదే డోర్ నెంబర్ 2-30-1.

ఆఫీస్ వేరే చోటికి షిఫ్టు చేసారా? మరైతే నిన్న ఆ విషయం నాతో చెప్పటం మర్చిపోయారా?

ఇంతలో ఎవరో వ్యక్తి రోడ్డుమీద వెళ్తుంటే పిల్చాను. "ఎక్స్‌క్యూజ్ మి. ఈ ఇంట్లో ఆఫీస్ ఒకటి ఉండాలి! దాన్ని ఎక్కడకు మార్చారు?" అడిగాను.

అతడు నన్ను ఎగాదిగా చూసి "ఎప్పటి మాట మీరడి గేది?" అన్నాడు.

"నేను నిన్న చూశాను. ఆఫీసులో నాకు ఉద్యోగం ఇచ్చి ఈ రోజునుంచి డ్యూటీలో జాయిన్ అవమన్నారు. నిన్నవున్న ఆఫీస్ ఈరోజు లేదు. ఇదే డోర్ నెంబర్ నాకు బాగా గుర్తు" అన్నాను.

అతడు నవ్వేడు. "చూడు మిస్టర్ నేనీ వీధిలో పద్నా లుగు సంవత్సరాలనుంచీ వుంటున్నాను. ఈ పద్నాలు గేళ్ళలోనూ ఈ ఇంట్లో ఎవరూ ఏ ఆఫీసు పెట్టలేదు. దీన్లో రెండు నెలల క్రితంవరకూ ఓ రిటైర్డ్ తాసిల్దార్ వుండే వారు. ఆయన ఖాళీ చేసాక అంటే రెండు నెలల నుంచీ ఈ ఇల్లు ఖాళీగా వుంది.

ఈ ఇంటి యజమానులు దీన్ని అద్దెకిచ్చే వ్యవహారం నాకే అప్పగించారు. ఈ ఇంటి తాళాలు ఎప్పుడూ నా దగ్గరే వుంటాయి. మనిద్దరి మధ్య ఇంత సంభాషణ జరి గింది కనుక ప్రస్తుతం మనం స్నేహితులం. నీ శ్రేయస్సు కోరే స్నేహితుడుగా నీకో సలహా ఇవ్వదలచుకున్నాను. అదేమిటంటే వెంటనే వెళ్ళి మెంటల్ హాస్పిటల్‌లో జాయిన్ అయిపో! వస్తాను" అంటూ విసురుగా వెళ్ళి పోయాడు.'

నేను అవాక్కయి నిల్చుండిపోయాను. నా మెదడు గిర్రున తిరగసాగింది. నిజంగా నాకేమైనా పిచ్చిపట్టిందా? లేదు... లేదు... ఇదే డోర్ నెంబర్! ఇదే ఇల్లు!

మరి అతడు రెండు నెలలనుంచీ ఇల్లు ఖాళీగా వుందంటాడేం?

పిచ్చి పట్టిన వాడిలా మారుతీ నగర్ అంతా తిరిగేసాను, నేను పొరబడ్డానేమోనని. కానీ, ఆ నెంబర్‌తో మరో ఇల్లెలా వుంటుంది? పోనీ, ఆ ఇంటిని పోలిన మరో ఇల్లుకూడా నాకెక్కడా కనిపించలేదు.

తిరిగి తిరిగి కాళ్ళు లాగుతుండగా, మెదడు పని చేయటం మానేసాక రూమ్‌కి తిరుగు ముఖం పట్టాను.

# 3

"హల్లో విజయ్!"

లైబ్రెరీలో పేపర్ చదువుతున్న నేను ఉలిక్కిపడి తలెత్తాను.

ఎదురుగా ఎవరో అపరిచిత వ్యక్తి నిలబడి వున్నాడు. నా వంక చూసి చిరునవ్వు నవ్వుతున్నాడు.

"ఎవరు మీరు? నన్నేనా ఇప్పుడు పిలిచింది?" అడిగాను.

అతడి ముఖంలో ఆశ్చర్యం కొట్టొచ్చినట్టు కనిపించింది.

"అదేమిటి విజయ్! నన్ను గుర్తుపట్టనేలేదా! నీ ప్రాణ స్నేహితుడినే అంత తేలికగా మర్చిపోయావా? నేను చలాన్ని" అన్నాడు.

"క్షమించాలి! నేను మిమ్మల్ని చూడటం ఇదే మొదటిసారి. కనీసం ఇంతకు ముందెప్పుడూ మిమ్మల్ని చూసిన గుర్తుకూడా లేదు" అన్నాను.

నాకంతా అయోమయంగా వుంది. నిన్నటి ఆఫీస్ గందరగోళం నుంచి ఇంకా తేరుకోలేను. మళ్ళీ ఇదేదో షాక్!

"మీ పేరు విజయేనా?" అడిగాడు ఎదుటి వ్యక్తి.

"ఔను" ముక్తసరిగా జవాబిచ్చాను.

"మరి నన్ను గుర్తుపట్టలేదంటావేం? అయిదేళ్ళు కలిసి చదువుకున్నాం. ఆ మాత్రం గుర్తించలేనా నిన్ను?" ఆశ్చర్యంగా అన్నాడా వ్యక్తి.

"చూడండి మిస్టర్ చలం. నాకేమీ మతిమరుపు లేదు. నా పేరు తెలుసుకుని నేను మీకు తెలిసున్నట్టుగా మీరెందుకు నాటకమాడుతున్నారో నాకర్థం కావటం లేదు. బహుశా నానుంచి మీరేదో కోరుకుంటున్నారనుకుంటాను. నేను నిరుపేదను. పైపెచ్చు నిరుద్యోగిని. నావల్ల మీకు జరిగే వుపకారం ఏమీ వుండదనే నేననుకుంటున్నాను. ఒకవేళ నాచేతుల్లో వుంటే ఆపనేమిటో చెప్పండి నిరభ్యంతరంగా చేసిపెడ్తాను. అంతేగాని నేనేదో మీకు తెలిసినట్లు, మనం ప్రాణస్నేహితులమైనట్లు అబద్ధం చెప్పి నాబుర్ర పాడు చేయకండి" అంటూ విసురుగా లేవబోయాను.

"విజయ్! ఏదో స్నేహితుడివి. చాలా కాలానికి కలిసావన్న ఆనందంతో పలుకరించాను. మరి నీ మనసులో ఏముందో ఈ విధంగా మాట్లాడుతున్నావు. మద్రాస్ వెళ్ళి కీల్పాక్ మెంటల్ హాస్పిటల్‌లో జాయిన్ అయితే మంచిది. గుడ్ బై" అని వెళ్ళిపోయాడు.

ఏమిటిది? ఏం జరుగుతోంది నాకు? ఎవరీ వ్యక్తి? ఎంత గుర్తు తెచ్చుకుందామన్నా జ్ఞాపకం రావటంలేదు. కనీసం

ఎప్పుడూ చూసిన గుర్తైనా లేదు. నాతో అబద్ధం ఎందుకు చెబుతాడు? నాకేమైనా అవుతోందా?

ఆలోచనల్తో మెదడంతా మొద్దుబారిపోగా, నీరసంగా రూమ్ వైపు అడుగులు వేసాను.

## 4

అభిమానం విడిచి షావుకారు చిదానందంగారి బట్టల కొట్లో పద్దులు వ్రాయటానికి కుదిరాను. నెలకు వంద రూపాయలు జీతం. ఆ ఉద్యోగంలో కుదిరాక కనీసం రోజుకో పూటైనా భోజనం చేయగలుగుతున్నాను. రోజూ ఓ రెండు గంటలు పనుంటుంది నాకు కొట్లో.

మరో గంట లైబ్రరీలో గడుపుతున్నాను. మిగిలిన సమయంలో నాకు మారుతీనగర్ లోని 2-30-1 ఇల్లు, చలం గుర్తుకొస్తున్నారు ఎక్కువగా. నిజంగా నాకు పిచ్చి ఎక్కిందా? లోకంలో ఇటువంటి అనుభవాలు ఎవరికైనా జరుగుతాయా? అని ఆలోచిస్తాను.

ఆ రోజు మధ్యాహ్నం మెస్ లో భోజనం చేసి పన్నెండు ప్రాంతంలో రూమ్ కి చేరుకున్నాను. తలుపులు లోపలివైపు గడియవేసి చాపమీద నడుం వాల్చాను. పది నిముషాలు గడిచాక తలుపు తట్టిన చప్పుడయింది. నా రూమ్ కి ఎవరొచ్చారా అని ఆశ్చర్యపోతూ వెళ్ళి తలుపు తీసాను.

ఎదురుగా ఇరవై ఏళ్ళ యువతి చేతిలో సూట్ కేస్ తో నిలబడి వుంది. ఆమెను ఇంతకు ముందెప్పుడూ చూడలేదు నేను.

"ఎవరు కావాలండీ?" అన్నాను, బహుశా ఎవరిల్లో అనుకుని పొరబడి నా రూమ్ తలుపు తట్టిందనుకుంటూ.

ఆమె కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి. "నేనేం పాపం చేసాను విజయ్! ఎందుకు నన్నిలా బాధ పెడుతున్నావ్? అనుక్షణం నన్నిలా చిత్రవధ చేసేకన్నా ఒక్కసారే నీ చేతో గుక్కెడు విషం యిస్తే ఆనందంగా కన్ను మూస్తాను. అంతేగాని, నన్ను తెలియనట్టు నటించి బాధ పెట్టకు" అందా యువతి.

నాకు ముచ్చెమటలు పట్టేసాయి. మళ్ళీ ఈ కేసేమిటి? ఈమెను చూడడం ఇదే మొదటిసారి. మరి నా పేరుతో సంబోధిస్తుందేం? ఎలా తెలిసింది నా పేరు? ఏమిటసలు ఈవిడ ఉద్దేశం?

"చూడమ్మా! నువ్వెవరో నాకు తెలియదు. బహుశా నన్నెవరో అనుకొని పొరబడివుంటావు. నా పేరు నువ్వన్నట్లుగానే విజయ్! కానీ ఇంతకు ముందు నిన్నెప్పుడూ నేను చూడలేదు. నాకు తెలిసి నిన్ను చిత్రవధ పెట్టనూ లేదు. దయచేసి ఇక్కడనుంచి వెళ్ళిపో!" అన్నాను సాధ్యమైనంత సౌమ్యంగా.

ఆమె సూట్‌కేస్ క్రింద పెట్టేసి, వొంగి నా కాళ్ళు రెండూ పట్టేసుకుంది, గట్టిగా ఏడుస్తూ.

నేను తత్తర పడ్డాను. నడివీధిలో, మిట్ట మధ్యాహ్నం నా రూమ్‌కి ఓ యువతి రావటమే కాక, నా కాళ్ళమీద పడి ఏడుస్తుంటే... చూసే వాళ్ళేమనుకుంటారు? అనుకుని కంగారుగా అటు ఇటు చూసాను. అప్పటికే వీధిలో వాళ్ళు నలుగురైదుగురు ఆశ్చర్యంగా రోడ్డుమీద నిలబడి చూస్తున్నారు మమ్మల్ని.

ఆమె ఏడుస్తూ కొంచెం పెద్ద స్వరంతో "తెలియక నేనేదైనా తప్పు చేసివుంటే నన్ను మనస్ఫూర్తిగా

క్షమించు విజయ్! తల్లీ తండ్రీ లేని అనాథను నిన్ను నమ్మి నా సర్వస్వం అప్పగించాను. నన్ను గుళ్ళో పెళ్ళి చేసుకుని, నాతో కొన్నాళ్ళు సంసారం చేసి ఇప్పుడిలా మొహం చాటేయడం నీకు ధర్మం కాదు. నువ్విప్పుడు నన్ను తిరస్కరిస్తే నాకు చావు తప్ప గత్యంతరం లేదు. చెప్పు విజయ్! నన్నేం చేయమంటావ్? చావమంటే— ఈ క్షణమే—నీకళ్ళముందే—ఇక్కడే—తల పగల గొట్టుకుని ఛస్తాను'' అంది.

నెమ్మదిగా రోడ్డుమీద జనం పోగవసాగారు. వెర్రెత్తిపోతోంది నాకు. నిజంగా నేను నేనేనా? నా పేరు విజయేనా? మరేమిటీ ఇంద్రజాలం? ఈ సంఘటనలకు అంతెక్కడ?

''ఏమిటమ్మా? ఎవరు నువ్వు? ఏంజరిగింది?'' అంటూ వచ్చాడు మారూమ్ ఓనర్.

''చూడండి బాబూ! మీరే న్యాయం చెప్పండి. నేనో అనాథను. నా తల్లితండ్రులెవరో నాకు తెలియదు. అనాథాశ్రమంలో పెరిగి అక్కడ నేర్చుకున్న టైలరింగ్‌తో బ్రతుకు గడుపుకొస్తున్నాను. అప్పుడే అంటే సంవత్సరం క్రిందటే ఈయనతో పరిచయం అయింది. కొంతకాలానికి ఆ పరిచయం ప్రేమగా రూపొందింది. ఆవేశం హద్దులు దాటి, మాకు దొరికిన ఏకాంతాన్ని ఇద్దరం దుర్వినియోగం చేసుకున్నాం.

''పెళ్ళి చేసుకోమని అడిగాను. తనకు ఉద్యోగందొరికే వరకూ పెళ్ళి చేసుకోనన్నారు. అప్పటికే కాలుజారటం వలన నేను తొందరపెట్టాల్సి వచ్చింది. అడగ్గా, అడగ్గా కొంతకాలానికి గుళ్ళో పెళ్ళిచేసుకున్నారు నన్ను.

“ఓ రెండు నెలలు బాగానే వున్నారు. ఆ రెండు నెలలూ టైలరింగ్ చేసి నేనే పోషిస్తూ వచ్చాను. ఈయన ఉద్యోగంకోసం తిరుగుతుండే వారు. అకస్మాత్తుగా ఓ రోజున ఇంటికి రాలేదు. ఎందుకు రాలేదోనని నేనుచాలా కంగారు పడ్డాను.

“ఆ రాత్రంతా నిద్రపోకుండా ఈయన రాకకోసం ఎదురు చూసాను. ఇంకెక్కడ వస్తారు? నన్ను పెళ్ళిచేసు కోనంటే ఉద్యోగంలేదని చేసుకోనంటున్నారనుకు నే దాన్ని. కానీ, నామీద మోజు తీరిపోయి పారిపోయారను కోలేదు అప్పుడు. ఈ వూళ్ళో వుంటున్నారని మొన్న నే తెలిసింది. కానీ కరెక్టు అడ్రస్ తెలియలేదు.

“నిన్న ఈ వూరు వచ్చాను. నిన్నటినుంచి వూరంతా గాలించాను ఈయనగారి కోసం. ఈ రోజు కనిపించారు. వెనకాలే పడి వచ్చాను. మీరంతా పెద్దలు. న్యాయం ఆలోచించండి. నాలాంటి అమాయకురాలి బ్రతుకేమై పోవాలి? మీ రంతాకలసి నా సంసారం నిలబెట్టాలి!’ అంటూ చేతులు జోడించి చెప్పిందామె.

“అబద్దం! అంతా కట్టు కధ” శక్తికొద్ది అరిచాను. ఒక్కొక్క సంఘటన జరుగుతుంటే నా మెదడులోని రక్తనాళాలు పగిలిపోతున్నట్లనిపిస్తోంది. ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లు అనిపించింది.

“చూడమ్మాయ్! ఇతడు ఈ రూమ్‌లో ఆరు నెలలనుంచీ వుంటున్నాడు. గదిలోకి వచ్చేముందు తను ఒంటరివాడినని తల్లి, తండ్రి ఎవరూ లేరని చెప్పాడు. నువ్వువచ్చి అతడి భార్యనంటున్నావు. మరి మీ ఇద్దరికీ పెళ్ళయినట్లుగా ఋజువులేమైనా వున్నాయా?” అన్నాడు నా రూమ్ ఓనర్.

"బుజువులా...!" అని ఓక్షణం ఆలోచించి "ఆ వుంది. పెళ్ళయ్యాక మేమిద్దరం కలిసి తీయించుకున్న ఫోటో వుంది. చూపిస్తానుండండి" అని సూట్ కేస్ తెరిచిందామె.

థాంక్ గాడ్! ఇక నేను ప్రమాదంనుంచి బయట పడ్డట్టే! ఈమె ఎవరో పిచ్చిదై వుంటుంది. ఈ దెబ్బతో అంతా తేలిపోతుంది. పదిమందిలోనూ పెట్టిన నా పరువు, ప్రతిష్ట మళ్ళీ సంపాదించుకోగలను. ఈ పిచ్చిది నాభార్య కాదని నిరూపించబడ్డ మరుక్షణం గుమ్మంలోంచి బయటకు గెంటెయ్యాలి అనుకున్నాను.

ఆమె సూట్ కేస్ లోంచి ఓ ఫోటో తీసి మా రూమ్ ఓనర్ కిచ్చింది. ఆయన ఆశ్చర్యంగా దాన్ని చూసాడు. కొంత సేపటికి, దాన్ని అక్కడ మూగివున్న జనమంతా ఒకళ్ళ తర్వాత ఒకళ్ళుగా చూడసాగారు.

చూసిన వాళ్ళంతా నోళ్ళు వెళ్ళబెడుతున్నారు. నాకు ఆ ఫోటోలో ఏముందో అర్థంకాక అయోమయంలో పడ్డాను. తిరిగి తిరిగి చివరకు అది నా చేతిలోకి వచ్చింది. ఫొటోలోకి చూసాను.

అదిరిపడ్డాను!

ఫోటోలో నేను, నా ప్రక్క ఆమె మెడలో దండ లతో నిలవుడివున్నాం. బస్ట్ సైజుకి తీసిన ఫోటో అది!

పరీక్షగా చూసాను.

ఏమాత్రం సందేహం లేదు. అందులోవున్నది నేనే! ఎలా...? ఎలా జరిగిందిది? నాకు తెలియకుండా నన్నూ ఈమెను కలిపి దండలతో ఫోటో ఎలా తీయగలిగారు? ఎవరీమె? నిలబడలేక నీర్సంగా అరుగుమీద కూర్చుని గోడకు జారబడి కళ్ళు మూసుకున్నాను.

"డాంగ్ రాస్కెల్! నెమ్మదైనవాడు, మంచివాడు అనుకున్నాను ఇన్నాళ్ళూ. ఇంత మోసగాడని కలలో కూడా అనుకోలేదు. పెళ్ళిచేసుకుని మోజు తీరిపోయాక వదిలేసాడన్నమాట" అంటున్నాడు మా పక్కింటాయన.

ఇక మిగిలిన వాళ్ళంతా మాట్లాడ్డం మొదలుపెట్టారు.

ఆ మాటలు వింటుంటే వున్నపాటున అలా భూమిలో కూరుకుపోతే బావుండుననిపించింది. తల బ్రద్దలై చచ్చిపోతే హాయిగా వుండుననిపించింది. కానీ ఏదీ జరగలేదు.

నేను కళ్ళు తెరిచాను. మా రూమ్ యజమాని ఆమె సూట్ కేస్ చేత్తో పట్టుకుని "లోపలకురామ్మా!" అంటూ నా గదిలోకి వెళ్ళారు.

ఆమె నా వైపు ఒకసారిచూసి తల దించుకుని లోపలకు వెళ్ళింది.

## 5

కొంతసేపటికి జనం అంతా సర్దుకున్నారు. అంతవరకూ వాళ్ళన్న మాటలకు ఆత్మహత్య చేసుకుందామని పించింది. కానీ, ఈ మిస్టరీ ఏమిటో విడగొడితేనే గానీ నాకు శాంతి లేదు.

లేచి నెమ్మదిగా గదిలోకి వెళ్ళాను. ఓ మూలగా కూర్చున్న ఆమె నన్ను చూడగానే చటుక్కున లేచి నిల్చుంది. ఆమె పతిభక్తికి నాకు నవ్వొచ్చింది. "కూర్చో" అన్నాను తీవ్రంగా.

ఆమె బెదురుచూపులు చూస్తూ నిలబడే వుంది.

"నా ముద్దుల శ్రీమతిగారూ! తమ పేరేమిటో తెలుసుకోవచ్చా?" అన్నాను వెటకారంగా.

మళ్ళీ ఆమె కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి "ఏమండి!

ఏమిటీ అన్యాయం? ఇంకా ఎందుకిలా నటిస్తారు? నావలన ఏదైనా పొరపాటు జరిగుంటే క్షమించమంటున్నానుగా''
అంటూ మళ్ళీ నా కాళ్ళమీద పడింది.

పవిత్రమైన ఆమె భారత నారీ ధర్మాన్ని చూసి నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు నాకు.

''ఆల్ రైట్. నువ్వు నా పెళ్ళానివే! కాదనను. కానీ నీ పేరు మర్చిపోయాను.దయచేసి నీ పేరు తెలియజేస్తావా?''
అన్నాను.

ఆమె ఇంకా ఏడుస్తూ ''మన పెళ్ళయిన కొత్తలో వసంతా, వసంతా అంటూ ఒక్క క్షణంకూడా నన్ను విడిచి వుండే వారు కారు. ఇప్పుడేమో అంతా మర్చిపోయినట్లు పేరేమిటని అడుగుతున్నారా?'' అంది.

ఓహో! ఈవిడగారి పేరు వసంతన్నమాట. ''చూడండి వసంతగారూ...'' అన్నాను.

మళ్ళీ ఆమె గొల్లుమంది.''ఏమిటండీ ఈ చిత్రవధ...''
అంటూ ఏదో అనబోయింది.

నేను మధ్యలో ఆమెను అడ్డుకుని ''అరెరే! పొరపాటయింది వసంతా! చాలా కాలానికి కలుసుకున్నాం కదా! మర్చిపోయి వసంతగారూ! అన్నాను. ఇకనుంచి వసంతనే అంటానులే! చూడు వసంతా!''

చూసింది.

''మనిద్దరం భార్యాభర్తలమని నువ్వే వుద్దేశంతో పది మందిలోనూ చెప్పావో నాకు తెలియలేదు. ఆ ఫోటో కూడా ఎలా సృష్టించావో నా కర్థం కావటం లేదు. నేను చాలా పేదవాడిని. నాపొట్ట పోషించుకోవటమే చేతగాని వాడిని. మరి. నువ్వు ఏం ఆశించి నా దగ్గర చేరావో

నా కర్థం కావటం లేదు. దయచేసి ఇప్పుడైనా నిజం చెప్పు అన్నాను అనునయంగా.

ఆమె ఆశ్చర్యంగా చూసింది నా వైపు.

"మీరీ మాటలు నిజంగా మనస్ఫూర్తిగా అంటున్నారా? మన పెళ్ళికి ముందు మీరు చెప్పిన తీయటి మాటలన్నీ మర్చిపోయారా? అసలు నేనే గుర్తులేనా?" అంది.

"ఔను. నిన్ను చూడటం ఇదే ప్రథమం" అన్నాను.

"అయ్యో! భగవంతుడా! ఏమిటిలా మరిపోయారు? మీ మతిగాని చలించిందా? పిచ్చి పట్టిందా మీకు?" అంది వసంత ఏడుపు స్వరంతో.

'పిచ్చి' అన్నమాట వినగానే తగ్గిపోయాను.

ఈ మాట ఈ మధ్య చాలాసార్లు విన్నాను.

మొదటగా 2_30_1 ఇల్లు గురించి ఎవరో వ్యక్తిని అడిగితే అతడు పిచ్చిఆసుపత్రిలో చేరమని సలహా ఇచ్చాడు. ఆ తరువాత చలం అనే వ్యక్తి నా స్నేహితుడినన్నాడు. కాదనేసరికి మెంటల్ హాస్పటల్‌లో జాయిన్ అవమన్నాడు.

ఇప్పుడు వసంతా అదేమాట అంటోంది.

నిజంగా పిచ్చిపట్టిందా నాకు?

ఏమీ చేతకానివాడిలా 'పటప్' అని గట్టిగా అరిచి బయటకు వచ్చేసాను, విసురుగా.

## 6

నా రూమ్ చుట్టుపక్కలవున్న పెద్ద మనుషులకు భయపడి వసంతను నా రూమ్‌లోనే వుంచుకోవాల్సి వచ్చింది, నా కిష్టం లేకపోయినా. పగలంతా తిరిగి, తిరిగి రాత్రికి రూమ్‌కి చేరి అరుగుమీద పడుకునే వాడిని.

వచ్చిన రోజునే వసంత బజారుకెళ్ళి వంటకు కావాల్సిన సామగ్రి, రెండు మడతమంచాలు కొనుక్కొచ్చింది.

"వీటన్నిటికీ డబ్బెక్కడిది?" అడిగాను కోపంగా.

వసంత నవ్వి "నా దగ్గరవుంది లెండి" అని మాత్రం అంది.

ఆ రోజునుంచి మెస్ భోజనం మానేసి ఇంట్లోనే వసంత చేతికూడు తినసాగాను. వసంత దగ్గర ఎంత డబ్బుంటుంది? ఆ డబ్బు అయిపోయాక ఎక్కడ నుంచి తెస్తుంది? నేను మాత్రం పైసాకూడా ఇవ్వదల్చుకో లేదు.

రోజూ పగలంతా బయట తిరిగేవాడిని. ఆ రోజు తల నొప్పిగా వుందని మధ్యాహ్నం రెండు గంటలకే రూమ్‌కి జయలుదేరాను.

నేను వీధి మలుపు తిరిగి కొంతదూరం నడిచేసరికి నా రూమ్‌నుండి ఓ వ్యక్తి బయటకువచ్చి వడివడిగా నడుచు కుంటూ నన్ను దాటుకుని వెళ్ళిపోయాడు.

నాకు వసంతమీద అనుమానం వచ్చింది.

ఎవరితడు? నా ఇంటికెందు కొచ్చాడు? వసంతకు ఇత డికీ ఏమిటి సంబంధం?

రూమ్‌కి వెళ్ళేసరికి వసంత కూర్చుని బియ్యంలో రాళ్ళు ఏరుతోంది.

"ఇప్పుడు ఇంటికివచ్చి వెళ్ళిందెవరు?" సూటిగా అడి గాను.

వసంత వులిక్కిపడి, తమాయించుకుంది జవాబుమాత్రం ఇవ్వలేదు.

మళ్ళీ అదేప్రశ్న రెట్టించాను.

"నా స్నేహితురాలి భర్త" అంది ఎలాంటి తొణుకు బెణుకు లేకుండా.

"ఎందుకొచ్చాడు?"

"నేను టైలరింగ్ చేసేటప్పుడు నా స్నేహితురాలు నా దగ్గర వందరూపాయలు అప్పు తీసుకుంది. అదివ్వటాని కొచ్చాడతను" అంది.

జరుగుతున్న దంతా పజిల్‌లా వుంది నాకు.

ఈ సంఘటన గురించి ఆలోచించటంతో తలనొప్పి ఎక్కువైనా ఇంట్లో వుండలేక బయటకు వచ్చేసాను.

## 7

ప్రతిరోజూ ఉదయం పదిగంటలకు చిదానందంగారి షాప్‌కి వెళతాను.అక్కడ పని పూర్తయ్యేసరికి పన్నెండు గంటలవుతుంది. ఆ రోజు అలవాటుగా చిదానందంగారి షాపుకు బయలుదేరాను.

కొంత దూరం వెళ్ళేసరికి ఓ వ్యక్తి నా ఎదురుగా వచ్చాడు.

"మీ పేరు విజయ్‌కదూ?" అన్నాడు.

నా తల తిరగసాగింది. మళ్ళీ ఏదో కొత్త కాంప్లికేషన్‌లా వుంది.

"ఔను" అన్నాను, తరువాత అతడు చెప్పబోయే దేమిటూ అని భయపడుతూ.

"మీతో కొంచెం మాట్లాడాలి!" అన్నాడావ్యక్తి.

"చెప్పండి" అన్నాను.

"ఇక్కడ కాదు. పార్క్‌లో కూర్చుని మాట్లాడు కుందాం. రండి" అన్నాడు.

"క్షమించాలి! నాకు వేరే పని వుంది. మీరేదైనా చెప్ప

దల్చుకుంటే ఇప్పుడే చెప్పండి. నాకు టైమ్ లేదు'' అన్నాను చిరాకుగా.

''మీ జీవితానికి సంబంధించిన ఓ ముఖ్యమైన విషయం వినాలని మీకుంటే నాతో రండి. లేదంటే మీయిష్టం'' అని ఆవ్యక్తి వెళ్ళిపోసాగాడు.

జీవితానికి సంబంధించిన ముఖ్యమైన విషయం అనగానే నాలో ఇంట్రెస్టు కలిగింది. చిదానందంగారి షాప్ కి వెళ్ళటానికి ఓ గంట ఆలస్యమయినా కొంపమునిగి పోయేదేమీ లేదు.

''ఆగండి. నేనూ వస్తున్నాను'' అని అరిచాను.

ఆ వ్యక్తి ఆగాడు.

ఇద్దరం కలిసి పార్క్ కి వెళ్ళాం. పార్క్ లో ఖాళీగా వున్న స్థలంలో ఇద్దరం చతికిలబడ్డాం.

''ఇప్పుడు చెప్పండి'' అన్నాను.

''మిమ్మల్ని చూస్తుంటే చాలా మంచివారిలా కనిపిస్తారు'' అన్నాడా వ్యక్తి.

నేనేమీ మాట్లాడ లేదు. వింటున్నాను అతడు చెప్పే దాన్ని.

''చూసేవాళ్ళు మిమ్మల్ని చాలా సంస్కారం గలవారు అనుకుంటారు'' అన్నాడు మళ్ళీ.

అయినా జవాబు చెప్పలేదు నేను.

''మీ అసలు స్వరూపం చాలామందికి తెలియదు.''

నాకు విసుగుపుడుతోంది అతడి మాటలు వింటుంటే. లేచి వెళ్ళిపోదామనిపిస్తోంది. కానీ, అతడు నా జీవితానికి సంబంధించిన ముఖ్యమైన విషయం ఏదో చెప్తానన్నాడు. అదేదో వినిపోదామన్న కుతూహలం నన్ను బలవంతంగా

అక్కడ కూర్చోబెట్టింది.

అప్పుడు పేల్చాడు అతడు ఆటంబాంబు.

"మీరు హంతకులని ఎవరికీ తెలియదు. మీకు, నాకు తప్ప" అన్నాడు.

తల దిమ్మెక్కిపోయింది నాకు. ఏమిటి ఇతడంటున్నది? నేను హంతకుడినా? రోడ్డుమీద చీమ కనపడితే ముందుకి వేయబోయిన కాలు వెనక్కి తీసేసుకుంటానే? అటువంటి నేను హంతకుడినా? ఇతడు బహుశా జోక్ చేస్తుండొచ్చను కున్నాను.

ఆదే అడిగాను అతడిని.

"జోక్ చేస్తున్నారా?"

అతడు నవ్వేడు "మీరు నీలకంఠాన్ని మొన్నరాత్రి హత్య చేసారనేది జోకా?"

"షటప్! హాస్యానికికూడా ఓ హద్దుంటుంది, పైగా మనిద్దరం ఇంతకుముందు వరకూ అపరిచితులం. ఇకనైనా మీ వేళాకోళం కట్టిపెట్టి అసలు విషయం ఏదైనావుంటే చెప్పండి. లేదంటే నా దారిన నేనుపోతాను" అన్నాను సీరియస్‌గా.

"మిస్టర్ విజయ్! మీతో పరిహాసాలు ఆడటానికి నేను మీకు బావమరిదినీ కాను, మావగారినీ కాను. మీరా హత్య చేస్తుంటే నేను కళ్ళారా చూసాను. అఫ్‌కోర్స్! నేనలా అన్నంత మాత్రాన మీరెలాగూ నమ్మరు. అందుకే నేను చూసిన ఆ అద్భుత దృశ్యాన్ని అందంగా కెమేరాలో బంధించాను," అంటూ జేబులోంచి ఓ కవర్ తీసి నా చేతికిచ్చాడు.

నేనా కవర్ అందుకుని ఓపెన్ చేసాను. అందులో ఓ

ఫోటో వుంది. ఆ ఫోటోలో...

అంతు తెలియని అగాధాల్లోకి జారిపోతున్నట్లనిపించింది నాకు. ఆకాశం, పార్కులోని చెట్లు విరిగిమీద పడుతున్నట్లనిపించింది. కొంత సేపటికి ఫోటో మసగ్గా కనిపించసాగింది.

ఆ ఫోటోలో ఓ వ్యక్తి చచ్చిపడున్నాడు. అతడి గుండెల్లోంచి రక్తం కారుతోంది. గుండెల్లో దిగబడివున్న కత్తి పిడి పట్టుకొని ఆ శవంముందు ఒంగి శవంకంక క్రూరంగా చూస్తున్నాను నేను.

మరింత పరీక్షగా చూసాను ఫోటో వైపు.

సందేహం లేదు. ఆ ఫోటోలో వున్నది నేనే! అంటే ఆ హత్య చేసింది నేనేనా! ఎప్పుడు చేసాను? ఎవర్ని చేసాను? ఎందుకు చేసాను?

అతడు నవ్వుతున్నాడు "ఇప్పుడైనా అర్థమైందా మిస్టర్ విజయ్? ఈ క్షణంలో నిన్ను పోలీసులకు పట్టించగల సమర్థత ఈ ఫోటోద్వారా నాకుందని తెలుసుకున్నావు కదూ!" అన్నాడు.

ఈ ప్రపంచమంతా ఏకమై నాకేదో ద్రోహం చేయబోతున్నట్లనిపించింది. ఏం జరుగుతోంది నాకు? నాకు తెలియకుండా ఈ సంఘటనలన్నీ ఎలా జరుగుతున్నాయి?

"ఇంతకూ నన్నేం చెయ్యమంటావ్?" అసహనంగా అన్నాను.

"గుడ్! అలా దారికిరా! నీ లాంటి కుర్రాళ్ళు నాకు చాలా అవసరం. ఇకనుంచి నువ్వు నేను చెప్పినట్లు నడుచుకోవాలి! నెలకు రెండువేలు జీతం ఇస్తాను. రెండు రోజుల్లో నువ్వేం పనిచేయాలో మా మనిషి ఒకడు తెలియజేస్తాడు.

ఇక నువ్వు వెళ్ళొచ్చు'' అన్నాడు ఆ వ్యక్తి లేస్తూ.

''ఇంతకూ మీ పేరు?'' అన్నాను.

''అనవసరం. త్వరలో ప్రోగ్రామ్ నీకు అందుతుంది. దాని ప్రకారం అన్నీ సవ్యంగా చేసుకుపో! ఏ మాత్రం అవకతవకలు జరిగినా ఈ ఫొటో పోలీసులకు అందుతుంది. నువ్వు కటకటాల వెనక్కి చేరుకుంటావ్?'' అని వెళ్ళి పోయాడా వ్యక్తి.

తలంతా భారంకాగా నెమ్మదిగా చిదానందంగారి షాప్ వైపు అడుగులు వేసాను.

షాప్‌లోకి అడుగు పెడుతుండగా గడియారం పదకొండు కొట్టింది.

''ఏం విజయ్! మళ్ళీ వచ్చావు?'' అన్నారు చిదానందం గారు.

నేను ఆశ్చర్యపోయాను మళ్ళీ రావటమేమిటాని ''ఏమిటండీ మీర నేది?'' అన్నాను.

''ఇంతకు ముందేగా నువ్వొచ్చి, ఈ రోజు ఒంట్లో బావుండలేదు అకౌంట్ రేపు వ్రాస్తాను,అని చెప్పి వెళ్ళావు మళ్ళీ వచ్చావేం?'' అన్నారు చిదానందంగారు.

''నేనింతకు ముందొచ్చానా? ఇంపాజబుల్! బహుశా మీరు పొరపడి వుంటారు. నేనిదే రావటం ఈ వేళ షాప్‌కి'' అన్నాను.

''చూడు విజయ్. రోజూ నిన్ను బాగా అబ్జర్వ్ చేస్తున్నాను నేను. అటువంటప్పుడు నీ విషయంలో పొరపాటు పడగలనా? పైగా ఇంతకు ముందుకూడా ఇదే డ్రెస్ వేసుకొచ్చావు. అయినా, నువ్వీమధ్య అదోలా వుంటున్నావు. ఏదో నీలోనువ్వే గొణుక్కుంటున్నావు. ఎందుకైనా మంచిది. ఓసారి మెంటల్ హాస్పిటల్‌లో చెకప్ చేయిం

చుకో!" అన్నారు చిదానందంగారు.

మెంటల్ హాస్పిటల్ పేరు వినపడగానే చల్లబడి పోయాను. ఆలోచిస్తూ రోడ్డుమీదకు వచ్చాను.

ఇదివరకు ఏదో పుస్తకంలో చదివాను. కొంతమంది వ్యక్తులు నిద్రలో లేచి ఏవేవో చేసి మళ్ళీ వచ్చి నిద్ర పోతుంటారట. తెల్లారాక రాత్రి జరిగింది వాళ్ళ కసలు గుర్తుండదు. అలాంటి స్లీప్ వాకర్‌నా నేను? నిద్రలో హత్య చేసానా?

అదే నిజమనుకుంటే సదాశివంగారు, 2_30_1 సంగ తేమిటి? వసంత గొడవేమిటి? ఇంతకుముందు చిదానందం గారి దగ్గరకు నేను వెళ్ళటమేమిటి?

అసలు నాకు కన్‌ఫ్యూజన్ ఎప్పటినుంచి మొదలైందో ఆలోచించసాగాను.

కరెక్ట్! ఆ రోజు సదాశివం కనిపించాడు. అతడు తనంత తానే నాకుద్యోగం ఇప్పిస్తానని ఓ ఆఫీస్‌కి తీసు కెళ్ళాడు. అక్కడ ఆఫీస్, ఆఫీసర్, క్లర్కులు, టైపిస్ట్, ఫ్యూన్ అందరూ వున్నారు. నాకక్కడ ఉద్యోగం ఇచ్చారు. మర్నాడు ఆ ఇంటికి వెళితే అక్కడ ఆఫీస్ లేదు.

మారుతీనగర్‌లోని 2_30_1 నెంబర్ ఇంటికోసారి వెళ్ళి చూసివస్తే మంచిదేమో!

అనుకున్నదే తడవుగా మారుతీనగర్ బయలుదేరాను. ఆ ఇంటిదగ్గర నిలబడి డోర్‌నెంబర్ చూసాను. అదే ప్లేస్‌లో అలాగే వుంది డోర్ నెంబర్. 2_30_1. లోపలకు చూసాను.

వరండాలో పడక కుర్చీలో ఓ నడివయసు వ్యక్తి

కూర్చుని వున్నాడు. ఇంతకు ముందు 'టులెట్' బోర్డ్ వున్నవైపు చూసాను. అక్కడ ప్లాస్టిక్ నేమ్ ప్లేట్ వుంది. దానిమీద 'డాక్టర్ శర్మ, ఎమ్. బి. బి. యస్. జనరల్ హాస్పిటల్' అని వుంది.

ఇందులోకి ఈ డాక్టర్ అద్దెకు వచ్చాడా?

గేటు తీసుకుని లోపలకు వెళ్ళాను. కుర్చీలో కూర్చున్నాయన నన్ను చూసి "ఎవరు కావాలండీ!" అన్నాడు.

"నా పేరు విజయ్!" అన్నాను.

"కూర్చోండి" అంటూ ఎదురుగావున్న మరో కుర్చీ చూపించాడు.

కూర్చుని "మీరీ ఇంట్లోకి వచ్చి ఎన్నాళ్ళయింది?" అని అడిగాను.

"నిన్ననే" జవాబిచ్చాడు.

"ఒక్కసారి లోపలకు వెళ్ళి మీ ఇల్లు చూడవచ్చా?" అడిగాను.

ఆయన మొహం ఆశ్చర్యంగా పెట్టాడు. "దేనికి?" అడిగాడు.

"చిన్న పనుంది ప్లీజ్! మీరు నా వెంటనే వుండండి. లోపల ఓసారి చూసి వెళ్ళిపోతాను" అన్నాను ప్రాధేయ పూర్వకంగా.

ఆయన విచిత్రంగా చూసి, "ఉండండి. ఇప్పుడే వస్తాను" అంటూ లోపలకు వెళ్ళాడు.

బహుశా ఈయనకు అందమైన కూతుళ్ళు వుండి వుంటారు. వాళ్ళు నా కంట బడకుండా ఏ పెరట్లోకో పంపించెయ్యటానికి వెళ్ళుంటాడు.

పదినిముషాలు గడిచాక తిరిగి వరండాలోకొచ్చి "రండి" అన్నాడు.

నేను ఆయన్ను అనుసరించాను.

ముందు పెద్ద హాలు. ఇంతకుముందు నేను వచ్చినప్పుడు ఈ హాల్లోనే పార్టీషన్ చేసి ఆఫీస్ ఎక్విప్‌మెంట్‌తో వుంది. ఆ హాలు ప్రక్కనే మరో మూడు గదులున్నాయి. ఆ గదులను చూడాల్సిన అవసరంలేదు. ఖచ్చితంగా ఇంతకుముందు నేను వచ్చిన ఇల్లిదే! మరి అతడేవరో ఈ ఇల్లు అంతకుముందు రెండు నెలలుగా ఖాళీగా వుందన్నాడు.

ఏమిటీ గూడుపుఠాణీ?

ఆలోచనల్లోంచి తేరుకుని ఆయనకు 'థాంక్స్' చెప్పి బయటకు వచ్చాను.

# 8

ఈ మిస్టరీ తేలాలంటే, నా చేతుల్లో వున్న ఒకేఒక ఆధారం వసంత.

ఆమెనుంచే ఎలాగైనా ఈ రహస్యం ఏమిటో తేల్చుకోవాలి! ఎలా? ఆమెను ఎన్ని రకాలుగా అడిగినా మౌనం తప్ప మరేమీ జవాబు చెప్పటంలేదు. ఇంకా గట్టిగా కసిరితే, 'మీరు మారిపోయారు' అంటూ ఘొల్లుమంటుంది.

అక్కడకే చాలాసార్లు ఆమెను నిశితంగా పరిశీలించాను. మామూలు సంసార స్త్రీలా ఇంట్లో పని, పాటలు చేసుకోవటం, మార్కెట్‌కి వెళ్ళి కూరగాయలు అవీ తీసుకురావటం చేస్తుంది. ఇంతవరకూ తనను ఒక్క పైసాకూడా అడగలేదు. ఇరుగు పొరుగువాళ్ళను మంచి చేసుకుంది బాగా.

చుట్టుపక్కల ఆడవాళ్ళందరికీ ఇప్పుడు వసంత అంటే ప్రాణం. మళ్ళీ నేను వసంత ఎవరో నాకు తెలీదన్నా

నంటే పరిసర ప్రాంతంలోని జనం నన్ను చావబాదటం ఖాయం. అంతగా అకట్టుకుందామె వాళ్ళను.

నా అంతట నేనుగా ఏ విషయమూ తెల్చుకోలేను. కాలం గడిచేకొద్దీ దానంతటదే తెలియాలి! కానీ, ఈలోపు నన్ను మెంటల్ హాస్పటల్లో చేర్చరు కదా!

అక్కడక్కడ తిరిగి రాత్రి ఏడుగంటలకు రూమ్‌కి చేరాను. నన్ను చూడగానే మంచంమీద పడుకుని వార పత్రిక చదువుతున్న వసంత లేచి భోజనం వడ్డించసాగింది.

నేను డ్రెస్ మార్చుకుని, లుంగీ వేసుకుని పెరట్లోకి వెళ్ళాను, కాళ్ళు కడుక్కోవటానికి.

పెరట్లో బకెట్, చెంబు వున్నాయి. సబ్బులేదక్కడ. రోజూ పెట్టే సబ్బు ఆ రోజు పెట్టటం మర్చిపోయినట్లుంది వసంత. సబ్బుకోసం గదిలోకి వెళ్ళబోతున్న నేను చటుక్కున ఆగిపోయాను.

లోపల వసంత చేతిలో ఏదో పొట్లం వుంది. ఆమె దాన్ని విప్పింది. లోపల తెల్లటి పౌడర్ ఏదో వుంది. ఆ పౌడర్‌ని కంచం ప్రక్క నేవున్న మంచినీళ్ళ గ్లాస్‌లో కలిపింది.

ఇదంతా నేను చూడటం ఆమె గమనించలేదు. నేను వెంటనే వెనక్కి తిరిగి పెరట్లోకి వచ్చేసాను. ఏం చేస్తోంది వసంత? ఆ పౌడర్ ఏమిటి? విషమా? నన్ను చంపదల్చుకుందా? అందువల్ల ఆమెకు కలిగే ఉపకారం ఏమిటి?

నా రూమ్‌లో నావి నాలుగు జతల బట్టలు తప్ప మరేమీ లేవు, విలువైనవి. కనీసం చేతికి వాచీ, ఉంగరం కూడా లేవు. మరి నన్ను చంపితే, ఆమెకు కలిగే లాభం

ఏమిటి? ఏమీ వుండదు, నాకు తెలిసినంతవరకూ.

అంటే...ఆ పౌడర్ ప్రాణాలు తీసేది అయి వుండక పోవచ్చు. మరేమిటి? బహుశా మత్తుమందు అయి వుంటుంది! అది త్రాగి నేను స్పృహ తప్పాక యేదో జరుగుతుంది. ఏమిటది?

చటుక్కున నాకో విషయం గుర్తు వచ్చింది.

రోజూ నేను భోజనం చేసి పడుకోగానే మత్తుగా నిద్ర పట్టేస్తుంది, ఈ మధ్య. బాగా తెల్లవారితే నేగాని మెలుకువ రావటం లేదు. ఇదివరకైతే రాత్రి పదిగంటలకు పడుకుంటే మధ్యలో ఖచ్చితంగా ఒకటి, రెండు సార్లయినా మెలుకువ వచ్చేది.

కానీ, వసంత వచ్చిన దగ్గర్నుంచి భోజనం చేసిన వెంటనే, ఎనిమిది గంటలకే మత్తుగా నిద్ర పట్టేయటమూ తెల్లారాక గాని మెలుకువ రాకపోవటమూ జరుగుతుంది.

అంటే...ప్రతిరోజూ నాకిచ్చే మంచినీళ్ళల్లో మత్తు మందు కలుపుతోందా వసంత?

లోపల ఏదో పాత్ర శబ్దమైతే...ఆలోచనల్లోంచి తేరుకుని, కాళ్ళు కడుక్కుని లోపలకు వెళ్ళాను. భోజనం వడ్డించి వసంత నా దగ్గర వుండదు రోజూ. పెరట్లోకి వెళ్ళి, అరటిచెట్టుదగ్గర కూర్చుంటుంది.

అక్కడ కూర్చుంటే నేను కనపడను ఆమెకు. గ్లాసులో వున్న మంచినీళ్ళు తూముదగ్గర వొంపేసి, గ్లాసు శుభ్రంగా కడిగి, శబ్దం కాకుండా కుండలో నీరు మళ్ళీ ముంచుకున్నాను.

ఈ రాత్రి ఏమైనా సరే, నిద్ర నటించి ఏం జరుగుతుందో గమనించాలి. నాకు నిజంగా పిచ్చి పట్టించిన ఈ

సంఘటనల అంతరార్థం ఏమిటో తేల్చుకోవాలి అని నిర్ణయించుకుని నెమ్మదిగా భోజనం ముగించాను.

అలవాటుగా ఓ మంచం, దుప్పటి, దిండు తీసుకుని అరుగుమీదకు వెళ్ళి పడుకున్నాను.

ఆలోచనల్తో తలంతా వేడెక్కిపోయింది. వసంత తలుపులు జారవేసి లోపల పడుకుంది. నేను ఎక్కువగా కదలకుండా నిద్ర నటిస్తున్నాను.

ఎదురుగావున్న ఇంట్లోంచి గోడ గడియారం ఎనిమిది కొట్టింది.

చెవిదగ్గర దోమలు 'జుంయ్' మంటూ రొద పెడుతున్నాయి. రోజూ మత్తుమందు ప్రభావంతో ఒళ్ళు తెలియకుండా నిద్ర పోతుండటంవలన ఈ దోమలబాధ తెలియటం లేదు.

లోపల వసంత కదిలిన జాడ లేదు. నేను పొరపడ్డానా? అది మత్తుమందు కాదా? అయితే మరేమిటి?

# 9

గడియారం పది కొట్టింది.

మరో పావుగంటకు గదితలుపు తీస్తున్న శబ్దం ఐంది. కళ్ళు మూసుకుని ఊపిరి బిగపట్టాను. మళ్ళీ తలుపుమూసిన చప్పుడు వినిపించింది. ఓ కన్ను సగం తెరిచి చూసాను. వసంత తలుపు గొళ్లెం పెడుతోంది.

వసంత ఓసారి అటు ఇటు చూసి రోడ్డుమీదకు నడిచి, ఎడమవైపుకి వెళ్ళింది. ఆమె వెళ్ళిన కొంత సేపటికి నేను దుప్పటి తీసుకుని భుజాలచుట్టూ కప్పుకుని రోడ్డుమీదకు వచ్చాను.

వసంత వడివడిగా నడుచుకుంటూ వెళ్తోంది.

నేనూ ఆమెను అనుసరించాను.

ఆమె ఒక్కసారికూడా వెనక్కుతిరిగి చూడలేదు. తన నెవరైనా వెంబడిస్తున్నారనే అనుమానంకూడా లేనట్లుంది ఆమెకు.

ఇరవైగజాల దూరంనుంచి నిశ్శబ్దంగా అనుసరిస్తున్నాను వసంతను. రోడ్డుమీద ఫస్ట్ షో చూసివచ్చే జనం అప్పు డప్పుడు నడిచో, రిక్షామీదో ఎదురవుతున్నారు. అంతకు మించి జనసంచారం లేదు.

దాదాపు ఓ అరగంట నడిచి ఊరి చివరగావున్న భవంతిలోకి వెళ్ళింది. నేను కాస్సేపు బయటే నిలబడి పోయాను.

కొంతసేపయ్యాక లోపలకు తొంగిచూసాను. బయట రెండు కార్లు ఆగివున్నాయి. భవంతిలో లైట్లు వెలుగు తున్నాయి. ఎవరూ లేరని నిర్ణయించుకున్నాక చప్పుడు చేయకుండా లోపలకు వెళ్ళాను.

మెల్లిక్కి మెయిన్ డోర్ నెమ్మదిగా తోసాను. లోపల గడియవేసినట్లుంది, తెరుచుకోలేదు. ఏం చేయాలో కాస్సేపు తోచలేదు. నెమ్మదిగా చెట్ల మధ్యనుంచి నడుస్తూ భవంతి వెనకవైపు చేరుకున్నాను.

చీకట్లో చుట్టూ చూస్తున్న నాకు వాటర్ పైప్ కన పడింది లీలగా.

జాగ్రత్తగా ఆ పైప్ పట్టుకుని పైకి ఎక్క నారం భించాను. అలవాటు లేని పనవటంవలన చేతులు నొప్పి పుడుతున్నాయి. సగందూరం ఎక్కాక క్రిందికి చూస్తే కళ్ళు తిరిగినట్లయి, క్రింద పడిపోతానేమోనని భయం వేసింది.

ఈ రాత్రే అసలు మిస్టరీ ఏమిటో తేల్చుకోవాలనే కృతనిశ్చయంతో వుండటంవలన పట్టుదలతో ఎక్కసాగాను.

ఎలాగైతేనేం కష్టపడి పైకి చేరుకున్నాను. కాస్సేపాగి ఆయాసం తీర్చుకుని చుట్టూ చూసాను.

ఆవైపు రెండు గదులున్నాయి. ఓ గది తలుపు నెమ్మదిగా తోసాను. తెరుచుకోలేదు. రెండో గదితలుపు గెంటగానే తెరుచుకుంది, నిశ్శబ్దంగా.

ఆ గదిలో—ప్రక్క గదుల్లోంచి వస్తున్న కాంతి కొద్దిగా పడుతోంది. అది స్టోర్‌రూమ్‌లా వుంది. బల్లలు, కుర్చీలు, టీపాయ్‌లు వున్నాయి.

ఆ గదికి అవతలివైపు తలుపులున్నాయి. అంటే— మిగిలిన గదుల్లోకి ఈ గదినుంచి కనెక్షన్ వుందన్నమాట. ఆ తలుపు లాగాను. రాలేదు. తలుపుకి చెవి ఆనించి ఆ గదిలోంచి ఏమైనా వినిపిస్తుందేమోనని ప్రయత్నించాను. ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి, నెమ్మదిగా.

క్షణంసేపు ఏంచేయాలో పాలుపోలేదు. తలెత్తి పైకి చూసాను. పైన వెంటిలేటర్ వుంది.

చుట్టూ చూసాను. ఓ మూలగావున్న కుర్చీ ఆకర్షించింది నన్ను. శబ్దం చేయకుండా దాన్ని ఎత్తిపట్టుకుని వెంటిలేటర్ క్రింద పెట్టాను. నెమ్మదిగా దాని పైకెక్కి చూసాను. వెంటిలేటర్ ఇంకా ఎత్తులో వుంది.

మళ్ళీ క్రిందకు దిగి ఆ ప్రక్కగావున్న ఓ పీటను కుర్చీమీద పెట్టి ఎక్కాను. ఈసారి కరెక్ట్‌గా వెంటిలేటర్ ఎత్తుకి సరిపోయింది.

లోపలకు నా దృష్టి సారించాను.

అక్కడున్న కుర్చీలలో నలుగురు కూర్చుని ఏవో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళను పరీక్షగా చూసాను.

చివరగా కూర్చున్న వ్యక్తిని చూడగానే అదిరిపడ్డాను. కళ్ళు నులుముకుని చూసాను. అక్కడ...అక్కడ... నేను కూర్చునివున్నాను.

నేను ఇక్కడుంటే__అక్కడెలా కూర్చున్నాను?

ఛ! ఛ! నిజంగా నాకు పిచ్చెక్కినట్లుంది. లేకపోతే మరీ పామరుడిలా ఆలోచిస్తున్నాను. అక్కడ కూర్చున్న వ్యక్తి ముమ్మూర్తులా నన్నే పోలివున్నాడు. ఆ ఒడ్డు, పొడవు అంతా నాలానే వున్నాడు. నేను వేసుకున్న బట్టలే వేసుకున్నాడు.

అంటే...సరిగ్గా నాలాంటి వ్యక్తినే తయారు చేసారన్నమాట. హత్య చేస్తుండగా తీసిన ఫొటోలో వ్యక్తి ఉదయం చిదానందంగారి షాప్‌లోకి నాకంటే ముందుగా వెళ్ళిన వ్యక్తి ఇతడేనన్నమాట.

అతడి ప్రక్కన కూర్చున్న వ్యక్తికి సుమారు ఏభై ఏళ్ళుంటాయి. అతణ్ని నేనెప్పుడూ చూడలేదు. అతడి ప్రక్కన 25 ఏళ్ళ యువకుడు కూర్చున్నాడు. అతడినీ ఇదే మొదటిసారి నేను చూడటం.

అతడి ప్రక్కనే కూర్చునివుంది వసంత.

# 10

ఉదయం పది గంటలైంది.

అప్పుడే స్టేషన్‌లోకి అడుగుపెట్టిన నన్ను చూసి, ఇన్‌స్పెక్టర్ లేచి నిల్చుని సాదరంగా ఆహ్వానించాడు.

"ప్లీజ్ టేక్ యువర్ సీట్" అన్నాడు ఎదురుగా వున్న సీట్‌ని చూపిస్తూ.

కూర్చున్నాను.

ఇన్‌స్పెక్టర్ ఎవరో పిలిచి రెండు కూల్‌డ్రింక్‌లు తెమ్మన్నాడు.

నాకీ సస్పెన్స్ భరించలేనిదిగా వుంది.

"ఎందుకు సార్ నన్ను పిలిపించారు? వాళ్ళు దొరికారా?" అడిగాను.

"అంతా దొరికారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఎవరు వాళ్ళు?" అడిగాను.

"వాళ్ళెవరో చెప్పేముందు మీకో శుభవార్త చెప్పాలి!" అన్నాడు నవ్వుతూ ఇన్‌స్పెక్టర్.

"ఏమిటది?" అడిగాను.

"మీ రిప్పుడు లక్షాధికారులు" అన్నాడు.

ఆశ్చర్యపోయాను. నేను లక్షాధికారినా? ఎలా? అదే ప్రశ్న ఆయన్ను అడిగాను.

ఆ రాత్రి ఊరు చివర భవంతిలో వసంతవాళ్ళను చూసాక చివరలో వాళ్ళు మాట్లాడుకున్నదాన్నిబట్టి మర్నాటి రాత్రికూడా వాళ్ళక్కడ సమావేశం కాబోతున్నారని తెలుసుకున్నాను.

జాగ్రత్తగా మళ్ళీ ఆ భవంతిలోంచి బయటపడి' మర్నాడు ప్రొద్దుటే పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి అంతకుముందు వరకూ నాకు జరిగిన విచిత్ర సంఘటనలన్నీ చెప్పి ఆ రాత్రి కూడా వాళ్ళు అక్కడ సమావేశం కాబోతున్నారనే విషయంకూడా చెప్పాను.

ఈ రోజు ఉదయం ఇన్‌స్పెక్టర్ నన్ను రమ్మని కబురు చేస్తే వచ్చాను స్టేషన్‌కు.

ఇంతలో డ్రింక్స్ వచ్చాయి. అవి త్రాగాక మొదలు

పెట్టాడు ఇన్ స్పెక్టర్.

"మీ పెదనాన్నగారికి సంతానం లేదు. ఆయనకు మీరంటే చాలా ఇష్టం. అప్పుడప్పుడు మీకు ధనసహాయం కూడా చేస్తుండేవారు. ఆ తరువాత మీరు ఈ ఊరు వచ్చేయడంతో మీకు, ఆయనకు దాదాపు సంబంధాలు తెగిపోయినట్లే.

"సంతానం లేనందువల్ల ఎవరినైనా దత్తత చేసుకోవాలనే ఆలోచన వచ్చింది మీ పెదనాన్నగారికి. ఆయనకు మీమీదే ఆలోచన. కానీ, మీ పెద్దమ్మగారికి మీరంటే యిష్టంలేదు. ఆవిడ మాటంటే మీ పెదనాన్నగారికి వేద వాక్కు. ఆమె ఇష్టప్రకారం ఆవిడ చెల్లెలు కొడుకుని దత్తత చేసుకున్నారు."

"చేతిలో డబ్బు ఆడటంతో మీ పెదనాన్నగారు దత్తత చేసుకున్న వాసు చెడు అలవాట్లకు లోనయ్యాడు. డబ్బు బాగా దుర్వినియోగం చేస్తున్నాడని మీ పెద నాన్నగారికి తెలిసి ఎన్నోసార్లు మందలించారు. అయినా అతడు దారికి రాలేదు. తను చేసే పనులకు మీ పెద్దమ్మ గారి మద్దతు వుండటంతో అతడికి హద్దు, అపూ లేకుండా పోయింది.

"కొంతకాలానికి మీ పెదనాన్నగారికి విసుగుపుట్టి అతడి చేతికి డబ్బు అందనివ్వకుండా చేసారు. అలా చేసినా మీ పెదనాన్నగారికి తెలియకుండా ఆయన భార్య డబ్బు ఇస్తుండేవారు. అదీ సరిపోకపోతే ఆయన పేరుమీద అందినంతవరకూ అప్పులు చేసాడు.

"ఈ విషయంకూడా తెలిసింది ఆయనకు. తన తర్వాత ఆస్తంతా దుర్వినియోగం కాబోతుందని అర్థమయింది ఆయనకు. దానికితోడు ఆయన ఆరోగ్యం నానాటికీ క్షీణి

స్తోంది. ఆ పరిస్థితుల్లో, ఆయన బాగా ఆలోచించి ఆస్థంతా మీ పేరున వ్రాసారు. విల్లు వ్రాసిన రెండురోజులకు ఆయన చనిపోయారు. మొన్న రాత్రి ఊరు చివర బిల్డింగ్ లో వసంత, మీ వేషంలో వున్నతను, మరో కుర్రాడు కాక నాలుగవ వ్యక్తి వున్నాడు చూసారా? అతడే ఈ మిస్టరీ కంతటికీ మూలకారణం.''

''ఎవరతను?'' అడిగాను.

''మీ పెదనాన్నగారి లాయర్. విల్లు ఆ విధంగా వ్రాసాక, ఆయన మీ పెద్దమ్మగారితోను, వాసుతోను జరిగిన విషయం చెప్పాడు. వాళ్ళు ముగ్గురూ కలిసి ఓ బ్రహ్మాండమైన ప్లాన్ వేసారు.''

నా కిదంతా కలలా అనిపించసాగింది. ఇన్ స్పెక్టర్ ఒక్కో విషయం చెబుతుంటే మతి పోతోంది.

''చట్ట ప్రకారం ఆస్థి మీది. మీ తరువాత వారసుడు, అంటే మీరు విల్లు వ్రాయకుండా చనిపోయారనుకోండి, అప్పుడు ఆస్థంతా వాసుకి దక్కుతుంది. అంటే మరో విధంగా చెప్పకోవాలంటే, ఆస్థి వాసుకి దక్కాలంటే మిమ్మల్ని చంపాలి. కానీ, మీరు హత్య చేయబడితే పోలీసులకు అనుమానం డైరెక్టుగా వాళ్ళమీదకే పోతుంది. అప్పుడే ఆ లాయర్ బుర్ర ఈ మాస్టర్ ప్లాన్ వేసింది.

''లా ప్రకారం ఆస్థి మీకు దక్కుతుంది. మీకు సడేన్ గా పిచ్చి పడితే, మీ తరువాత వారసుడైన వాసుకి ఆ ఆస్థంతా దక్కుతుంది. హత్య చేయటంకన్నా-కొంచెం కష్టమైనా, ఈ ప్లానే నిరపాయకరంగా కనపడింది వాళ్ళకు. వెంటనే రంగంలోకి దూకారు.

''ఆస్థి విషయం మీకు తెలియనివ్వలేదు. ప్లాన్ కి

నాందిగా ఓ వ్యక్తి మీ ముందు నడుస్తూ తన జేబులోని పర్స్ పడేసుకున్నాడు. మీరు నిజాయితీ గలవారని వాళ్ళకు తెలుసు. ఆ పర్స్ మీరు తీసి అతడికివ్వగా, కృతజ్ఞతగా అతడు మిమ్మల్ని ఆఫీస్ కి తీసుకెళ్ళాడు.

"నిజానికది ఇల్లే! ఆ ఇంటి వ్యవహారాలు చూస్తున్న వ్యక్తికి డబ్బిచ్చి లాంగ దీసుకుని, ఓ రోజు ఆ ఇంటిని వాడుకున్నారు. దాన్ని ఆఫీస్‌లా కనిపించే ఏర్పాట్లు చేసారు స్టాఫ్‌తో సహా. మర్నాడు మీ రక్కడకు వెళ్ళే సరికి ఒట్టి ఇల్లు కనిపించింది. అలా జరిగేసరికి మీ బ్రెయిన్లో సంచలనం కలిగింది. దానిగురించి తీవ్రంగా ఆలోచించే సరికి మీ మెదడు కండిషన్ కొంచెం దెబ్బ తింటుంది.

"ఆ వెంటనే మరో వ్యక్తిని నియమించి మీ ఫ్రెండ్ గా నటింపజేసారు. మీ ఒడ్డు, పొడవు వున్న మనిషిని ప్లాస్టిక్ సర్జరీతో మీలాగే తయారుచేసారు. ఓ వ్యక్తిని హత్య చేస్తున్నట్లుగా ఫొటో తీసి అది మీరేనని భ్రమింప జేసారు. మీరు పనిచేస్తున్న షాప్ కి మీకంటే ముందే ఆ వ్యక్తిని పంపించి మిమ్మల్ని కన్ ఫ్యూజన్ లో పెట్టారు.

"ఆ తర్వాత వసంతను ప్రయోగించారు. అసలు వాళ్ళు వేసిన ప్లాన్ ప్రకారం వసంత మీకు దగ్గరగా వుండి అనుక్షణం మిమ్మల్ని కన్ ఫ్యూజ్ చేయాలి. ఆ హడావుడిలో మీ బుర్ర పనిచేయటం మానేయాలి. మరో నాలుగైదు రోజులుంటే నిజంగా ఆ పని జరిగేదే! కానీ, మీరీలోగా మేల్కొని, జాగ్రత్తపడి మాకు రిపోర్ట్ ఇచ్చారు.

"మీ స్థానంలో మరో అర్భకుడెవరైనా వుండివుంటే, కథ ఇంతవరకూ వచ్చేదికాదు. రెండు, మూడు సంఘటనలతోనే అతడి మతి చలించి వుండేది. ఖచ్చితంగా మెంటల్ హాస్పటల్లో చేరటమూ, ఆస్తంతా వాళ్ళ పరం కావటం

జరిగివుండేది. మీరు శాస్త్ర ధైర్యం, సాహసం కలవారు కనుక తట్టుకోగలిగారు" అని ముగించాడు ఇన్‌స్పెక్టర్.

ఇదంతా వినగానే నిజంగా ఇప్పుడు నాకు మతి చలించి నట్లయింది. ఆయన చెప్పిన ఏ ఒక్క విషయమూ నమ్మ శక్యం కాలేదు. నిజంగా నేనిప్పుడు లక్షాధికారినా? కేస్‌ని ఇంత త్వరగా విడగొట్టగలిగిన ఇన్‌స్పెక్టర్ వైపు కృతజ్ఞతగా చూసి అన్నాను:

"ఈ విషయాలన్నీ మీరింత త్వరగా ఎలా పరిశోధించ గలిగారు?"

"మీరు రిపోర్టు ఇచ్చాక, నిన్న పగలు మారు వేషంలో ఆ బిల్డింగ్ దగ్గరకు వెళ్ళాను. వెనుకవైపున్న ప్రహరీగోడ దూకి మీరు ప్రవేశించినట్లుగానే లోపలకు వెళ్ళాను. వెంటిలేటర్‌కి ఇవతలివైపున ఆటోమేటిక్ మినియేచర్ టేప్ రికార్డర్ ఎరేంజ్ చేసి వచ్చేసాను.

"రాత్రి పన్నెండు దాటిన తర్వాత మళ్ళీ ఆ ఇంట్లో ప్రవేశించి టేప్‌రికార్డర్ తీసుకుని వచ్చేసాను. దాన్లో రికార్డు అయిన సంభాషణలు వినగానే సగం కేస్ అర్థమై పోయింది నాకు. దాని సారాంశం ప్రకారం ఈ రోజు ఉదయం ఎనిమిది గంటలకు వాళ్ళు మళ్ళీ కలుసుకుంటారు. ఎనిమిది గంటలకు సిబ్బందితోసహా వెళ్ళి వాళ్ళ నలుగురినీ అరెస్ట్ చేశాను.

"ఇంటరాగేషన్‌లో కొద్దిమాత్రం ప్రయత్నంలోనే అసలు విషయమంతా వెళ్ళగక్కారు వాళ్ళు" అని ముగించాడు ఇన్‌స్పెక్టర్.

—: ఐపోయింది :—

# గుడ్డి వాళ్ళు!

సంపత్

"సిస్టర్! మంచినీళ్ళు!"

మెల్లిగా అన్నాను, అటూ యిటూ కదులుతూ బెడ్ మీద.

కాని ఎవరూ సమాధానం యివ్వలేదు. అసలు అలికిడి కూడా కాలేదు. ఒళ్ళంతా చెమట పోస్తోంది. సీలింగ్ ఫ్యాన్ తిరగటం లేదుకాబోలు.

మరోసారి పిలిచాను నర్స్‌ని పెద్దగా. సమాధానం నిల్.

నోరెండిపోతున్నట్లుంది. చేతులతో బెడ్ ప్రక్కన ఉన్న టీపాయ్‌ని తడిమాను. ఖాళీ మగ్ తగిలింది. నీళ్ళున్నాయో లేవో!

నోరు తెరిచి వంచుకున్నాను. ఏడెనిమిది చుక్కలు పడ్డాయి. ఫరవాలేదు. నోరు తడిసింది.

సిస్టర్‌ని పిలిచాను పెద్దగా, మరోసారి. ఈసారీ జవాబు రాలేదు.

చెవులు రిక్కించి విన్నాను. ఎటువంటి శబ్దమూ లేదు. ఇప్పుడు గమనించాను ఒక ఆశ్చర్యకరమయిన విషయాన్ని. ఏమిటది? ఎప్పుడూ రోడ పెడుతూ తిరిగే కార్లు, లారీలతో రణగొణగా ఉండే ప్రదేశం యిది. ఆవేళ పిన్ డ్రాప్ సైలెన్స్‌గా వుంది. చీమ చిటుక్కుమన్నా వినిపించేంత నిశ్శబ్దం. నన్ను వేరే చోటికి మార్చారా?

కళ్ళకి ఉన్న కట్లు పీకేసుకుందాం అనిపించింది ఆ నిశ్శబ్దాన్ని వింటుంటే. ఎందుకింత నిశ్శబ్దంగా వుంది? మూడో ప్రపంచ యుద్ధం జరిగి అందరూ నాశనమయ్యారా? నాకు పిచ్చెక్కుతున్నట్లుంది ఈ నిశబ్దాన్ని చూస్తుంటె. యుద్ధం మాత్రం వచ్చివుండదు. వస్తే, నేను ఉండే ప్రశ్నే లేదు.

నాలుగయిదు మారులు పిలిచాను సిస్టర్‌ని. రోజూ పిలవగానే వచ్చే సిస్టర్‌కి ఏమయింది? నిజంగా చాలా మంచిది ఆవిడ. ''నైటింగేల్''ని నేనెరగను కాని, ఈమె సేవలు చూస్తుంటె ఆమే అనిపించేది నాకు.

నాలో ఆత్రుత ఎక్కువయింది. చూడటానికి కళ్ళు లేవు. కంటి చుట్టూ కట్లున్నాయి. నెల క్రితం ఆక్సిడెంట్ జరిగింది నాకు.

కంటికి ప్రమాదమని ఆపరేషన్ చేశారు మూడు వారాల క్రితం.

మొన్న డాక్టర్ వచ్చి, మరో రెండు రోజుల తరు

వాత కట్లు విప్పుతానని అన్నాడు. అంటే రేపు.

బస్సులు, రైళ్లు, కేకలు, గోలలు యివేమి లేవు. అంతా నిశ్శబ్దంగా ఉంది. స్మశాన నిశ్శబ్దం.

రోజూ అలవాటయిన శబ్దాలు, ఈవేళ విన్పించక పోతుంటే, అదోలా వుంది. ఒక వేళ నాకు బ్రహ్మ చెముడు రాలేదు గదా?

అప్పుడే, ఎక్కడో, ఏదో పిట్టఅరుపు విన్పించకపోతే నాకు నిజంగా చెముడనుకునే వాణ్ని.

కాని... సిస్టర్ ఏమయింది? ఎందుకు రాలేదు? ఈరోజు సెలవు పెట్టి ఎటయినా వెళ్ళిందా? నాకు చెప్పకుండా వెళ్ళదే?

నేనే విప్పదీసుకుంటే, కట్లు?

ఉహుఁ! డాక్టర్ రేపు విప్పుతానని చెప్పాడు. తొందర పడటం దేనికి?

కాని నా మనస్సూరుకోవటం లేదు. ఏదో జరిగిందన్న ఆత్రుత, ఆందోళన.

చటుక్కున గుర్తొచ్చింది నాలుగు రోజుల క్రితం సంఘటన.

ఆ రోజు ఎంతో సంతోషంగా వచ్చింది సిస్టర్, నా దగ్గరికి. ఆమె ఆనందానికి కారణం అడిగాను. "ఆకాశంలో అద్భుతం!" అంది చిన్నగా నవ్వుతూ.

"అంటే?" అన్నాను ఏమీ అర్థంగాక.

ఆ రోజు సాయింత్రం ఆకాశంలో రంగు రంగుల ఇంద్ర ధనుస్సు కన్పిస్తోందని చెప్పిందామె. మామూలుగా ఇంద్ర ధనుస్సు కాదని, కనీసం పదిహేను వర్ణాలయినా ఉంటాయని చెప్పింది. అన్నిట్లోకి నీలవర్ణం బాగా కాంతి

వంతంగా కన్పిస్తుందని, దానిలోనుంచి స్పార్కిల్స్ మాదిరి వెలువడుతున్నాయని, ఆ దృశ్యం చూడకపోతే జన్మ వ్యర్థం అయినట్లుగా చెప్పిందావిడ.

ఆమె వర్ణిస్తున్న ఆ దృశ్యాన్ని ఊహించుకుంటుంటే అప్పుడే కండ్ల కట్లు పీకేసుకోవాలన్నంత ఆతృత కల్గింది. కాని ఆమె బలవంతం మీద ఆగిపోయాను.

నగరంలో ప్రజలు ఎక్కడి వారక్కడే ఆగిపోయి, ఆ దృశ్యాన్ని తిలకిస్తున్నారట! పేదా, గొప్పా; చిన్నా, పెద్దా తారతమ్యం లేక ప్రతి ఒక్కరు దానిని తిలకిస్తున్నారని చెబుతుంటే నాకు ఈర్ష్యగా, నామీద నాకే జాలి, కోపం రెండూ కలిగాయి...

ఆ రోజు అంత స్పీడ్ గా డ్రైవ్ చేయకపోతే, నాకీ ఆక్సిడెంట్ జరిగేది కాదు. నా కళ్ళకు ఆపరేషన్ జరిగేదీ కాదు. అందరితో పాటే నేనూ ఆ రంగుల ఇంద్ర ధనుస్సును చూచి ఆనందించే వాడిని.

ఆరోజు సాయంత్రం ఆ దృశ్యం వున్న సల్లైనిమి షాలూ పౌర జీవనం స్తంభించినట్లయిందిట. మరునాడు రేడియోలు, పత్రికల నిండా ఆవే వార్తలూ, ఆ ఫోటోలే నట. శాస్త్రజ్ఞులకు కూడా ఆ ఇంద్ర ధనుస్సు ఎలా సంభవించిందో అర్థం కాలేదుట.

మరునాడు కూడా ఆ సమయానికి, అదే దృశ్యం సంభవించిందని చెప్పింది సిస్టర్. ఆ హాస్పిటల్ లో అదే చర్చ. ఆ నీలివర్ణం, ఆ స్పార్కిల్స్ ని తప్పకుండా చూడాలని అనుకుంటుంటె నా మనసు ఎంత ఆతృత పడిందో, నా దురదృష్టాన్ని ఎంతగా తిట్టుకున్నానో చెప్పలేను.

ప్రపంచమంతటా సంచలనం రేకెత్తించిన ఆ

యింద్ర ధనుస్సుని చూడలేక పోయానే అన్న బాధతో నాకు నిద్రపట్టలేదు. మనసు కలతబారినట్లయింది. డాక్టర్ సలహాపై నాకు మత్తు మందు ఇచ్చింది సిస్టర్ నిన్న.

తిరిగి తెలివి వచ్చేసరికి పరిస్థితి యిది!

దాదాపు గంట గడిచినా ఎటువంటి శబ్దమూ లేదు.

నా మనస్సు కట్లు విప్పమంటోంది. వివేకం వొద్దని హెచ్చరిస్తోంది. కాని నా మనస్సులో ఏదో భయం. దానితోపాటే అనుమానం. జరగకూడనిది ఏదయినా జరిగిందా? ఒక్కసారిగా ఎందుకింత నిశ్శబ్దం?

కనీసం ఆ సంగతి తేల్చుకోవటానికయినా కళ్ళు విప్పాలి. చెమట పట్టుతోంది బాగా. దానికి తోడు దాహంకూడా మొదలయింది.

అది రాత్రో, పగలో, ఉదయమో, సాయంత్రమో తెలియటం లేదు.

చివరకు కట్లు విప్పుకోవాలనే నిర్ణయానికి వచ్చాను.

జాగ్రత్తగా విప్పాను కట్లు. కళ్ళమీద దూది ఉంది. దానిని కూడా తీశాను.

ఒక్కసారిగా వెలుగు చూడకూడదని నాకు తెలుసు. మంచం మీద వున్న దుప్పటిని నిండా కప్పుకున్నాను.

# 2

తెరుస్తున్నాను కళ్ళు! నెమ్మదిగా...అతి నెమ్మదిగా!!

అంచెలంచెలుగా, విప్పీ విప్పనట్లుగా విప్పుతున్నాను కంటి రెప్పల్ని.

విపరీతమైన నొప్పి కళ్ళల్లో! కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. దూదితో అద్దేశాను జాగ్రత్తగా. కళ్ళు మండుతున్నట్లున్నాయి.

కొంచెం తెరిచి, మరలా మూసుకున్నాను.

దాదాపు అయిదు నిమిషాల అనంతరం పూర్తిగా తెరిచాను. కళ్ళల్లో నీళ్ళు, మంట తగ్గలేదు. మరోసారి అద్దుకొన్నాను, దూదితో.

దుప్పటి ఉండటం వల్ల వెలుతురు సరిగ్గా పడటంలేదు. దుప్పటిని నెమ్మదిగా తొలగించాను.

కళ్ళచుట్టూ ఏదో పొర. కళ్ళమ్మట నీళ్ళు నిండుతున్నట్లు ఏదో పొర. ఏదీ సరిగ్గా కన్పించటం లేదు. అస్పష్టమయిన ఆకారాలు. ధారగా కారుతున్న నీటిని తుడుచుకున్నాను. కంటిలోని మంట తగ్గినట్లుగా వుంది.

కళ్ళని నెమ్మదిగా మూసి, మరలా నెమ్మదిగా తెరిచాను. అయిదు నిమిషాలలా చేయటం వల్ల, కళ్ళు తేటపడ్డాయి. ఇప్పుడు కళ్ళు బాగా కన్పిస్తున్నాయి కూడా! స్పష్టంగా చూడగల్గుతున్నాను ప్రతి వస్తువునీ.

గది తలుపులు వేసి వున్నాయి. లోపలికి వెలుతురు రావటం లేదు సరిగ్గా. ఫాను పని చేయటం లేదు.

ఒక్కటి మాత్రం నిశ్చయం. ఇది రాత్రి కాదు. పగలు గదిలో కొస్తున్న వెలుతురు వల్ల ఆ సంగతి నిశ్చయంగా చెప్పగలను.

నెమ్మదిగా కళ్ళు మూసుకున్నాను, మరో పావుగంట గడిచిన తర్వాత తెరిచాను. ఈ పావుగంటా నా తలలో విపరీతమయిన ఆలోచనలు.

అప్పటికీ ఎటువంటి అలికిడీ లేదు.

ఆకలికూడా విపరీతంగా వుంది. నిన్న సాయంత్రం అనగా తిన్నాను. రాత్రి మార్నింగ్ ఏమీ తినలేదు. మత్తులో వున్నాను. లేక సిస్టర్ రాలేదో?

కళ్ళు మూసుకునే ధ్వనులేమయినా విన్పిస్తాయేమో నని ఆలకించాను. ఊహుం! పిన్ డ్రాప్ సైలెన్స్. నా మనస్సేదో కీడుని శంకించింది.

కడుపులో విపరీతమయిన ఆకలి. ముందేదన్నా తినాలి. ఈ నిశ్శబ్దాన్ని భరించలేక పోతున్నాను. మందులుంచే 'టీపాయ్' చూశాను. మందులు తప్ప మరేమీ లేవు. ఖాళీ మగ్ కూడా.

అరగంట తర్వాత లేచి నిలబడ్డాను. బాగా నీరసంగా ఉంటం వల్ల తూలి పడబోయి, మంచం పట్టుకొని నిలబడ్డాను.

కళ్ళు కన్పిస్తున్నాయి గనుక, ఇప్పుడేమయిన చేసుకో గలను నాకోసం! ఇప్పుడు నా మనస్సు "వినవస్తున్న శబ్దాన్ని" గాని, మరో సంగతిగాని ఆలోచించటం లేదు.

ఆకలి! ఘోరమయిన ఆకలి. ఎంతటి ఘాతుకాన్నయినా చేయించగల ఆకలి.

తలుపుల వద్దకు నడిచాను నెమ్మదిగా. తలుపులు తెరిచాను. ఇంద్ర ధనుస్సు గుర్తుకొచ్చింది.

బయట ఎండకి కళ్ళు చెదిరినట్టయ్యాయి. కళ్ళు మూసుకుని, రెండు నిమిషాలనంతరం తెరిచాను నెమ్మదిగా. కాంతి అలవాటు పడేంతవరకు అక్కడే నిలబడిపోయాను.

ఉదయం పదిగంటలవుతుందేమో! నేనున్నది అయిదో అంతస్థు. ఆ అంతస్థులో ఉన్న జనమే తక్కువ. కాని యిప్పుడెవరూ లేరు. వరండా చివరకు పోయి, క్రిందికి తొంగి చూశాను నెమ్మదిగా.

రోడ్ మీద ఎవరూ కన్పించలేదు. నాలుగయిదు కార్లు అక్కడక్కడ ఆగి వున్నాయి.

లిఫ్ట్ పనిచేయటం లేదు. నీరసంగా, కాళ్ళీడ్చుకుంటూ మెట్లవద్దకు నడిచాను.

క్రింద అంతస్తులలో కూడా ఎటువంటి అలికిడీ విన్పించ లేదు. హాస్పిటల్ అంతా మూగపోయిందెందుకని? అసలు ఏం జరిగింది? చెవులు రిక్కించి విన్నా ఎటువంటి శబ్దం విన్పించటంలేదు.

ఇక్కడే కాదు...ఇంకెక్కడా...రోడ్ మీద, వీధిలో పేటలో, చివరికి నగరంలో కూడా ఎటువంటి శబ్దమూ లేదు.

అందరూ ఒక్కసారి చచ్చిపోయారా?

స్టోర్ రూం ఎక్కడుందో తెలుసు. అటు వైపు నడిచాను. దారిలో ఎవ్వరూ ఎదురు పడలేదు. క్రింది అంతస్థులో అటు వైపు చివరి గది స్టోర్ రూమ్.

ఒక్కొక్క మెట్టే దిగుతూ, వెళుతున్నాను. విపరీత మయిన నీరసం, ఆకలి.

పేషంట్స్ ఏమయ్యారు? వాళ్ళకి ఏమయింది?

చివరికి ఎలాగయితే నేం దిగాను. స్టోర్ రూం వైపు అడుగులేశాను. దానిని సమీపిస్తుండగా కలకలం విన్పించింది.

ఆనందంతో ఆగిపోయాను. అమ్మయ్య! నేననుకున్నది ఏదీ జరగలేదన్నమాట!!

ఆ కలకలంకూడా ఒక్క క్షణమే! స్టోర్ రూంనుంచే!! దాని దగ్గరకు నడిచాను. స్టోర్ రూం తలుపులు మూసి వున్నాయి. నెమ్మదిగా తెరిచాను. కిర్రుమంటూ తెరుచుకున్నాయి.

లోపల__

క్రిక్కిరిసినట్లున్నారు పేషంట్లు, హాస్పిటల్ సిబ్బంది. వీళ్ళంతా ఎందుకు చేరారిక్కడ?

"ఎవరూ?" అరిచా రెవరో.

ఉలిక్కిపడ్డాను. ఏం జవాబు యివ్వాలి?

"ఎవరంటే మాట్లాడరేం?"

మనిషి ఎదురుగావుంటే ఎవరని అడుగుతాడేమిటి? కళ్లుకూడా బాగానే వున్నాయి. పిచ్చెక్కిందా వీళ్ళకి.

"నేనే!" అనబోయాను.

కాని అంతలోనే నలుగురయిదుగురు, గుమ్మంవైపు అడుగులేయటంతో నా గొంతులోని మాట, గొంతులోనే ఆగిపోయింది.

"గాలికేమన్నా తెరుచుకుందేమో?" ఎవరో అంటున్నారు.

"కాదు. ఈ తలుపులు బలమైనవి. అంత సులభంగా తెరుచుకోవు!" తడుముకుంటూ వస్తున్నారు ఆ మనుషులు. కళ్ళు మామూలుగా వున్నా, చూపు వున్నట్లు లేదు. అంటే...!

అదిరిపడ్డాను. ఎవ్వరికీ చూపు లేదా? అంతా అంధులయ్యారు? ఎందుకో భయం వేసింది. చటుక్కున వెనకడుగు వేసి, రోడ్ మీదకు పరుగెత్తాను.

# 3

రోడ్ మీద చాలాదూరం పరుగెత్తాక కాని, దడ తగ్గ లేదు. వంట్లో వున్న నీరసం, ఆకలి ఎగిరిపోయాయి.

ఏమయింది వీళ్ళకి? ఎందుకు గుడ్డివాళ్ళయ్యారు? ఎక్కడా జనసంచారం లేదు. ఎక్కడ చెత్తంతా అక్కడే వుంది. లారీలు, బస్సు, కార్లు, సైకిళ్లు యెక్కడి

పక్కనే ఆగివున్నాయి అడ్డదిడ్డంగా.

నా మనసులోంచి యేదో భయం పుట్టుకొచ్చింది. అందరూ గుడ్డివాళ్ళు కాలేదు గదా కొంపదీసి? గుడ్డివాళ్ళయినా ఎక్కడికి వెళతారు? అసలెందుకు గుడ్డివాళ్ళయ్యారు?

ఆ ఇంద్రధనుస్సు గుర్తుకొచ్చింది. దాని ప్రభావమా? అయివుండదు. చాలాదూరం నడిచాను. ఎదురుగా స్వీట్స్ షాపు కన్పించటంతో మరలా ఆకలి గుర్తుకొచ్చింది.

దుకాణాలన్నీ తెరిచే వున్నాయేం? ఎవరూ లేరేమిటి? అనుకుంటూ షాపు దగ్గరికి నడిచాను. కడుపు పట్టినన్ని స్వీట్లు తిన్నాను.

ఆకలి తీరాక గాని జనం సంగతి గుర్తుకు రాలేదు. ఆలోచిస్తుంటే అంతా వింతగా వుంది. తెరిచివున్న దుకాణాన్నీ, షాపుల్నీ, ఆఫీసుల్నీ వదిలి వీళ్ళంతా యెక్కడికి పోయారు? రద్దీగా వుండే మెయిన్ రోడ్ యింత నిర్మానుష్యంగా వుండటానికి కారణం ఏమిటి?

ఎవరయినా యుద్ధం ప్రకటించారా? మరేదయినా జరిగిందా?!

ప్రక్కనే వున్న షాపులోనుంచి ధణేల్ మని యేదో క్రిందపడిన శబ్దం విన్పించింది.

ఉలిక్కిపడ్డాను చిన్నగా. ఎవరో వుండివుంటారు.

షాపు నేమ్‌బోర్డు చూశాను. ఏదో పెయింట్స్ షాపు అది. గబగబ లోపలికి నడిచాను. లోపల వెలుతురు సరిగా లేదు. ఆ మసక కాంతిలో కన్పించిన దృశ్యం చూసి అప్రతిభుడినై పోయాను.

పండు ముసలివాడు ఏదో తడుముతున్నాడు, అరలలో.

పెయింట్ డబ్బా నొకదానిని తీసుకుని, మూత తెరిచి, నోట్లో పోసుకోబోతున్నాడు. ఆ షాపులోకూడా ఇతరు లెవరూ లేరు.

అయితే ఈ ముసలివాడికికూడా కళ్ళు లేవా? లేక వృద్ధాప్యంవల్ల కన్పించటం లేదా?

చటుక్కున ముందుకురికి, అతని చేతుల్లోంచి డబ్బా లాక్కున్నాను.

"ఎవరూ?" కోపంగా అడిగాడా ముసలివాడు.

"నేనే!" అన్నాను; ఏమనాలో తెలియక.

"ఎవరయితేనేం? నా చేతుల్లో బాటిలుని యెందుకు లాక్కున్నావ్?"

ఏం చెప్పాలి? కళ్ళు పోయినందువల్ల బాటిల్ ఏదో, డబ్బా ఏదో; విస్కీ ఏదో, రంగు ఏదో తెలుసుకోనంతగా మారిపోయాడా?

"అది పెయింట్!" అన్నాను.

"పెయింటా? అయితే యిక్కడున్నవన్నీ పెయింటు డబ్బాలా?" అన్నాడు ముసలివాడు. అవునన్నాను.

"అయితే యిది పెయింట్ షాపా? ఇక్కడ వైన్ షాపు వుండాలే, ఎక్కడా?" తనలో తాను అనుకుంటు న్నట్లు, పైకి అన్నాడు ముసలి.

"ఇది గాదు. దీని ప్రక్క షాపు. తీసుకెళతాను. రా!" వృద్ధుడి చేయందుకుని, నడిపించబోయాను.

"తీసుకెళతా నంటున్నావ్? నీకు కళ్ళు కన్పిస్తు న్నాయా?" ఆ వృద్ధుడి గొంతులో అనుమానం తొంగి చూస్తోంది.

ఒక్క క్షణం ఏమీ మాట్లాడలేదు నేను.

తర్వాత అన్నాను. "ఔను!"

అంతే! ఆ వృద్ధుడి కేమయిందో తెలియదు, ఎగిరి నా గొంతు పట్టుకున్నాడు.

ఉక్కిరిబిక్కిరి అయిపోయాను, హఠాత్తుగా జరిగిన ఆ సంఘటనకి. ఒక్క తోపుకి ఎగిరి, దూరంగా డబ్బాలమీద పడ్డాడు ముసలి. డబ్బాలన్నీ దబదబ శబ్దంచేస్తూ క్రింద పడిపోయాయి.

వృద్ధుడికి నామీద కోపం ఎందుకో అర్థం కాలేదు. చేతికి దొరికిన డబ్బాలందుకొని నా మీదికి విసరటం మొదలు పెట్టాడు.

వృద్ధుడిమీద జాలిపోయింది నాకు. కోపంకూడా వచ్చింది. 'సహాయం చేయబోతే ఎందుకు వారిస్తున్నాడు? అత నేమయితే నా కెందుకు? చావనీ' అనుకొని బయటికి వచ్చాను. లోపలినుంచి డబ్బాల శబ్దం విన్పిస్తూనే వుంది.

ఎవరయినా, ఆ డబ్బాల శబ్దం విని వస్తారేమోనని చూశాను. పది నిమిషాలు గడిచినా ఎవరూ రాలేదు.

ఆ వృద్ధుణ్ని, అతని మౌనాన అతణ్ని వదిలి బయలు దేరాను. బయట షాపులన్నీ తెరిచే వున్నాయి. బట్టల కొట్లు, మందుల షాపులు, రేడియో షాపులు, హోటళ్లు, ఒక టేమిటి, నేటి మానవ జీవనానికి తోడ్పడుతున్న ప్రతి షాపు, ప్రతి వస్తువు నిర్జనంగా, నిర్జీవిగా వుంది.

వాటిని పరిశీలించా లన్పించింది. ఎవరయినా ఉన్నా రేమో!

మొట్టమొదటగా నేను వెళ్ళిన షాపు, జ్యూయలరీ షాపు.

కళ్ళు చెదిరే, మనస్సు బెదిరే పగలు, వజ్రాలు, ముత్యాలు, రకరకాల ఆభరణాలు. ఓహ్! ఒక టేమిటి,

సమస్త ఆభరణాలు అక్కడ వున్నాయి, జీవపదార్థం తప్ప.

అడిగేవారేలేరు. నా చేతికి పట్టినన్ని ఉంగరాలు తొడుక్కున్నాను. కాని అన్ని విడిచి బాగా నచ్చిన ఉంగరం తీసుకొని బయటపడ్డాను.

ఎదురుగా రెడీమేడ్ బట్టలషాపు. లోపలకు వెళ్లాను. రకరకాల దుస్తులు, ఆడా, మగా, చిన్నా, పెద్దలవీ! సూట్ తొడుక్కోవాలని నాకెన్నాళ్ళనుంచో కోరిక. అన్నీ తిరగేసి నాకిష్టమయిన నల్లరంగు సూట్ తొడుక్కుని టై కట్టుకున్నాను.

వెళ్ళి అద్దం ముందు నిలబడ్డాను.

అందులో నన్ను నేను గుర్తుపట్టలేకపోయాను. సూట్ తొడుక్కుంటే మనిషి యింతగా మారిపోతాను కాబోలు అన్పించింది.

ఆ క్షణంలో నాకెటువంటి భయాలు, ఆందోళనలూ లేవు. ఇన్నాళ్ళు అణగారి ఉన్న సరదాలను తీర్చుకుంటున్నాను. ఎన్నాళ్ళనుంచో మోజు పడినవి, డబ్బులేక తీర్చుకోలేకపోయిన కోరికల్ని తీర్చుకుంటున్నాను.

తరువాత గడియారాల షాపు. ఖరీదయిన వాచి, నా చేతిని అలంకరించింది. టైంని సుమారుగా ఊహించి, పెట్టుకున్నాను.

అలా వెళ్తుంటే సినిమా హాలొకటి కన్పించింది. బయట పెద్ద పెద్ద బానర్లున్నాయి. నిలువెత్తు కట్-అవుట్లున్నాయి అది ఒక ప్రముఖ నటుడు నటించిన సినిమా. పూలదండలు హాలుకి కట్టిన రంగురంగుల తోరణాలు కాయితాలు చూస్తుంటే, విడుదల అయి ఎక్కువ రోజులయినట్లు లేదు

నవ్వుకున్నాను. బయట వొక్క పురుగుకూడా లేదు.

ఆ నటుడున్నాడా? ఇతరుల్లాగే గుడ్డివాడయ్యాడా?

హాలులోకి నడిచాను, బాల్కనీలోకి. ఆ సీట్ల మెత్తదనాన్ని ఆస్వాదించాను. లోపల చీకటిగా వుంది, కరెంటు లేకపోవడంవల్ల.

రోడ్ మీద పడ్డాను మరలా.

తిరిగి, తిరిగి విసుగు పుట్టింది ఎంత తిరిగినా ఏముంది?

ఒంటరితనం పెద్ద శాపం అని అన్నారెవరో. ఆమాటలు నిజమేననిపిస్తున్నాయి యిప్పుడు.

ఒకప్పుడు యిలాంటి కలలు కనేవాడ్ని. ఎవరూ ఉండకూడదని, ఒక్కణ్ణీ, అన్నింటినీ అనుభవించాలని, యింకా ఏవేవో కలలు కనేవాణ్ని. కాని ఆ కలలు నిజమవుతాయని కాని, ఆ స్థితి ఇంత భయంకరంగా ఉంటుందని గాని ఊహించలేకపోయాను.

తిరిగి, తిరిగి అలసిపోయాను. మధ్యాహ్నం రెండుగంటలయ్యేసరికి ఆకలికూడా వేసింది! కాని తీర్చుకోవటం ఎంత సేపు?

ఈ జీవితం అంతా యింతేనా? ఎవరూ లేని ఈ నగర జీవితానికి, అడవుల్లో జీవితానికి తేడా ఏమిటి? తోడెవ్వరూ దొరకరా? ఇంకెవ్వరూ కళ్ళతో ఉండరా?

అందమయిన ఇంపాలా కారు కన్పించిందో చోట. ఎక్కి కూర్చున్నాను. ప్యూయల్ కూడా ఉంది నిండుగా. స్టార్ట్ చేశాను. శబ్దం కాకుండా పోతోంది మెత్తగా.

ఆనందంగా వుంది. వీధులన్నీ తిరిగాను. ఎవరూ కన్పించలేదు. నాలో ఒంటరితనం మొదలయింది మరలా.

ఎంత కాలం యిలా? అసలు నేనున్నది కలా, ఇలా? గిల్లి చూసుకున్నాను. నొప్పెట్టింది.

వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. అక్కడక్కడ

అలజడి విన్పించింది. వాళ్ళకి సహాయపడాలని వున్నా, ముసలివాడు గుర్తుకొచ్చి, కారు దిగలేదు.

అలా తిరుగుతుండగా—

హఠాత్తుగా ఒక సందులో నుంచి కేకవిన్పించటంతో కారాపాను. ఎవరిదో ఆడపిల్ల కేక అది.

ఆ సందులోకి పరుగెత్తాను. విశాలంగానే ఉందది.

ఆ సందులోని దృశ్యం విభ్రాంతుడ్ని చేసింది.

ఇరవై సంవత్సరాల యువతిని క్రింద పడవేసి, గొంతు నులుముతున్నాడో వ్యక్తి. నలభై ఏళ్ళుకు పైనే ఉంటా యతనికి. ఆ యువతి అరుస్తూంది. ఆ సందులో ఇంకెవ్వరూ ఉన్నట్టులేదు.

ఒక్క ఉదుటున వాడిమీద పడ్డాను. ఒక్క దెబ్బకే జరిగి అవతల పడ్డాడు. తడుముకుంటూ నా మీదకి రాబో యాడు. ఆ క్షణంలో నేను జేమ్స్‌బాండ్ నే అయి పోయాను. చిత్తు చిత్తుగా తన్నాను వాణ్ని.

నాకన్నా బలవంతుడయినా, గుడ్డితనం అతణ్ని కూల గొట్టింది!

ఆ యువతికి సాయం చేయబోయాను, దారి చూపిం చటంలో.

"అవసరంలేదు. నాకు కళ్ళు కనిపిస్తున్నాయి!" అందామె.

నా అన్వేషణ ఫలించింది. నా ఆశ తీరింది.

## 4

మరో అయిదు నిముషాలనంతరం యిద్దరమూ కారులో ఉన్నాం.

ఆ యువతివంక పరిశీలనగా చూశాను, డ్రైవ్ చేస్తూనే. తల వంచుకుని ఉండటంవల్ల నేనామెను పరి

శీలిస్తున్నట్లు, ఆమెకు తెలిసి వుండదు.

ఆమెకు అరవై సంవత్సరాలుంటాయి. పసుపురంగు మేని ఛాయ. అందమైనదని చెప్పలేనుగాని, యవ్వనం వలన నాకంటికి అందంగా అగుపిస్తోంది. కాని ఒకటి మాత్రం నిజం!

మగాణ్ని చిత్తు చేయగల ఒంపులు, సొంపులు లేక పోవచ్చుగాని, ఆమె అందం అంతా ఆ నల్లటి కురు ల్లోనూ, లేత ఎరుపు పెదాలలోనూ, విశాలమయిన కళ్ళ ల్లోనూ, ఎత్తయిన స్తనాలలోనూ దాగి వుందని మాత్రం చెప్పగలను.

ఆమె తల ఎత్తింది. మౌనంగా ఏడుస్తోంది. బుగ్గలమీద కన్నీటి చారికలు కన్పిస్తున్నాయి. వాటిని తుడుచుకో కుండానే డోర్ వంక చూస్తోంది.

"ఎక్కడికి వెళ్ళాం?" అన్నాను, ఎక్కడికి పోనివ్వాలో తెలియక.

ఆమె ఒక అడ్రసు చెప్పింది. ఆ అడ్రసుకి పోనివ్వ సాగాను. చాలా దూరం అది.

"అసలేం జరిగింది? ఎందుకు వీళ్ళంతా గుడ్డి వాళ్ళయ్యారు?" అని అడిగాను, సిగరెట్ ముట్టించు కుంటూ. ఆమె వెనక సీటులోకి చూడలేదుగాని, చూసి వుంటే బోలెడన్ని సిగరెట్ పెట్టెల్ని చూసి, నవ్వి ఉండేది.

నా ప్రశ్నకి జవాబుగా "మీకు తెలియదా?" అంది.

"తెలియదు నా కళ్ళకు ఆపరేషన్ జరిగింది. బెడ్ మీదే వుండిపోవటం వల్ల ఏం జరిగిందో తెలియదు. నేనే స్వయంగా కట్లు విప్పుకున్నాను!" అని హాస్పిటల్లో

నాకు తెలివి వచ్చిన దగ్గర్నుంచి జరిగిన సంఘటనలు, నా ఆలోచనలు ఆమెకు చెప్పాను.

కారుని మెల్లగా పోనిస్తున్నాను, స్పీడ్ గా పోతే ఎవరయినా అడ్డం పడవచ్చు.

ఆమె చెప్పసాగింది.

"నాకూ ఏం జరిగిందో స్పష్టంగా తెలియదు. వారం రోజుల క్రితం నాకు విపరీతమయిన తల నొప్పితో జ్వరం వచ్చింది. మంచం మీదనుంచి కదలేక పోయాను. నాకు టైఫాయిడ్ రావచ్చునని భయపడి మా తల్లిదండ్రులు నన్ను కదలనివ్వలేదు.

అయితే వారి మాటలవల్ల నాకో సంగతి తెలిసింది. ఆకాశంలో ఏదో అద్భుతమయిన ఇంద్రధనుస్సు కన్పిస్తోందట. దానిని గురించి ఎంతో వర్ణించి చెప్పారు. నాకూ చూడాలని వున్నా నన్ను కదలనివ్వలేదు.

అయిదారు రోజుల తర్వాత మామూలు మనిషినయ్యాను నేను. జ్వరం బాగా తగ్గిపోయింది కూడా. రోజూ వొచ్చే డాక్టరు ఆవేళ రాలేదు. తనకేమిటో అనిజీగా ఉందని, కళ్ళు సరిగా కన్పించటంలేదంది అమ్మ. నాన్నకూడా అదే మాట! అప్పుడేమీ అనుమానం రాలేదు నాకు. కాని తెల్లవారేసరికి, అంటే నిన్నటి ఉదయానికి ఇద్దరి కళ్ళూ పోయాయి."

ఆగిందామె. రోడ్ కి ఎదురుగా ఏదో గుంపు వచ్చింది. కారాపాను. ప్రక్క సందులోంచి గుడ్డివాళ్ళ గుంపు, ఎదురు సందులోకి పోతున్నారు. ఆ గుంపులో ఆడవాళ్ళు చిన్నపిల్లలుకూడా వున్నారు. ఒకరిచేతులొకరు పట్టుకొని, పోతున్నారు. ముందున వ్యక్తి, చేతికర్ర సాయంతో దారి

చూపుతున్నాడు. "ఎక్కడికో వాళ్ళంతా?" అన్నాను చిన్నగా.

"ఏమో!" అంది ఆమె.

ఆ చిన్నపిల్లల్ని చూస్తుంటే మనసంతా బరువుగా అయిపోయింది. ఇరవై నిముషాలు పైగానే పట్టింది. ఆ రెండు వందలమంది దాటడానికి.

గుంపు పోయాక, చిన్నగా నిట్టూర్చి, కారు బయలు బయలుదేర తీశాను. ఆమెని అడిగాను తరువాత చెప్పమని.

"చెప్పేందుకు యింకేముంది? నాన్న, అమ్మ మాటలు వినగానే నా మతి పోయినట్లయింది. అన్నయ్య మాటల వల్ల అందరికీ పోయాయని తెలిసింది. తరవాత అన్నయ్యకీ కళ్ళు పోయాయి. మా కుటుంబంలో కళ్ళు వున్నది నాకొక్కదానికే. బాగా భయపడ్డాను. చచ్చిపోదామని పించింది. కాని ఈ లోపున మరో సంఘటన జరిగింది.

బయటికి వెళ్ళిన నాన్న తిరిగి రాలేదు. అన్నయ్యకూడ వెళ్ళి తిరిగిరాలేదు.

వారిని వెతుకుతూ నేను బయట పడక తప్పలేదు. కాని యిందాక మీరు కొట్టిన వ్యక్తి తారసపడ్డాడు. క్రింద ఏదో వెతుకుతూంటే తీసి ఇచ్చాను ఆ రొట్టెను. నాకు కళ్ళు కనిపిస్తున్నాయా అన్నాడు. అవునన్నాను. అమాంతం నామీదపడి నన్ను పట్టుకున్నాడు. నేను, అతని వెంట వుండి, అన్ని తెలియ చెప్పాలని శాసించాడు.

నేను బెదిరిపోయి, అతడు చెప్పినట్లల్లా చేశాను. ఇంటి దగ్గర మా సంగతి చెప్పినా వినిపించుకోలేదు, బలవంతంగా నన్ను లాక్కొచ్చాడు. అతని బలంముందు నేను తల వంచక తప్పలేదు. ఎన్ని సార్లో అతని చేతుల్ని కొరికి పారిపోదామని ప్రయత్నించాను. అందువల్ల నా శరీరానికి

దెబ్బలే తప్ప మరే ప్రయోజనం కన్పించలేదు.

ఈరోజు అతను నన్ను బలవంతం చేయబోయాడు. కాని, నేను వారించటంతో కోపం వచ్చి నా గొంతు పట్టుకున్నాడు. కాని, యింతలోనే మీరు వచ్చారు!"

ఆగిపోయిందామె. ఆమె చెప్పిన అడ్రసుకి వచ్చేశాము. ఖరీదయిన బంగాళా అది. లక్షాధికారులు నివసించే భవంతి. ఎన్నడూ అడుగుపెట్టని యిల్లు.

ఇద్దరం లోనికి నడిచాము. భవనం అంతా నిశ్శబ్దంగా వుంది. ఆమె పిలిచినా ఎవ్వరూ పలకలేదు. భవంతి అంతా గాలించినా, ఎవరూ కన్పించలేదు మాకు.

"నాకు భయంగా వుంది. నా కోసం వీళ్లు బయటికి వచ్చారేమో?" అంది ఆమె.

నేను మాట్లాడలేదు. ఆ దగ్గర వీధులన్నీ చుట్టిముట్టి వచ్చాము. కాని, ఆమెవాళ్ళు కన్పించలేదు. బెంబేలు పడిపోయిందామె. ఏడ్చిఏడ్చి ఆమె కళ్లు ఉబ్బాయి.

"మనం యిక్కడ వుండటంవలన ప్రయోజనం లేదు. నగరం అంతా గాలించయినా వాళ్ళని పట్టుకుందాం!" అన్నాను.

కళ్ళు తుడుచుకుని, అలాగే అంటూ తల ఊపింది.

కారెక్కబోతుండగా అడిగాను. "ఇంతకీ మీ పేరు చెప్పనేలేదు!"

ఎక్కి కూర్చొని అంది: "రాధ. అనూరాధ!"

"గుడ్ నేమ్. నా పేరు రాజమోహన్!" అన్నాను ఎక్కి కూర్చుంటూ. మరుక్షణమే కారు ముందు కురికింది.

# 5

ఆ తర్వాత సాయంకాలం వరకు చుట్టు ప్రక్కల క్షుణ్ణంగా పరిశోధించినా, మా కామె తల్లిదండ్రుల జాడ

తెలియలేదు. నగర జనాభా అంతా ఇళ్లల్లోనే వున్నారు కాబోలు, రోడ్లమీద ఎక్కువగా కన్పించలేదు.

ఆ వెదుకులాటలో నేను చాలా యిబ్బంది ఎదుర్కోవాల్సి వచ్చింది. కళ్లున్నాయని తెలిస్తే చాలు, మమ్మల్ని చంపటానికికూడా వెనుదీయని మనుషుల మధ్య, మా మనుషులకోసం వెతకాల్సి వచ్చింది.

మాకు కళ్ళున్నాయని వాళ్ళకు ఎందుకో అంత కక్ష, నాకర్థం కానిది. వాళ్ళకు లేని కళ్ళు మా కెందుకుండాలి అన్న ఈర్ష్య కాబోలు. మేమూ గుడ్డివాళ్ళం అయితే వారి కానందంగా వుండేది.

కాని, వారి ఉద్దేశ్యం నెరవేరదు.

గుడ్డి మనుషులకి సాధ్యమయినంత దూరంగా కారాపి, వారిని పరిశీలించేవాళ్ళం. రాధకూడా పరిస్థితుల నర్థం చేసుకుంది. దూరంనుంచే తన తల్లిదండ్రులను, అన్నయ్యను గుర్తు పట్టటానికి ప్రయత్నించేది.

కాని, ఒకచోట మేము భయంకర స్థితినే ఎదుర్కోవాల్సి వచ్చింది.

చీకటి పడుతున్నందువల్ల ఆ రోజుకి చాలించి, మర్నాడు కొనసాగించుదామని నిశ్చయించుకున్నాము. ఆ సాయంత్రం తిండి కావాలి గనుక రాధ ఏదన్నా స్టోర్ కి పోనిమ్మంది. ఒక జనరల్ స్టోర్ ముందు ఆపి కావలసిన సరుకులను డిక్కీలో వేసుకున్నాము.

ఎక్కి స్టార్ట్ చేయబోతుండగా కన్పించింది అంధుల సమూహం! దాదాపు మూడు వందలమంది వుంటారు. గుంపుగా, నిశ్శబ్దంగా ఆ సందులోకి, అంటే మేమున్న సందులోకే ప్రవేశించారు.

అదృష్టవశాత్తు మా కారు ఫుట్ పాత్ కి ఆనుకు నేటట్లు

ఒక చివరగా వుంది. రాధకి సైగ చేసేను.

ఇద్దరమూ మౌనంగా వుండిపోయాము.

గుంపు మమ్మల్ని సమీపించింది. తడుముకుంటూ దారి తీస్తున్నారు ఇద్దరు.

నాకు వారిని చూస్తే చాలు జాలి, దుఃఖము కలుగుతున్నాయి, చేయని తప్పుకు శిక్ష అనుభవిస్తున్నారు గదా అని!

గుంపు సగం దాటి వెళ్ళింది మమ్మల్ని. మా కారుని కూడా తడిమి, చేతులుంచి మరీ పోతున్నారు.

అద్దాలన్నీ ఎత్తి వుంచటంవల్ల లోపలకు చేతులుపెట్టే అవకాశం ఎంతమాత్రమూ లేదు.

కాని, యింతలోనే ఆ సంఘటన సంభవించింది.

అనూరాధ, అటు చివర కూర్చున్నదల్లా, నా మీదకి వంగి, ఏదో చూపించబోయింది. కాని, ఆమె చెయ్యి హారన్ మీద పడింది పొరపాటున.

బొయ్‌మంది హారన్.

అంతే__

చటుక్కున ఆగిపోయింది గుంపు. కారు చుట్టూ చేరుతున్నారు. లోపల ఎవరో వున్నారని అర్థం అయిపోయి వుండాలి.

రాధ నా వంక చూసింది బెంబేలుపడుతూ. క్షణంలో అర్థం అయ్యింది మేమున్న పరిస్థితి. కారునే నాశనం చేసేట్టున్నారు. వంగి ఆమె చెవిలో చెప్పాను.

ఇద్దరం ఫుట్‌పాత్ వైపు దిగాము.

డోర్ తెరిచి, మూసిన శబ్దం అయి, "ఎవరు?" అని అరిచారెవరో.

నేను రాధ చెయ్యి పట్టుకున్నాను. చిరుచెమటలు

పోశాయి ఆమెకి. కొద్దిగా వణుకుతోంది. నాకూ లోలోపల భయంగా వున్నా, పైకి కన్పించనీయలేదు.

"నేనే! ఇక్కడేదో కారులా వుంటే తడిమాను. హారన్ మోగింది!" చిన్నగా అన్నాను.

నా మాటలు నమ్మినట్టు లేదు కొందరు. కారును చుట్టుముట్టారు అప్పటికే.

"కారులో ఎవరున్నారు?" అడిగారెవరో.

రాధ నోరు తెరిచి ఏదో అనబోయింది. చటుక్కున ఆమె నోరు మూసేశాను.

"ఎవరున్నారో నాకెలా తెలుస్తుంది? నేనూ మీలాగ గుడ్డివాణ్ణేగా?" అన్నాను కొంచం కోపంగా కంఠం పెట్టి

నా ఐడియా ఫలించింది. నా జవాబుతో తృప్తిపడ్డారు.. "సరే! పదండి. వెళ్దాం!" అన్నాను మరలా.

అద్దాలు ఎత్తి వుంటే, హారన్ ఎలా మోగిందన్న అనుమానం వారికి రానందుకు మనసులోనే ధన్యవాదాలు చెప్పుకున్నాను.

గుంపు కదిలింది తాబేలు నడకలా.

అరగంట తర్వాత రాధ బంగళాలోకి వచ్చి పడ్డాం! సామానులన్నీ లోపలికి చేర్చాము. తలుపులన్నీ జాగ్రత్తగా బిగించాము.

రాధ వంటచేసింది.

ఆ రాత్రి యిద్దరం సుష్టుగా తిన్నాం. బాగా అలిసిపోయి వుండటంవల్ల పైనున్న బెడ్‌రూం చేరి, బెడ్‌మీద పడుకోగానే నిద్ర పట్టింది. రాధవాళ్ళన్నయ్య నైట్‌గౌన్ తొడుక్కున్నాను. కొత్తగా వుంది.

నిద్రపట్టే సమయంలో రాధ వచ్చి నా నిద్ర చెడగొట్టింది. విసుగ్గా చూశాను ఆమె వంక.

"ఇలా రండి!" అంటూ మేడమీదే వున్న బాల్కనీ లోకి దారి తీసింది. ఏమిటోనని ఆశ్చర్యపోతూ వెళ్ళిన నాకు, నిజంగా వింతయైన సంఘటనే కన్పించింది.

నగరానికి తూర్పుదిక్కుగా చిన్న కొండలున్నాయి. వాటిమీద భవనాలు కట్టుకున్నారు అన్ని హంగులతో, కొందరు!

అన్నిటికంటే ఎత్తుగా వుండటంవల్ల దాదాపు నగరం అంతా కన్పిస్తాయి ఆ భవనాలు.

ఆ కొండమీదనుంచే, ఒక బంగాళాలోనుంచి కాంతి కన్పిస్తోంది.

మామూలు కాంతి కాదు. ఆర్క్ లైటు కాబోలు, లైట్ హౌస్‌లో తిరిగినట్లు అటూ, యిటూ తిరుగుతోంది.

నా నిద్రమత్తు ఎగిరిపోయింది.

చాలాసేపు నిల్చున్నాము అలాగే. దాదాపు అరగంట వెలిగి ఆరిపోయింది. అక్కడినుంచి యిక్కడికి, అంటే సుమారు మైలున్నరదూరం కన్పిస్తున్నదంటే అది నిశ్చయంగా ఆర్క్ లాంపే అయివుండాలి.

"ఎవరో సిగ్నల్ ఇస్తున్నారు!" అంది రాధ.

"అవును!" అన్నాను ఏమిటా సిగ్నల్ అని ఆలోచిస్తూ.

"రేపు ఉదయం అక్కడికి వెళదాం. వెళ్ళి పడుకో!" అన్నాను నా బెడ్ వైపు కదులుతూ.

కాని రాధ సందేహిస్తూ నిల్చుంది. ఆమె భయం నాకర్థం అయింది.

"లోపల తలుపు గడియాలు వేసుకుని పడుకో!" అన్నాను నిండా ముసుగు పెడుతూ.

# 6

మరునాడు ఉదయం రాధ మేలుకొలుపుతో మెలకువ వచ్చింది నాకు. మరోగంట తర్వాత, రాత్రి సిగ్నల్ విషయం తేల్చుకుంటానికై, కొండమీదికి పోయి రావా లనుకున్నాము.

కాని కొంతదూరం వెళ్ళగానే ఆగిపోయింది కారు. ప్యూయల్ అయిపోయింది. దాపుల్లో ఎక్కడా దొరకదు. అటూ ఇటూ చూశాను. రోడ్ మీద చాలా కార్లున్నాయి. చివరకు ఒక అంబాసిడర్ ని సెలెక్ట్ చేసుకున్నాను.

ఈసారి మాత్రం మా గురించి చాలామందికి తెలిసి పోయింది, కారు శబ్దంవల్ల.

గంటన్నర తర్వాత ఆ కొండ ఎక్కాము. మార్గ మధ్యంలోనే కన్పించింది, సుద్దముక్కతో రాసిన అట్ట ముక్క. రోడ్ కి ఒకప్రక్క స్తంభం పాతి, దానిని కట్టారు అక్కడ. ఫలానా నెంబర్ గల బంగళాకు రండి అని వుంది దానిమీద.

అది కళ్ళున్నవారికోసమే అన్నది నిస్సందేహం!

ఇరవైనిముషా లనంతరం ఆ బంగళా చేరేము. అన్నిటి కంటే ఎత్తుగా, ఎత్తులో వుందా బంగళా. బంగళా చుట్టూ చదునుగా వుంది. చిన్న కాంపౌండ్ వుంది. చుట్టు ప్రహరీ. ముందుభాగాన గేటు కివతలగా రోడ్ వుంది. రోడ్ కి రెండోవేపు లోయలా వుంది. అక్కణ్ణించి పది హేను అడుగుల క్రిందగా కొండమీదకు వేయబడిన రోడ్ కన్పిస్తోంది మెలికలు తిరిగి.

కారుని గేటుద్వారా లోనికి పోనిచ్చాను.

కారు శబ్దం విని అయిదారుగురు వరండాలోకి వచ్చారు.

అందరూ అపరిచితులే నాకు.

ఒకవ్యక్తి నన్ను రిసీవ్ చేసుకున్నాడు. "నా పేరు డాక్టర్ సుధామోహన్! నేనే వీళ్ళందరినీ ఆర్గనైజ్ చేస్తున్నాను!"

మేమూ మా పరిచయాలు చేసుకున్నాము.

లోనికి నడవగానే, విశాలమయిన హాలు కన్పించింది. దానిలో దగ్గరదగ్గరగా రెండువందలమంది వున్నారు ఆడా, మగా, పిల్లలూ అంతా కలిసి. ఆడవాళ్ళు, పిల్లలు తక్కువ.

ఆ రెండువందలమందిలోనూ చాలాభాగం రాత్రిపూట లైట్ చూసివచ్చిన వాళ్ళేనని తెలుసుకున్నాను తరువాత.

మరోగంట ఆగి చూశాము. ఎవరూ రాలేదు.

హాలు చివరగా చిన్న స్టేజ్ మాదిరిగా వుంది. దానిని ఎక్కాడు సుధామోహన్. చిన్నవాడే. ముప్ఫయి సంవత్సరా లుంటాయి.

హాలులో నిశ్శబ్దం ఆవరించింది. అందరినోమారు కలయ చూశాడు. రకరకాల వ్యక్తులున్నారు. డాక్టర్లు, లాయర్లు, స్వీపర్లు, క్లీనర్లు ఇలా రకరకాలుగా వున్నా ఆ క్షణంలో వారికి వృత్తిభేదాలు గాని, అంతస్థులు గాని అడ్డులేక అంతా కలిసి మెలిసి వున్నారు. ప్రపంచం బాగుండినపుడు కూడా ఇలా వుంటే ఎంత బాగుండేది అనుకున్నాను.

సుధామోహన్ గొంతు సవరించుకొని చెప్పసాగాడు.

"ఫ్రెండ్స్! మనం యిక్కడ ఎందుకు చేరవలసి వచ్చిందో మీ కందరకూ తెలుసు. మన ప్రపంచానికి ఘోరమైన ఆపద వాటిల్లింది. ప్రజలంతా ఒక్కసారిగా గుడ్డివాళ్ళయిపోయారు.

ఒకరో, యిద్దరో, పదిమందో అయితే వారికి చూపు తెప్పించటానికి ప్రయత్నించవచ్చు. కాని మన నగర జనాభానే కొన్ని లక్షలుంటుంది. ఇక ప్రపంచం మొత్తం మీద ఎంత వుంటుందో మీకు తెలుసు.

అంధులు కాకుండా మిగిలివున్న ప్రజాసమూహం ద్వారా ఒక కొత్త సమాజం ఏర్పాటుచేయాలని నిశ్చయించుకున్నందువల్ల రాత్రుళ్ళు లైటుసిగ్నల్ ద్వారాను, పగలు ఎర్రటిగుడ్డ ద్వారాను అందరినీ ఇక్కడకు రప్పించాము.

ఇంకా అంధులు కానివాళ్లు, ఆ సిగ్నల్‌ని చూడని వాళ్లు ఎంతోమంది వుండవచ్చు. వారినందరిని సేకరించి యిక్కడ చేర్చే బాధ్యత మనదే.

మనం ఏర్పరచ దలచుకున్న కొత్తసమాజం గురించి తరువాత వివరంగా చర్చించుకుందాం.

ప్రస్తుత మన కర్తవ్యం మన అవసరాలకు కావల్సిన వస్తువులు, ఆహారసామగ్రి సేకరించడం.

మనమంతా కలసి నూటతొంభై నలుగురున్నాము. ఈ సంఖ్య యింకా పెరగవచ్చు.

మన ఈ సంఘానికి అందరూ కార్యకర్తలే!

అందువల్ల మనం చేయవలసిన పనులను ఒక పథకం ద్వారా చేద్దాం. మనకు లభించే వనరుల్ని సేకరిద్దాం!''

అంటూ ముగించాడు డాక్టర్ సుధామోహన్.

మామూలుగా వుండే చప్పట్లులాంటివేమీ లేవు యిప్పుడు.

తరువాత కొంతమంది ఆహారసామగ్రి, ఇతర వస్తువులు సేకరించడానికి నియమించబడ్డారు. వారిలో నేనూ, రాధ

కూడా వున్నాము. కారణం మా యిద్దరికీ డ్రైవింగ్ రావటమే.

నగరాన్ని కొన్ని భాగాలుగా విభజించి, ఒక్కొక్కరికి ఒక్కో భాగాన్ని కేటాయించారు.

మరికొంతమంది కళ్లున్నవాళ్ళను తీసుకురావటానికి, మరికొంతమందిని ఇతర కార్యాలకై నియమించారు. ఈ పనులకు ఆడవాళ్ళను, పిల్లలను మినహాయించారు.

ఒక్కొక్కరికి ఐదురోజులు టైం యిచ్చారు. సరిగ్గా ఐదోరోజు సాయంత్రం అయిదింటికల్లా తమతమ వస్తువులతో అందరూ హాజరు కావాలి. ఆ రోజు రాత్రే కార్యక్రమాన్ని నిర్ణయించుకుని ఆ రాత్రే, వీలయితే మర్నాడో నగరాన్ని వదలటం జరుగుతుంది.

డాక్టర్ సుధామోహన్ అందరినీ పదేపదే హెచ్చరించాడు, ఎట్టి పరిస్థితుల్లో గ్రుడ్డివాళ్ళకు ఏ ఆపదా రాకూడదని.

మిగిలినవారి మాట ఎట్లున్నా, నాకు మాత్రం ఆయన మాటలు రుచించలేదు.

మమ్మల్ని చంపదలుచుకున్నవాళ్ళని దయతో వదిలిపెట్టటం పెద్ద ప్రమాదకరమయిన పని అని నా ఉద్దేశ్యం. కాని, ఆ అభిప్రాయాన్ని బయటకు వెలిబుచ్చలేదు.

ఆ తర్వాత నేనూ, రాధ బయలుదేరాము కారులో.

# 7

నాకు కేటాయించిన నగరభాగం వైపుకే తోలాను కారుని.

దారిలో నాలుగైదు గుడ్డివాళ్ళ గుంపు లెదురయ్యాయి. గుడ్డివాళ్ళయ్యాక ఐకమత్యం బాగా పెరిగినట్లయింది కాబోలు, అందరూ ఒకటయి జాయింటుగా ఆహారం

కోసం వెదుకుతున్నారు.

అంతకుముందు తాము న్న ప్రదేశాల్ని, స్టోర్స్‌ని గుర్తించు కున్న కొందరు వారిని లీడ్ చేస్తున్నారు.

"వారి కడుపుల్ని కొట్టి మనం బ్రతకటం ఏం బాగుం టుంది?" హఠాత్తుగా అంది రాధ.

"అలాగనకు! వారికి తిరిగి దొరికినన్నాళ్ళు తింటారు. మరి తర్వాత మాటేమిటి? కళ్ళు లేవు. పంటలుండవు. ఎందుకూ పనికిరారు. ఇంతకాలం ఎన్ని పాపపు పనులు చేసి యినప్పెట్టెలు నింపుకున్నారు. ఇప్పుడా డబ్బు వారికి కూడు పెడుతుందా? ఆ బేంక్‌ని చూడు. లోపల లక్షలకొలది రూపాయలు మురుగుతున్నాయి. ఎందుకు? ఎవరేం చేసుకుంటారు? ఆ డబ్బంతా పోసి గుప్పెడు బియ్యం లేగలరా?"

ఆగి ఊపిరి పీల్చుకున్నాను. రాధ నావంక విభ్రాంతిగా చూస్తూంది. దృష్టి రోడ్ మీదనుంచి తిప్పకుండానే అన్నాను మరలా.

"వారికా శాస్తి కావాల్సిందే! గుడ్డివాళ్ళకోసం మనం వగవటం ఎందుకు? ఇప్పటికయినా వారికి బుద్ధి వచ్చిందా? తనకు కళ్లుపోతే పోయాయి, ఎదుటివాడికి కొందుకు పోలేదు? వాడికి చూపెందుకుండాలి అని కళ్ళున్నవాడిని చంపటానికికూడా సిద్ధపడుతున్నారు. అటువంటివాళ్ళని జాలి దలచటం మహా పాపం. మనం చేస్తున్నదానిలో తప్పులేదు."

నన్ను నేను సంబాళించుకున్నాను.

నా మాటలవల్ల రాధాకూడా బాధపడిందని అర్థ మయింది. ఆమెకూడా ధనపంతులపిల్లే గదా!

"క్షమించు రాధా! నీ మనసు కష్టపెట్టాలని అనలేదు.

నాకీ సంఘాన్ని చూస్తేమంట!" అన్నాను.

రాధకూడా మౌనంగా వుండిపోయింది.

ఇంతలో ఎదురుగా మరో గుంపు ఎదురవటంతో కారుని ప్రక్కన ఆపాను. ఇటే వస్తున్నారు. నిన్న జరిగిన అనుభవం నాకింకా గుర్తుంది. రాధకూడా నా దగ్గరికే జరిగింది.

కాని ఆ గుంపు మాదగ్గరికి రాలేదు. ప్రక్కనున్న ఒక సందులోకి తిరిగింది.

మరో అరగంట తర్వాత లారీ స్టాండ్‌లోకి ప్రవేశించాము. అక్కడ మాకు కావలసిన ట్రక్కులు కన్పిస్తున్నాయి. ప్రక్కన పెట్రోల్ బంక్ కూడా వుంది. ఫ్యూయల్‌కి దిగులు లేదు.

ఒక ట్రక్ ఎక్కి బయలుదేరాము. కొంత దూరం పోయాక డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ కనిపించాయి. ట్రక్‌ని దాని ముఖద్వారం దగ్గరాపాను. స్టోర్స్ తలుపులు మూసి, తాళాలు వేసివున్నాయి, లోపల ఎవరూ వుండివుండరనుకున్నాను.

ఎక్కువ శబ్దం కాకుండా తాళం పగలగొట్టటానికి ప్రయత్నించాను. కాని పగల్లేదు అది.

మరోసారి వీధులన్నీ తిరిగి వెల్డింగ్ షాపులో ఉండే సిలిండర్స్‌ని పట్టుకొచ్చాను. దాని సహాయంతో తాళాలు కరిగించి లోపలకు దూరాను.

మరో రెండు గంటలు యిట్టే గడిచిపోయాయి. ట్రక్ నిండి పోయింది.

మరో అరగంట తర్వాత బయలుదేరాము. ట్రక్కుని కొండ దిగువ వున్న ఒక హైస్కూల్ కాంపౌండ్‌లో ఆపాలని అంతకుముందే నిర్ణయించుకుని ఉండటంవల్ల దానిని అక్కడ వదిలి వచ్చాడు.

ఈ విధంగా రెండు రోజులు గడిచాయి తరువాత. ఈ మూడు రోజులు క్షణంకూడా తీరికలేక గడిపాము. ప్రతి యింటినికూడా వదలకుండా వస్తువుల్ని సేకరించాము.

# 8

"రాము! దొరికారు. అదుగో మా నాన్న!" అరిచి ట్రక్ దిగబోయింది రాధ.

"రాధా!" ఆమెను ఆపటానికి ప్రయత్నించాను. కాని అప్పటికే క్రిందకు దూకిన రాధ, గుడ్డివాళ్ళ గుంపు వైపు పరుగెత్తింది.

"నాన్నా!" అంటూ పరుగెత్తుతున్న రాధ కంఠం వినటంతోనే తక్కున ఆగింది గుంపు.

రాధని పిలవబోయి ఆగాను. తండ్రి కన్పించిన ఆనందంతో తనని తానే మరచి పోయింది రాధ. వారి చేతుల్లో పడితే యింకేమన్నా ఉందా? ఆమెని పిలిచి నా ఉనికినికూడా ఎందుకు బయట పెట్టుకోవాలి?

పరుగెత్తి ఆమెను ఆపే టైంకూడా లేదు. వారిని సమీపించినదప్పటికే.

రాధని వదిలి పోవటానికి మనస్సు అంగీకరించ లేదు. రాధనేం చేస్తారు? చంపేస్తారా? ఆమె తండ్రి అడ్డు పడతాడా? ఆలోచిస్తున్నాను.

రాధ చుట్టూ మూగారు గ్రుడ్డివాళ్ళు. వారి మధ్య వున్న రాధ నాకు కన్పించలేదు.

శబ్దం చేయకుండా గుంపు వద్దకు నడిచాను అప్పటికి. రాధకి తాను చేసిన తప్పు అర్థమైంది కాబోలు, నా వంక చూడటానికి ప్రయత్నిస్తూంది. మాట్లాడవద్దన్నట్లు సైగ చేశాను.

ఆ గుంపు రాధను చుట్టుముట్టి, గట్టిగా పట్టుకున్నారు.

వారి మధ్య ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది రాధ!

నా వంక నిస్సహాయంగా చూస్తోంది.

రకరకాల ప్రశ్నలతో ఆమెను ముంచేస్తున్నారు వాళ్ళు.

"నీకు కళ్ళు కనబడుతున్నాయా? మీ నాన్నగారెవరూ? ఈ దాపుల్లో తినటానికి ఏమయినా దొరుకుతాయా?" అంటూ ఆమెను వేధిస్తున్నారు.

ఆ గుంపులోంచి బయటపడటానికి చూస్తోంది రాధ. కాని వాళ్లు ఆమెను పోనివ్వటం లేదు. ఎలా పోనిస్తారు? చంపనన్నా చంపుతారు... తెలివిగల వాళ్ళయితే తమకి దారి చూపించమని బలవంతం చేస్తారు.

సింద్‌బాద్, ముసలివాడు గుర్తుకొచ్చాడు నాకు.

చటుక్కున నాలో ఆలోచన వచ్చింది. సింద్‌బాద్ ఆ ముసలవాడికి సారాయి యిచ్చి తప్పించుకున్నట్టే వీరి బారినుండి రాధను రక్షిస్తే? కాని వీళ్ళు బ్రాందీ, విస్కీలు తాగుతారా?

గుంపు కదిలింది. రాధకూడా వారితో పాటే కదలక తప్పలేదు. నా వంక చూసుకుంటూ వెళుతూంది నేనూ వస్తున్నానంటూ సైగ చేశాను.

ట్రక్ ఎక్కి వారిని అనుసరిస్తూ పోతున్నాను.

ఆ పూటల్లా వదల్లేదామెని. రకరాకాలుగా వేధించుకుతిన్నారు. మా దురదృష్టం కొద్ది దోవలో ఒక్క వైన్ షాపూ కనిపించలేదు. అలాగయితే ఆమెకు సైగ చేసే వాడిని.

వాళ్ళు మాత్రం ఆమెని "అదేమిటి? యిదేమిటి? ఆకాశం ఎలా వుంది? నీకు కళ్ళెందుకు పోలేదు? కళ్ళున్న వాళ్ళు యింకెవరయినా వున్నారా?" అంటూ రకరకాల

ప్రశ్నలతో వేధించుకుతిన్నారని తరవాత రాధ చెప్పింది.

అందరినీ తోడ్కొని షాపులన్నీ తిప్పింది రాధ. అన్నింటినీ ధ్వంసం చేసి పారేశారు. తినటానికి దొరికిన ప్రతి వస్తువును నమిలి పారేశారు. వారిని చూస్తుంటే అసహ్యంతోపాటు జాలికూడా కలుగుతోంది! తాము చేయని నేరానికి శిక్ష అనుభవిస్తున్నారు గదా!

కాని నా మనస్సుని కఠిన పరుచుకున్నాను. బహుశా నా తల్లిదండ్రులు కూడా యిలాగే తిరుగుతుంటారు కాబోలు. ఇంతవరకు వారిని గురించే తలవలేదు. వారిని తీసుకొస్తే! కాని ఎక్కడని వెతకను వారిని!

అప్రయత్నంగానే నా కంటిలో నీళ్ళు వచ్చాయి. వాటిని తుడుచుకున్నాను. వాటితోపాటే మమతాను రాగాలు, బంధాలుకూడా తెంచుకోవాలి అనుకున్నాను.

అదృష్టవశాత్తు కొద్దిదూరంలో వైన్ షాపు కన్పించింది. వారిని అక్కడకు తీసుకెళ్ళమన్నట్లు రాధకు సైగ చేశాను.

రాధ నా అభిప్రాయం గమనించి అందరినీ అక్కడికి తీసుకుపోయింది.

ఆ వైన్ షాపు చాలా పెద్దది. నగరంలోనే చాలా పెద్దదిలా వుంది. రాధే అందరినీ లోపలకు సర్దింది. దాదాపు వందమంది వున్నవాళ్ళు సులభంగానే లోపల పట్టారు.

లోపల కొవ్వొత్తి ఒకటి వెల్గించింది. తలా ఒక బాటిల్ యిచ్చింది, తెరిచి.

రుచిగా అన్పించింది కాబోలు, ఏదో అనుకుని కొందరు అదేదయినది గ్రహించి మరి కొందరూ, మరి దొరకదేమో అని ఇంకొందరూ ఎగబడి మరీ తాగారు.

కళ్ళు పోగానే, మెదడు కూడా పని చేయటం మానేసినట్లుంది. కాస్త డోస్ పడగానే కేకలు, రంకెలు వేయటం మొదలెట్టారు.

గుమ్మం బయటే నిలబడి లోనికి చూస్తున్నాను.

ఇంత జరిగినా రాధ చేయి వదల్లేదు ఒకడు. బలిష్టంగానే వున్నాడు. తాగిన మైకంలో ఆమెని మీదకు లాక్కుంటున్నాడు. రాధ కూడా వదిలించుకోవటానికి ప్రయత్నిస్తోంది.

అది చూడగానే నా కళ్ళు మండిపోయింది. లోపలకు వెళ్ళి వాడిని తన్ని, రాధని లాక్కొద్దామన్నంత ఆవేశం కలిగింది. అయినా నన్ను నేను నిబ్బరించుకున్నాను.

చాలామంది క్రింద పడిపోయారు అప్పటికే! కొంత మంది దొర్లుతున్నారు, ఏదో గొణుగుతూ!! విదేశీ సరుకు కాబోలు.

రాధని రమ్మనమన్నట్లు సైగ చేశాను. ఆమె కళ్ళు, ఆమె తండ్రిమీద నిలిచాయి. ఇంకా వాడామె చేయిని వదల్లేదు.

కొరకమన్నట్లు సైగ చేశాను రాధకి.

చురుక్కుమనగానే వాడు రాధ చేయిని వదిలేశాడు. మరుక్షణమే అందరి కాళ్ళూ, చేతులు తొక్కుకుంటూ, నావైపు పరుగెట్టుకుంటూ వచ్చింది రాధ.

"తప్పించుకు పోతూంది. పట్టుకోండి!" అరిచాడు వాడు, జరిగింది గ్రహించి.

గుమ్మం దగ్గర కాపలాగా ఉన్నవాళ్లు లేచి నిలబడలేక పోయారు. గుమ్మం దగ్గర రాగానే రాధ చేయి అందుకొని, ప్రక్కకు లాగాను. ఆ క్షణమే బయటికి దూసుకు

వచ్చిన బాటిల్ ఒకటి, రోడ్ మీద పడి భళ్ళున పగిలి పోయింది.

ఇద్దరం ట్రక్ వైపు పరుగెత్తాము.

రోడ్ మీద వైన్ బాటిల్స్ పడుతున్నాయి. కేకలు, అరుపులు.

"మా నాన్న...!" అంటోంది రాధ.

ఆమెని సీట్లోకి ఎక్కించి, స్టార్ట్ చేసి, రివ్వున వెనక్కి పోనిచ్చాను.

చాలా దూరం వచ్చాక ఆపాను ట్రక్ని.

చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తోంది రాధ. ఆమె దగ్గరికి జరిగి అనునయించసాగాను. నా గుండెలమీద తల వాల్చి ఏడవసాగింది పెద్దగా!

దుఃఖం తీరాలంటే ఏడవనివ్వాలని బాగా తెలుసు నాకు.

అయిదారు నిమిషాల తరువాత తేరుకుంది రాధ.

"చూడు రాధ! ప్రస్తుతం మనమున్న పరిస్థితులు వేరు. బంధుత్వాలు, మమకారాలు వదిలెయ్యాలి. అదంత తేలిక గాదని నాకు తెలుసు. కాని తప్పదు.

ఆ యింద్రధనుస్సు ప్రభావం వల్ల వారి కళ్ళేకాదు, మతికూడా పోయినట్లుగుపడుతోంది. నువ్వెంత ప్రమాదం నుంచి బయటపడ్డావో తెలుసా?"

"కాని మా నాన్న...ఆయన చెప్పటం వల్లే అందరూ నన్ను ఏమీ చేయలేదు. వాళ్ళకి మార్గదర్శకంగా ఉండాలని తెలిపింది మా నాన్నే!"

"నిజమే! వాళ్ళకి మార్గదర్శకంగా ఉండాలని వారు కోరుకోవటంలో తప్పులేదు. కాని నీ పరిస్థితి ఏమిటి? ఎల్లకాలం వారితోనే ఉండిపోతావా? ఆ పిచ్చివాళ్ళ

మధ్య పిచ్చివాడయిపోయాడు మీ నాన్న. యిలా అంటు న్నానని వేరే అనుకోవద్దు. నువ్వే ఆలోచించు. ఎవ రయినా ఈ పరిస్థితుల్లో స్వార్థమే కోరుకుంటారు. మీ నాన్న కూడా తన స్వార్థమే కోరుకుంటాడేమో...!"

రాధ అంది తర్వాత. "ఒక పని చేస్తే...నాన్నని వాళ్ళనుండి తప్పించి మనతో బాటు తెస్తే?"

"మనతోపాటా? మన సంఘంలో ప్రతివారికీ బంధు వులు వున్నారు. వారూ నీలాగ అంటే!"

"మనం విడిగా వుందాం!"

"విడిగా బ్రతకలేము. అందరితోపాటే కలసి మెలసి జీవించాలి!" నా నిర్ణయాన్ని తెలిపాను.

మరి మాట్లాడలేదు రాధ.

ఆ రోజల్లా వస్తు సేకరణలో గడిపాము. ఆరాత్రి ఒక యింట్లో బసచేశాము. రాత్రి రాధ నా పడక మీదికి చేరి నన్ను అల్లుకుపోయింది.

"రాజూ! ఐ లవ్ యు! ఐ లవ్ యు!" అని గొణుగు తుంటే నేను మాట్లాడలేదు. ఆమె అందాల్ని ఆస్వాదిస్తూ ఉండిపోయాను.

# 9

గడువు ముగిసిన రోజు సాయంత్రానికి ఇద్దరం చేరు కున్నాము. ఈ అయిదు రోజుల్లోనూ ఏడు ట్రక్కులు, ఒక బస్ నిండా వస్తువుల్ని సేకరించగలిగాము.

హైస్కూలు గ్రౌండ్ అంతా దాదాపు ట్రక్కులు, లారీలు, బస్సులతో నిండిపోయింది. కాంపౌండ్ చుట్టూ ఎత్తయిన గోడ ఉండటం, నలుగురయిదుగురు పిస్టల్స్‌తో గేటు దగ్గర కాపలా ఉండటం వల్ల కొంత మంది అంధులు మా ప్రయత్నాల్ని గ్రహించి ఏమీ చేయలేక పోయారు.

ఆ రోజు సాయంత్రం హైస్కూలులోనే అందరం సమావేశం అయ్యారు. డాక్టర్ సుధామోహన్ లేచి, గొంతు సవరించుకొని చెప్పసాగాడు.

"డియర్ ఫ్రెండ్స్! మనం యిక్కడుండటానికి ఎటువంటి పరిస్థితులు కారణాలో మీకు తెలియనిది కాదు. సుమారు వారం రోజుల నాటి సంఘటనలు మనల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది. అదృష్టవశాత్తు గుడివాళ్ళు కాకుండా తప్పించుకొన్న వారిలో మనం కొందరం. ఇంకెంత మందో ఇలాగ తప్పించుకొని ఉండవచ్చు. కాని వారందరిని ఒక చోట చేర్చటం అసంభవం.

ఈనాడు ముఖ్యంగా మనం చర్చించవలసిన అంశం, ఇకముందు మనం గడపపోయే జీవితం. మన మొత్తం రెండువందల మందిమి ఉంటాము. ఈ రెండు వందల మందితోనే నూతన శకం ప్రారంభం కావాలి. నూతన సమాజం ఏర్పడాలి.

ఇది వరకు మన సంఘంలో ఉన్న కట్టుబాట్లు, ఆచారాలు ఉండకూడదు. మానవ జీవితానికి సుఖప్రదమయిన జీవనానికి కావల్సిన హంగులు సమకూర్చ కలగాలి. అందుకే మన సంఘానికి ఎటువంటి కట్టుబాట్లు ఉండకూడదు. ఒక రకంగా హిప్పీ సమాజానికి దగ్గరగా ఉంటుంది స్థూలంగా.

మనం ఈ సంస్కరణలు చేయడానికి మూలకారణం, మనం అనుభవించిన పాత జీవితం.

ఇదివరకు ఎంతోమంది మేధావులు, సంఘ సంస్కర్తలు, మహానుభావులు ఎన్నోఏళ్ళుగా సంఘంలో పేరుకు పోయిన అన్యాయను, ఈర్ష్యలను, మూఢాచారాలను వెలివేయాలని ఎంతో శ్రమపడ్డారు. కాని, వారి శ్రమ బూడి

దలో పోసిన పన్నీరే అయింది.

సంఘంలో అవినీతి తగ్గకపోగా, మరింత యెక్కువగా సాగింది. అందుకే మన జీవితాలలో అలజడులు, ఆందోళనలు. దీనికి కారణం ఒక్క ఆర్థిక అసమానతలే కాదు, మనుషులలోని నీచబుద్ధి, ప్రవృత్తి కూడా.

ఇలా కారణాలు చెప్పుకుంటే ఎన్నయినా వస్తాయి. కాని, మనకు కావల్సింది అవి కాదు. మన ముందుజీవితం.

అందుకే, మనం సంఘాన్ని తీర్చి దిద్దుకోవాలి. నియమాలు, కట్టుబాట్లు వుండటంవల్ల ఎన్నో అనర్థాలకు దారి తీస్తాయని వేరే చెప్పనవసరం లేదు.

నాగరిక జీవితానికి, మెషిన్లకు అలవాటుపడిన మనకు ఈ జీవితం భయంకరంగా వుంటుంది. కాని తప్పదు. మనం యిప్పుడు ఆదిమానవులము. మననుంచి డెవలప్ జరగాలి.''

ఇలా తన అభిప్రాయాలు బయటపెట్టాడు సుధామోహన్. ఆయన తరువాత చాలామంది తమతమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. కొంతమంది విడిపోవటానికి కూడా సిద్ధపడ్డారు.

అందరి అభిప్రాయాలు విన్నాక, చివరగా నేను లేచి మాట్లాడటం మొదలుపెట్టాను.

''జంటిల్మన్! నేను మీ అందరికి చెప్పదగ్గవాడిని కాను. మీ అంత తెలివితేటలు గాని, వయస్సుగాని, అనుభవంగాని నాకు లేదు. అయినా నా చిన్న అనుభవంతోటి మీకు కొన్ని విషయాలు చెప్పదలుచుకున్నాను.

ఏ సంఘానికైనా మూల స్తంభం, మూలస్థానం 'వ్యక్తి'. వ్యక్తిలేనిదే 'సంఘం' లేదు. వ్యక్తుల కలయికే 'సంఘం'. ఏ సంఘంలోనయినా తొలి ప్రయోజనం 'వ్యక్తిశ్రేయస్సు'. వ్యక్తి శ్రేయస్సుమీద ఆధారపడే 'సంఘ శ్రేయస్సు' వుంది. ఈ సంగతి మీకూ తెలుసు.

అందుకే మన సమాజంలో వ్యక్తిశ్రేయస్సుకి ప్రాధాన్యత యిచ్చారు. అయితే, అనేక యితర కారణాలవల్ల; వ్యక్తుల అహంకారం, అహంభావం; బలవంతుల, ధనవంతుల జోక్యంవల్ల సంఘ స్వరూపమే మారిపోయింది. అందుకే ఎన్నో తేడాలు, అక్రమాలు, అవినీతి. ఇంకా ఎన్నెన్నో!

నేను వాటి జోలికి పోదలుచుకోలేదు. ఎందుకంటే వాటిని గురించి మీకు బాగా తెలుసు.

నేను చెప్పేదేమంటే, పూర్వం మన సంఘ నియమాలను, పూర్తిగా తొలిగించాలనటం మూర్ఖత్వమే అవుతుంది. మంచిని గ్రహించి, చెడుని వదలాలి గాని, చెడుతోపాటు మంచినికూడా వదలటం మంచిది గాదు.

ఆదిమానవుల దగ్గర్నుంచి మనజీవితం చూస్తే ఐకమత్యమే బలం అన్నది అందరికీ బోధపడుతుంది. అంత దాక ఎందుకు?...మనమంతా ఎందుకు కలుసుకున్నాము? ఇక్కడే కన్పిస్తుంది మన ఐకమత్యం. అందరూ కలిసి కట్టుగావుంటే ఎన్నో లాభాలుంటాయి.

మరో సంగతి...యిక్కడ ఆడవాళ్లు, నలభై, మూఫ్పై మందికంటె ఎక్కువ లేరు. కాని, మగవాళ్ళుమాత్రం నూటయాభైమంది. ఈ లెక్కన ప్రతి స్త్రీకి ముగ్గురు పురుషులు. మానవుడికి తిండి, బట్ట, గుడ్డ ఎంత అవసరమో సెక్స్‌కూడా అంత అవసరమే! మరి ఒక్కొక్క స్త్రీ ముగ్గురు పురుషుల్ని భరించగలదా? లేక ఆమె కేవలం పిల్లల్ని కనటానికేనా? అందుకే ఒక స్త్రీకి ఒక పురుషుడు అంటూ వివాహాన్ని ఏర్పరచాలనుకుంటాను నేను.

ఇంకొక సంగతి ... ప్రస్తుతం ఎంతోమంది గ్రుడ్డివాళ్ళయిపోయారు. వారిని అలాగే వదిలెయ్యకూడదు. వారికి

పుట్టే పిల్లలు మంచివారుగానే పుడతారేమో!

మన సంఘాన్ని వృద్ధిచెయ్యాలంటే ఒకటే మార్గం. మనమంతా కష్టపడి పనిచెయ్యాలి. మనలో ఆర్థిక వ్యత్యాసా లుండకూడదు. అంతేగాదు, అంధ స్త్రీలను కూడా పెళ్ళి చేసుకోవాలి. మనలో డాక్టర్లు, సైంటిస్టు లున్నారు. వారికా గుడ్డితనం పోగొట్టే మందును కనుగొనాలి. ఒక్కొక్కరికే చూపు తెప్పించి, మన సంఘంలో కలుపుకోవాలి!''

ఇలా ఆవేశంగా ముగించి కూర్చున్నాను. ఆ చిన్న సభలో కలకలం రేగింది.

అంతవరకు యితరులు చెప్పింది వేరు. నేను చెప్పింది వేరు. కొంతమంది నా వంక చూసి నవ్వుతున్నారు. మరి కొంతమంది సీరియస్‌గా ఆలోచిస్తున్నట్లు కన్పిస్తున్నారు. ఇంకొంతమంది నా వంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. వారిలో ఒకతె అనూరాధ.

మేమీ సంగతి తెల్సుకోక ముందే, బయటినుంచి, కేకలు విన్పించాయి.

బయట ప్రహరీదగ్గర, ఇనుప గేటవతల కొన్ని వందల మంది గుడ్డివాళ్ళు నిలబడి వుండటం కన్పించిందా మసక చీకట్లో.

# 10

ఇటువంటి ఆపద సంభవించవచ్చుననే ఉద్దేశ్యంతో నే రివాల్వర్లు, తుపాకులు మొదలయిన ఆయుధసామగ్రికూడా పోగుచేయటం జరిగింది.

మాలో పదిహేనుమందివరకు తుపాకి పేల్చటం వచ్చు. సేఫ్టీగా వుండటానికి మరికొంతమందికి యిచ్చినట్లే, నాకూ ఇచ్చారు.

కొంతమందితోపాటు, డాక్టర్ సుధామోహన్, కాగ డాలు పట్టుకొని గేటుదగ్గరకు నడిచాడు. గ్రౌండ్ వెనక మరో దారి వుంది. అటు ఎవ్వరూ లేరు.

హేండ్ మైక్‌లో అరచి, చెబుతున్నాడు డాక్టర్.

"జాగ్రత్త! మా దగ్గర తుపాకులున్నాయి. దగ్గరకు రాకండి. ఏమీ చెయ్యడానికీ ప్రయత్నించకండి!"

నేనూ, రాధ చీకట్లో వుండి వారి మాటలు వింటున్నాము. అటునుంచి అలజడి లేచింది. మాలో ఒకరిద్దరు తుపాకులు, రెండు మూడు గుళ్లు కాల్చాకగాని వారిలో అలజడి తగ్గలేదు.

"గేటు తీయండి!" అరుస్తున్నా డొకడు. వారి లీడర్ కాబోలు.

"ఎందుకు?" డబాయిస్తున్నాడు మోహన్.

"మీరంతా మమ్మల్ని మోసం చేశారు. మా ఆహారం, మా వస్తువులు అన్నీ దొంగిలించారు. మేమెలా బతకాలి. మేమూ మీతోపాటే వస్తాం!"

"వచ్చేం చేస్తారు? చంపుతారా మమ్మల్ని?...ఐనా మీ రెందు కింక జీవించి వున్నారు? మీవల్ల లోకానికి ఎటువంటి ఉపయోగమూ లేదు. పైగా మీవల్ల మాకు అపకారమే జరుగుతూంది. ఒకవేళ శ్రమపడి మీకు కళ్ళు తెప్పించినా లాభంలేదు. మీరంతా ఛాందసులు. సంకుచిత భావాలు కలవాళ్ళు. మీవల్ల మా కెటువంటి లాభం లేదు. మీమీద మానవత్వంతో జాలి చూపటం దండగ. మీరు మాతో కలిసి వున్నందువల్ల మేమూ మీలాగే మారిపోతాం."

"మీరు మాత్రం సనాతనులు, ఛాందసులు కారా?

ఇప్పటిదాక ఎవరిదగ్గిర జీవించారు?'' హేళనగా అడిగాడు అతను.

''అవును_జీవించాము. మేము చేయదల్చుకున్న ప్రతి పనికి అడ్డు వచ్చారు. మేము యిప్పుడు సృష్టించబోయే సమాజంలో మీలాంటివాళ్ళకు స్థానం వుండదు. ఉండ నీయము. మాది ఫ్రీ_సొసైటి. అసూయ, అవినీతి, ద్వేషం, పగ...ఏమీ వుండవు!''

పకపక నవ్వాడతను.

''మేము ఛాందసులమే. అసూయాపరులమే! కాని, మీరు?...మీ జాతి, మీ మనుషులు, మీ సంఘం. మీది మాత్రం స్వార్థజీవితం కాదా? మీ కళ్ళున్నవాళ్ళకేనా అన్ని సౌఖ్యాలు ... మాకు అక్కరలేదా? మేము మనుషులం కామా? ఇక ఆర్థిక అసమానతలు అంటావా? అవి మీరు సృష్టించబోయే సంఘంలో వుండవా?''

ఉద్వేగంతో చెబుతున్నాడాయన.

''లేదు. మీ రెన్నటికీ అలాంటి స్వర్గాన్ని సృష్టించలేరు. మానవుడికి ఈర్ష్య, ద్వేషం, అసూయ అన్నవి జన్మతో వస్తాయి. వాటిని వదిలించుకోవటం పెద్ద పెద్ద మునులకే సాధ్యం కాలేదు.

మమ్మల్ని వదిలిపోతున్నారు మీరు. మీరు హాయిగా జీవించగలరా? కొంతకాలం పోయాక మీలో ఎవరికో విసుగు పుట్టవచ్చు. సంతృప్తిగా ఎవరూ జీవించలేరు. ఇప్పుడున్నది చాలకపోవచ్చు. ఇంకా కావాలనిపించవచ్చు. అప్పుడే అంకురిస్తోంది మీలో స్వార్థం. తత్ఫలితంగానే మీలో దగా, మోసం, కుట్ర బయలుదేరతాయి. మళ్ళీ మొదటికే వస్తారు.

అయినా ఇది చెప్పండి. మేము చేసిన నేరం యేమిటి?

మా కళ్ళు పోతే దానికి మేము బాధ్యులమా? చెప్పండి."

చీమ చిటుక్కుమన్నా వినపడేంత నిశ్శబ్దం.

రాధని రమ్మనమన్నట్లు చేతితో తట్టి సైగ చేశాను.

ఇద్దరం స్కూలు గ్రౌండ్ రెండో చివరకు వచ్చాము నెమ్మదిగా.

"రాధా! వారు చెప్పినదాంట్లో కూడా నిజం వుంది. మనం ఎన్నటికీ మనం కోరుకునే స్వర్గాన్ని సృష్టించలేము. మనలో దురాశ, స్వార్థం తగ్గనంతవరకు అటువంటి సమాజం ఏర్పడదు.

మనం యిక్కణ్ణుంచి వెళ్ళిపోదాం. ఇక్కడేమి జరుగుతుందో చెప్పలేము!"

"ఎక్కడికి వెళ్దాం?" నిరాశగా అడిగింది రాధ.

"ఏమో! ఈ విశాల ప్రపంచంలో మనకి చోటు దొరక్కపోతుందా?" అన్నాను.

"అయితే పరిస్థితులు ఎదుర్కొనే ధైర్యం మీకు లేదా?"

"ఇవి పరిస్థితులు కావు. ఇది అంధుల లోకం!"

ఇద్దరం మాకు కావాల్సిన ట్రక్‌లో ఎక్కి, వెనక గేటుగుండా బయటపడ్డాం. అటునుంచి కాల్పులు విన్పిస్తున్నాయి.

రాధ నా దగ్గరికి జరిగి, నన్ను అతుక్కుపోయింది. ఒకచేత్తో స్టీరింగ్ కంట్రోలు చేస్తూ, రెండో చేత్తో ఆమెని మరింతగా పొదువుకున్నాను. నా మనస్సిప్పుడు ఆలోచిస్తూంది.

మా భవిష్యత్తు ఏమిటని?

—: ఐ పో యిం ది :—

# సప్లిమెంట్ పోటీ - 28

143, 144, 145, 146, 147 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలు చేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు మార్చి' 77 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *




## [మొదటి భాగము]

ఆహార, వినోద కార్యక్రమాలు యథాప్రకారం సాగుతున్నాయి.

పర్సర్ (క్రూ మనుషులకు పానీయాలు, పాకెట్ మనీ సప్లయిచేసే ఉద్యోగి) దగ్గరకెళ్ళి ఓ విస్కీ బాటిలూ, ఓ జిన్ను బాటిలు, మూడు గ్లాసులూ తీసుకొన్నాను.

పదడుగులు ముందుకి వేశాను. అంతే! వీపుమీద బలంగా టన్నుదెబ్బ పడింది! వెన్నెముక విరిగినట్లయింది! దభాలున ముందుకు తూలిపడ్డాను!!

గ్లాసులూ, డ్రింక్ సీసాలూ బద్ధాలున పగిలాయ్!!

పడేటప్పుడు నాకు తెలియకుండానే మోచేతులు నేల కడ్డం పెట్టాను. లేకపోతే కళ్ళలోకి సర్రున దిగబడేవి గాజు పెంకులు...

అంత బలమైన తోపు అది!

మోచేతికి గుచ్చుకున్నాయి పగిలిన విస్కీ సీసా ముక్కలు!

చర్మంలోంచి సగం బయటికి కనబడుతున్నాయవి...!!

దెబ్బతిన్న పులిలా వెనక్కి చూసాను.

నలుగురు క్రూర మనుషులు!

తెల్లటి అడివిపందుల్లా నిలబడివున్నారు.

బొడ్డువేపు పరిగెట్టింది నా చెయ్యి పిస్టల్ కోసం.

అప్పటికే ఆలస్యమైంది!

ఒకడు నావేపు మెరుపులా దూకాడు.

అతని బూటుకాలు నా మోచేతిమీదుగా దూసుకు పోయింది.

కెవ్వున అరిచాను బాధగా...

నిప్పుకణిక చర్మంలో దూరినట్లయింది...

మోచేతి భాగంలో సగం పైగా కనబడే గాజుపెంకు పూర్తిగా దిగబడింది!

తెగిన ఆనకట్టలా భళ్ళున బయటికి తన్నింది రక్తం!

నా చేతులూ, కాళ్ళూ మిగతా ముగ్గురు పట్టుకొని చటుక్కున పైకి లేవనెత్తారు.

డెక్ మీదకి తీసికెళ్ళి సముద్రంలోకి విసిరేస్తారా?...

ఆలస్యమైతే పిస్టల్ నాది కాకుండా పోవచ్చు...

తెగించాను!

చేతిలోని బాధ లెక్క చెయ్యకుండా కాళ్ళు చేతులు దగ్గరకి జాడించాను.

అంతే! ముగ్గురి తలకాయలూ కొండల్లా ఢీకొన్నాయ్.

దభాలున నేలమీద కడ్డాను.

నా చేతిలో సగం పగిలిన బాటిల్ ప్రత్యక్షమయింది.

మెరుపులా లేచాను. గాలిలో అది గిరగిరా తిరిగింది.

ఇద్దరు పొట్టలు పట్టుకొని 'కెవ్వ్'న అరిచారు.

"బంచ్ ఆఫ్ స్కౌండ్రల్స్! పేగులు బయటికి లాగుతా!"

అరుస్తూ గిరగిరా త్రిప్పసాగాను సగం పగిలిన సీసా. మరొకడి బుగ్గ చీరుకుపోయింది.

"స్టాపిట్ మేజర్! ప్లీ...జ్!"

ఎవరిదో కంఠం వినబడింది.

ఆగిపోయాను ఆయాసంతో.

కుక్ అతను! షిప్‌లో వంటలు వండే వ్యక్తి!

అందరూ ఒగురుస్తూ నిలబడిపోయారు.

"ఇడియట్స్ గెట్ బాక్!" అన్నాడు కోపంగా అందర్నీ పిచ్చిగా వెనక్కి తోస్తూ.

"షిప్‌లో తిండి తిని దున్నపోతుల్లా బలిసిపోయారు మీరు. బుర్ర పనిచేయడంలేదు మీకు. మనం భయంకర్ని చంపినంత మాత్రాన కాన్స్యోరాని వశపర్చుకోడంఅసాధ్యం. పైగా భయంకర్ చస్తే మన కాప్టెన్ చస్తాడు. కాప్టెన్ని చంపిన తర్వాత కాన్స్యోరాని మనం చంపినా మనకు జరిగేది ఏమీలేదు. ఇటువంటి పిచ్చివేషాలు వేసి కాప్టెన్ ప్రాణాలకు అపాయం తేకండి.

ప్రస్తుతం భయంకర్‌వల్ల మనకేం నష్టంలేదు. అతను దిగిపోయిన తర్వాత మన ప్రయాణం సాఫీగా జరుగు

తుంది. అంతవరకూ మనం సర్దుకుపోక తప్పదు. అండర్ స్టాండ్. నా గో టు మెడికల్ రూమ్!" అరిచాడు కుక్ చేతులు ఊపుతూ.

నలుగురు క్రూ మనుషులు, గాయాలు తడుముకుంటూ మౌనంగా వెళ్ళిపోయారు.

"మిస్టర్ భయంకర్! మా మనుషుల తరఫున నేను క్షమాపణలు చెప్పుకుంటున్నాను. ఆపరేషన్ చేసి మీ చేతిలోని గాజుపెంకులు తీసెయ్యాలి. ప్లీజ్ ఫాలో మీ" అన్నాడు కుక్ నా భుజం పట్టుకుంటూ.

ఎడంచేతిలోని పగిలిన సీసా విసిరేసి అతనివెంట నడిచాను గంభీరంగా.

* * *

నిన్నటి సంఘటనలతో క్రూ మనుషులు నా దారికొచ్చారు. మౌనంగా ఎవరి పని వాళ్ళు చూసుకుంటున్నారు. ప్రయాణీకులు కొందరు డెక్ మీది స్విమ్మింగ్ పూల్లో, బేతింగ్ దుస్తులతో కేరింతలు కొడుతూ స్నానాలు చేస్తున్నారు.

కొందరు టబ్ ఛెయిర్స్లో కూర్చొని కులాసాగా బీర్ చప్పరిస్తున్నారు.

స్విమ్మింగ్ పూల్ ఒడ్డునవున్న ట్రాన్సిస్టర్లోంచి స్వర్గీయ జిమ్ రీవ్స్ కంఠం శ్రావ్యంగా పలుకుతోంది.

జిమ్ రీవ్స్!

ఎంత హాయిగా పాడేవాడు.

హెలికాప్టర్లో ఎన్నో ప్రాంతాలు తిరిగి తన ప్రోగ్రామ్స్ యిచ్చేవాడు.

ఇతర గాయకుల కిది కన్నెర్ర లయింది.

అతని కాప్టర్లో బాంబు పెట్టారు.

ఇక లేడు జిమ్ రీవ్స్. ఇంకా అతని కంఠం అభిమానులు వినొచ్చు.

డెక్ మీద నిలబడి సిగరెట్ పీలుస్తూ ఇంగ్లీష్ పాట వింటున్నాను.

బికినీ ధరించిన విదేశీ యువతులు డెక్ మీద బోర్లా పడుకున్నారు మత్తుగా.

స్విమ్మింగ్ పూల్ లో ఓ ఎఱ్ఱటి టైరు చేతులతో పట్టు కొని ఉత్సాహంగా ఈదుతున్నాడు మూగకుఱ్ఱాడు జానీ. అతను నావైపు నవ్వుతూ చేతులాడిస్తున్నప్పుడల్లా పలక రింపుగా, ప్రోత్సాహపూర్వకంగా తలాడిస్తూ నవ్వు తున్నాను.

సముద్రం మీంచి చల్లని గాలి వీస్తోంది.

"సర్" అన్న పిలుపు వినబడింది.

తల త్రిప్పి చూసాను. కుక్!

ట్రేలోని కాఫీ కెటిల్ తో నా ముందుకు వచ్చాడు.

"హలో కుక్! ఏమంటున్నారు మీ వాళ్ళు?" అడి గాను సిగరెట్ సముద్రంలోనికి విసిరేస్తూ.

"వాళ్ళ ఖర్మ సార్! మరో వారంరోజులు త్వరగా గడిచిపోవాలని కోరుకుంటున్నాను. ఈ రగడలు నా కిష్టంలేదు" అన్నాడు కుక్ కెటిల్ లోని కాఫీ పింగాణీ కప్పులో పోస్తూ.

"గుడ్! శర్వోరాకి కాఫీ పంపావా?"

"లేదు సార్. ఇప్పుడు వెళ్తాను."

"మరో రెండు కప్పుల్లో పొయ్యి. శర్వోరాకీ, కెప్టెన్ కీ నేను పట్టుకెళ్తాను."

"కాప్టెన్ కాఫీ త్రాగరు సార్! కాఫీలో కాఫిన్ అనబడే విషం వుంటుందట. అందుకని అమృతం మాత్రం తాగి మత్తుగా పడుకుంటూ వుంటారాయన" అంటూ ట్రే నాచేతి కిచ్చాడు కుక్.

తిన్నగా శాన్యోరా గదికి నడిచాను.

కాప్టెన్ బంధించబడిన చేతుల్తోనే ఏదో యింగ్లీష్ నవల చదువుతున్నాడు.

శన్యోరాకి కాఫీపోసి ఓ కప్పు యిచ్చాను.

ఇద్దరూ సిప్ చేయసాగాం.

"ఎక్స్‌క్యూజ్ మీ కాప్టెన్! హౌ ఎబౌట్ ఎ కాఫీ?" గౌరవంకోసం అడిగాను.

"నో థాంక్యూ" కాప్టెన్ ఓసారి పుస్తకంలోంచి తలెత్తి మళ్ళీ దించుకున్నాడు.

కాఫీ ఆఖరిగుక్క తాగి కప్పు ట్రేలో పెట్టాను. శన్యోరాకూడా తాగడం పూర్తిచేసింది.

"ఎలా వుంది నవల?" అడిగాను కాప్టెన్ని నవ్వుతూ.

"ఫైన్ బుక్. మంచి సస్పెన్సులో కొట్టుకుంటున్నాను, డిటెక్టివ్ తన ఫ్రెండ్ హోటల్కి వస్తాడు. కాఫీ తాగడం ముగించగానే నేలమీద కూలిపోతాడు. అతను తాగిన కాఫీలో మత్తుమందు కలపబడు..." కాప్టెన్ మాటలు పూర్తికాలేదు. అదిరిపడుతూ పైకి లేచాను. తల గట్టిగా విదిలించాను.

"మో...సం" అరవాలనుకొన్నాను. కానీ, గొంతుక పట్టేసింది. ఊహుఁ లాభంలేదు...కళ్లు మసకలు కమ్మసాగాయి. తల దిమ్ముగా...శన్యోరాకికూడా నా పరిస్థితే

ఏర్పడ్డం మసగ్గా కనబడింది. కుక్ అప్రయత్నంగా స్మృతి పథంలో మెరిసి మాయమయ్యాడు.

అంతే! తటాలున జారిపోయాను బరువుగా.

*                    *                    *

బరువుగా కళ్లు తెరిచాను.

స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపిస్తున్న డాక్టర్ వెనక్కి తగ్గాడు. తలతిప్పి చూసాను. శనోర్యా కంగారుగా అప్పుడే లేచి కూర్చుంటోంది.

మేము మెడికల్ రూంలో వున్నట్లు గ్రహించాను. బెడ్ ప్రక్కగా కొత్త యూనిఫాంలో నిలబడ్డ కాప్టెన్ నవ్వుతూ కనిపించాడు. అతని ప్రక్కగా...కుక్!

పిడికిళ్లు బిగించాను.

"మేజర్! ఎవరు కాఫీలో మత్తుమందు కలిపింది?" అడిగింది శానోర్యా.

"దట్ బాస్టర్డ్" అన్నాడు కళ్ళతో కుక్‌ని చూపి.

శానోర్యా బెడ్ మీంచి స్ప్రింగ్‌లా లేచింది.

ఆమె సింహనాదం చూస్తూ కరేటా స్టయిల్లో కుక్ మీదకి ఎగిరింది.

కుక్ భుజంమీద గండ్రగొడ్డలిలా పడింది ఆమె చెయ్యి.

అతని గుండెలమీద శివంగిలా వుంది శానోర్యా.

ఆ స్థితిలో తాను ధరించిన గౌను పిక్కల పైకి లేచి పోడంకూడా గుర్తించలేదామె.

"మిస్ శానోర్యా! నో ఫీట్స్ ప్లీజ్!" అన్నాడు కాప్టెన్ అటువైపు కదిలి, తాపీగా.

అతని చేతిలో యిప్పుడు రెండు పిస్తోళ్ళు మెరుస్తున్నాయి.

శాన్యోరా వాటివైపు చూసి గౌను సర్దుకుంటూ నిస్సహాయంగా పైకి లేచింది.

"డక్! మోసం చేశావ్!" అన్నాను పళ్ళు కొరుకుతూ,

"హి ఈజ్ ఎ బాండికూట్" అర్చింది శాన్యోరా, ఎగిసి పడే గుండెల్తో.

"సారీ మేజర్! తెలివి ఉపయోగించాను అనాలి," అన్నాడు. డక్, నవ్వి చేత్తో భుజం రాసుకుంటూ.

"మిస్టర్ భయంకర్! ప్లీజ్ లిసెన్ టుమి. యిప్పుడు మీరు నిరాయుధులు. మిమ్మల్ని పోర్ట్ సుడాన్ పోలీసులకు అప్పగించవచ్చు. కాని నేను అలా చెయ్యాడంలేదు. అప్పటిదాకా మిమ్మల్ని ఈ షిప్‌లో ఉంచుకోడం పాము పిల్లలకు పాలు పోయడం అవుతుంది. మా దృష్టి మీ బాధ్యతలమీద ఉండదు. సో మీరు బతకడానికి ఓ ఛాన్సు యిస్తున్నాను" అంటూ ఆగాడు కాప్టెన్.

"సిగరెట్ కాప్టెన్" అడిగాను.

సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె నా ఒళ్ళోకి విసిరాడు కాప్టెన్. రెండు ఫిల్టర్ సిగరెట్లు నోట్లో పెట్టి ఒకేసారి వెలిగించాను. ఒకటి శాన్యోరాకిచ్చాను. ఆమె ముఖంలో ఏదో ఆత్రుత కనబడింది నాకు.

గట్టిగా దమ్ము లాగాను. "స్పీకాన్ కాప్టెన్."

"మిస్టర్ భయంకర్! నిన్నూ, శాన్యోరాను ఈఅనంత సముద్రంలో ఓ సాధారణ లైఫ్ బోటులో వదిలేస్తాం!!"

(సశేషం)

